# అపరాధ పరిశోధన

రూ.4.50 | మే '81 |

సప్లిమెంట్



# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఓటమికి ఒక్క క్షణం

రచన : సికిందర్

## నిప్పులు కురిసిన రాత్రి

రచన: ఎమ్. వి. వి. సత్యనారాయణ

## పరశురాముడు

రచన: వాణిశ్రీ

## అడుగో హంతకుడు

రచన : టెంపోరావ్

పొగమంచు—పదిహేడవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్ – 89**
మే, 1981
వెల: రు. 4-50

ఏడాది చందా 55 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

18 4/81

# ఓటమికి ఒక్క క్షణం!

సికిందర్

హోటల్ మౌర్య విశాలమైన గార్డెన్ సెక్షన్‌లో అడుగు పెట్టినప్పుడు నా కళ్ళు నలువేపులా ఆత్రుతగా పరికించాయి. ఎటు చూసినా జనం, వాళ్ళ హడావిడి, సందడి, కోలాహలం తప్ప; ఒక్క నిమిషం ప్రశాంతంగా మనసుకు విశ్రాంతి కావాలనుకునే వారికి తావులేని చోటు అది.

మరోసారి చుట్టూ చూసి, ఇహ చూపులతో లాభం లేదనుకొని కౌంటర్ దగ్గరికి నడిచాను.

బిల్స్ తీసుకుంటూ బిజీగా వున్న చురుకైన యువకుడు నా వైపు అసహనంగా ఓ చూపు పారేసి, "యస్, ప్లీజ్?" అన్నాడు పొదుపుగా.

"ఆత్మారాం కావాలి" అన్నాను ఉదారంగా.

అతని కళ్ళు విశాలమయ్యాయి. దీర్ఘంగా చూశాడు.
"ఆత్మారాం కావాలా?"

"యస్, అవును."

"అలా వెళ్ళండి....కుడివైపు; తిన్నగా మూలకి. గుర్తుపట్టగలరా?"

"పరిచయముంది, గుర్తుపట్టాను."

"బెస్టాఫ్ లక్!"

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్."

వెనుదిరిగి వేగంగా నడిచాను. నాకిప్పుడు ఆతృత ఇంకా అధికమైంది. విశ్రాంతిలేని కళ్ళు చురుగ్గా గాలిస్తున్నాయి అతని కోసం. కన్పిస్తాడా?....గుర్తిస్తానా?. అనే సందేహాలతో జనాన్ని రాసుకుంటూ తోసుకుంటూ వెళ్ళి, అప్పుడు చూశాను అతన్ని: ఫెన్సింగ్ దగ్గర మూలంగా ఒంటరిగా కూర్చుని వున్నాడు.

తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాను. అతను సిగరెట్ తాగుతూ పైకి చూస్తున్నాడు—వేదాంతిలా ఎటో. సాయంకాలపు పచ్చటి నీరెండకి అతడి విశాలమైన నుదురు తామ్రఫలకంలా మెరుస్తోంది. కాని కళ్లు మాత్రం డిస్చార్జి అయిన టార్చి బల్బులా చికాకు వ్యక్తపరుస్తున్నాయి. ముఖ కవళికలు పార్టీలు ఫిరాయించే మన ప్రియతమ నాయకుల్లా ఉండుండి మారిపోతున్నాయి.

సమీపించి కుతూహలంగా చూశాను. తేరుకుని తల తిప్పి చూశాడతను. అంతే, అది ఫ్రీజ్ షాట్! కొన్ని క్షణాలలాగే బొమ్మలా ఉండిపోయాడు.

హఠాత్తుగా ఎగిరి నిలబడి బలంగా, దురుసుగా పట్టి ఊపేశాడు.

"నువ్వా! రామన్! అరె, ఏమిటి? ఎప్పుడొచ్చావు? ఎలా వున్నావ్? నువ్వసలు ఉన్నావా? నేను గుర్తున్నానా?...." ఇంకా అరుస్తున్నాడు.

నవ్వి విడిపించుకొంటూ, "నువ్వు గుర్తున్నావు, అందుకే

వచ్చాను" అన్నాను.

అతడి ముఖం పట్టలేని ఆనందంతో వెలిగిపోతోంది.

"కూర్చో! కూర్చో రామన్!"

"నన్ను బాగానే గుర్తుపట్టావుగానీ, పేరు రామన్ కాదు మోహన్."

"ఓహ్, సారీ!" అతను బాధపడ్డాడు, "నాకు ముఖాలు గుర్తుంటాయిగా నీ పేర్లు జ్ఞాపకముండవు."

"నువ్వు చాలా మారిపోయావు, ఆత్మారాం."

"నా వయసు అయిపోయింది, మోహన్" నిట్టూర్చాడతను.

అతని మాట నిజం. అతని వయసు అయిపోయింది.

"నువ్వేలా ఊడిపడ్డావు? మనం కలిసి రెండేళ్ళయినట్టు జ్ఞాపకం....ఆ రోజు తర్వాత మళ్ళీ నువ్వు కన్పించకపోతే నా కథ బోరు కొట్టిందనుకున్నాను."

"లేదు, నీ కథ బాగానే వుంది. దాన్ని వ్రాశాను కూడా—'చివరకు దక్కిందేమిటి' చదివే వుంటావు."

"నేను కథలు చదవను, చెప్తాను. నువ్వు వ్రాస్తావు. అన్నట్టు ఇక్కడికెలా వచ్చావు? నిన్ను చూసిన షాక్ నుంచి కోలుకోలేక పోతున్నాను—"

"నువ్వు హైద్రాబాదులో లేవని తెలిసింది. బెంగుళూరికి మకాం మార్చావని అక్కడ హోటల్ వాళ్ళు చెప్పారు. ఇక్కడ ఫ్రెండ్ని కలవాలని బయలుదేరి వస్తూ నీ అడ్రసు తెచ్చుకున్నాను."

"హైద్రాబాదు బోరుకొట్టింది, రామన్. వదిలేశాను."

"నా పేరు మోహన్. ఇక్కడెలా వుంది బిజినెస్?"

"ఫరవాలేదు. కానీ రోజులన్నీ ఒకేలా ఉండవు."

"ఇక్కడ శ్రోతలెన్నెలా ఆకట్టుకొంటున్నావు? నీ

కిక్కడి భాష తెలియదు."

"ఎందుకు తెలియదు మోహన్? నే పుట్టింది ఇక్కడ, పెరిగింది ఇక్కడ, నా మాతృ భాష కన్నడ. మీ ప్రాంతంలో పదేళ్ళున్నాను. అందుకే తెలుగు చక్కగా మాట్లాడగల్గుతున్నాను, అంతే!"

ఆశ్చర్యంగా చూశాను అతన్ని.

అతను ముందుకువంగి పరీక్షగా చూశాడు. "రామన్ మనం ఇదే మే నెలలో సరిగ్గా రెండేళ్ళ క్రితం హైద్రాబాదులో కలుసుకున్నాం. అవునా? ఆ రోజు నిన్ను చూసినప్పుడు బాగుపడే లక్షణాలు కన్పించాయి. ఎంత వరకు బాగుపడ్డా విప్పుడు?"

"ఆర్థికంగానా? ఆర్థికంగా నేనేం సంపాదించలేదు."

"మరెలా ఖర్చుపెడ్తున్నావ్?"

"కొన్ని వనరులున్నాయి. జాతీయ వనరులు కావు, ప్రైవేట్. నువ్విక చెప్పు!"

"ఏం చెప్పాలి?"

"కథ! ఇంకేం చెప్తావు, చాడీలా?"

"వ్రాసేవాడివి!నీకెందుకు కథ?ప్లాట్స్ తట్టడంలేదా?"

"కాదు. నా ప్లాట్స్ వాస్తవ సంఘటనల్ని ఆధారం చేసుకొని ఉండవు. నా కథల్లో నేనెలా జరగాలను కుంటానో ఆ పద్ధతిలో నే క్రైం సృష్టిస్తాను. అంతేగానీ ఎక్కడో జరిగిందో, లేక జరగబోయేదో సంఘటనలు నా కథల్లో చోటు చేసుకోవు."

"ఏం కథ చెప్పాలి నీకు.... ఖర్చవుతుంది."

"అవును. డజను కప్పుల టీ, యాభై రూపాయల నోటు. అంతేనా?"

"అంతే! నా రేటు ఎప్పుడూ అంతే!"

బేరర్ని పిల్చి రెండు టీలకు ఆర్డరిచ్చాను.

ఆత్మారాం తృప్తిగా చూశాడు నన్ను. "ఆల్ రైట్, అయితే చెప్తాను....నువ్వెప్పుడైనా ఢిల్లీ వెళ్ళావా?"

"లేదు."

"వెరీ బాడ్. ఇండియా పౌరుడవైయుండి నువ్వు మన రాజధాని ఢిల్లీ చూడకపోతే దేశానికి గొప్ప ద్రోహం చేసినట్టే లెక్క!"

"అలాగా, నాకు తెలీదు!"

"ఇప్పుడైనా తెలుసుకొని కళ్ళు తెరు. రెండు నెలల క్రిందట నేను ఢిల్లీ వెళ్ళాను. ఎందుకని అడుగు. వూరికే! ఆ క్రిందటి నెలలో మంచి బిజినెస్ జరిగింది. చేతినిండా డబ్బు. ఏం చెయ్యాలో తోచలేదు. ఢిల్లీ వెళ్ళిపోయాను. అక్కడ వారం రోజులుండి చేతులైతే ఊపుకుంటూ వచ్చాను గానీ, నా శ్రోతల కోసం కొత్త అయిటం పట్టుకొచ్చాను."

"ఏమిటది?"

"అదే నీకిప్పుడు చెప్పబోతున్నాను. ఈ కథ అక్కడ జరిగిన ఒక ప్రముఖ సంఘటన—నీకు తెలిసే వుంటుంది—బిల్లా రంగా తర్వాత అంతటి సంచలనం కల్గించిన సంఘటన నీకు తెలిసి వున్నా ఎందుకు చెప్తున్నానంటే, అందులో నీకు లోతుపాతులు పూర్తిగా తెలిసివుండవన్న నమ్మకంవల్ల!

నాకు తెలిసినంతగా దీని గురించి మరెవరికీ తెలీదు. పత్రికలకీ, పోలీసులకీ ఎవరికీ తెలియని సంగతులు నాకు తెలుస్తుంటాయి. నా విషయ సేకరణ పద్ధతి అలా వుంటుంది—జనాన్ని ఎలా హిప్నటైజ్ చేసి పలికించాలో నాకు కిటుకలు తెలుసు. నీ వెనుక వుండి కొన్ని హింట్స్

ఇస్తుంటాను, నన్ను డిటెక్టివ్‌గా సృష్టించి కథలు వ్రాయ్! ఎలా హిట్ కావో చూస్తాను."

"డిటెక్టివ్‌లు వద్దు. ఇది స్పై నవలల శకం. బ్రెయిన్‌కి స్ట్రెయిన్ కల్గించని తేలికపాటి సాహిత్యం కావాలి. జూడో కరాటే హీరోలు కావాలి. నిన్ను చూస్తే అందుకు పనికిరావు."

"నెవర్ మైండ్, ఉదాహరణ కోసం చెప్పాను. సరే, ఈ సంఘటనంతా డైలాగ్‌తో సహా సినిమా చూసినట్టు ఎలా చెప్తున్నానని నీకు డౌట్ రావచ్చు. నా గురించి నీకు తెలుసు. అక్కడక్కడా విన్న సంగతుల్ని ఒకచోట చేర్చి ఎడిట్ చేస్తాను. ఒక వరుసక్రమంలో అమర్చి అక్కడక్కడా పాచ్ వర్క్ నా వూహాతో పూర్తి చేస్తాను. సీక్వెన్స్‌నిబట్టి ఫలానాచోట ఫలానా వ్యక్తి ఫలానా విధంగా ప్రవర్తించి వుండవచ్చని వూహిస్తాను; ఫలానా మాటలు మాట్లాడివుండవచ్చని తలపోస్తాను. అప్పుడే వింటానికి ఇంట్రెస్టింగ్‌గా, థ్రిల్‌గా వుంటుంది; నా కబుర్ల ప్రధాన లక్ష్యం వినోదాన్ని అందించడం. లేకపోతే నువ్వు రేడియోలో వినే వార్తలకి వీటికీ తేడా వుండదు. ఏమంటావు?"

"సరే చెప్పు!" అన్నాను కుర్చీలో వెనక్కి వాలి, వింటానికి సిద్ధమవుతూ.

"ఆల్ రైట్, అయితే విను మోహన్!" అన్నాడు ఆత్మారాం, మొదటి టీకి ప్రారంభోత్సవం చేస్తూ....

## 2

"ఆ రోజు శనివారం. సమయం రాత్రి 11 గంటలు. రామకృష్ణపురం పరిసరాలు నిర్మానుష్యంగా వున్నాయి. జనసంచారం ఎక్కువలేదు. మిసెస్ సుమిత్రా చౌహాన్

కారు నెమ్మదిగా, జాగ్రత్తగా డ్రైవ్ చేస్తూ, ఫ్లాట్ వైపుకు సాగిపోతోంది....

ఆమె ఒక స్నేహితురాలి ఇంటికి పార్టీకెళ్ళి వస్తోంది. అక్కడ స్వల్పంగా పుచ్చుకోవడంవల్ల అలవాటులేని ఆమెకి వొళ్ళు సన్నగా తూలుతోంది, కళ్ళు బరువుగా మూతపడ్తున్నాయి. మైకం తన్ని పూర్తిగా వశం చేసుకో కుండా విశ్వప్రయత్నంచేస్తూ ఆమె అతి జాగ్రత్తగా డ్రైవ్ చేస్తోంది....

"సరే, అలా డ్రైవ్ చేస్తూ ఫ్లాట్ చేరేటప్పటికి సమయం పదకొండూ పది అయింది. పార్కింగ్ ప్లేస్‌లో కారాపేసి దిగి, చిన్నగా తూలుతూ మెయిన్ హాల్లోకి అడుగు పెట్టింది. జానిటర్ ఎదురై పలకరింపుగా నవ్వాడు. బదులుగా ఆమె నవ్వి వేగంగా లిఫ్ట్‌వైపు సాగిపోయింది. ఆమె వయసు నలభైరెండు.

"ఆమె భర్తతో కలిసివుంటోన్న ఫ్లాట్ చాలా పైన, పన్నెండో అంతస్తులో వుంది. ఆమె లిఫ్ట్‌లో చేరుకొని అలసటగా, భారంగా, కారిడార్‌లో అడుగు పెట్టింది. ఆవైపు మూడు ఫ్లాట్స్ వున్నాయి. చివరి ఫ్లాట్ తమది.

"అప్పుడు, గబగబా నడుస్తున్న దానల్లా ఆమె కంగారుపడి ఆగిపోయింది. తత్తరపాటుతో కళ్ళు విశాలం చేసింది. తల విదిలించి ఎదురుగా తమ ఫ్లాట్ బాల్కనీలో నిల్చున్న ఆ ఇద్దరికేసి భయంగా చూసింది—

"తేరుకొని వేగంగా వాళ్ళని చేరుకొని, 'ఎవరుమీరు? ఏం చేస్తున్నారు?' అరిచింది కోపం ధ్వనిస్తోన్న కంఠంతో.

"మాడమ్, మీవారు మరో అమ్మాయితో వెళ్లారు" అన్నాడు వాళ్ళలో ఒకడు.

"ఆమె ముఖం ఎర్రబడింది. చటుక్కున ఇంకా దగ్గరి కెళ్ళింది.

"అలాగా! .... అలాగా! .... ఎక్కడ? చెప్పండి? ఎక్కడ?"

"ప్రస్తుతం స్వర్గంలో విహరిస్తున్నారు, మాడమ్. మీరూ అక్కడికి కెళ్తారా?"

"వెళ్తాను! వెళ్ళి అంతు తేలుస్తాను!" అందామె ఉద్రేకంతో వూగిపోతూ.

"అయితే వెళ్ళండి."

"మెరుపులా వాళ్ళిద్దరు ముందుకొచ్చి గభాల్న ఆమెని లేపి బాల్కనీలోంచి పన్నెండో అంతస్తునుంచి అవతలికి విసిరేశారు. ఉష్....నోరు విప్పకు! అదంతే."

* * *

"దినకర్ వీధి చివర టాక్సీ దిగి టైము చూసుకున్నాడు. పన్నెండు దాటింది. ఉలికిపాటుతో 'డామ్ జూలీ!' అనుకున్నాడు, 'నీ సాన్నిధ్యంలో కాలం నిజంగా ఎంత వేగంగా గడిచిపోతుంది డార్లింగ్!' తృప్తిగా నవ్వుకుంటూ ఇంటికేసి దారితీశాడు.

ఆ వీధిలో అన్నీ చిన్న చిన్న ఇళ్ళున్నాయి. ఆ ఇంటి తలుపులన్నీ వీధికే వున్నాయి. ప్రహరీగోడ, గేటులాంటివి లేవు. దినకర్ తన ఇంటి తలుపు దగ్గరాగి తాళాలుతీశాడు జేబులోంచి....'రేపటినుంచి జూలీని ఇంటికే పిలిస్తే—' నాలిక కరచుకున్నాడు. 'ఈ వీధిలో కాకులూ కోతులూ దండిగా వున్నాయి వద్దు బాబోయ్!' అని సరిదిద్దుకొని, తాళంతీసి లోనికి అడుగువేశాడు. లైటువేసి, హుషారుగా ఈలవేయబోతూ ఆగిపోయాడు—

"ఎదురుగా ఇద్దరు ఆగంతకులు కుర్చీలో ఒకడు,

బెడ్ మీద ఒకడు ఆశీనులై కన్పించారు. దినకర్ ని చూసి వాళ్ళ పెదవులమీద విషపునవ్వు విరిసింది.

"ఎవరు మీరు! ఏం చేస్తున్నారిక్కడ!' దినకర్ అరి చాడు రెచ్చిపోయి.

"వాళ్ళిద్దర్లో ఒకడు లేచి వచ్చాడు, 'నువ్వు చాలా తప్పుచేస్తున్నావు, దినకర్. నీ తల్లి చానా క్షోభిస్తుంది!' అన్నాడతను బెదిరింపుగా.

"ఆ మాటలకి దినకర్ హ ఠా త్తు గా చల్లబడి పోయాడు.

"ఎ_ఎవరు మీరు? ఏమిటీ అఘాయిత్యం?"

"రెండో ఆగంతకుడు బెడ్ మీంచి లేచి, దినకర్ గమనించకుండా అతడి వెనుక నీడలా వచ్చాడు. అతడి చేతిలో నైలాన్ తాడు వలయంగా ఏర్పడింది. దినకర్ ఏం జరుగబోతుందో పసిగట్టే లోపు, ఆ వలయం అతని కంఠం చుట్టూ బిగుసుకుంది_గట్టిగా ఊపిరి అందక గొంతు పెగలక పెనుగులాడాడు. తాళలేక గిలగిల్లాడాడు. ప్రతిఘటించడానికి తీవ్రంగా ప్రయత్నించాడు, గానీ అది వృధా ప్రయత్నమే అయింది. కొన్ని క్షణాల తర్వాత అతడి శవం సీలింగ్ ఫ్యానుకి వ్రేలాడసాగింది."

• • •

"తెల్లవారుజామున నాలుగు గంటలకి వినయ్ బాబు కెవ్వున ఏడ్చాడు.

"మానసి బాధగా మూల్గి, బద్ధకంగా కళ్ళు తెరి చింది. వినయ్ బోసి నోరు తెరిచి గట్టిగా ఏడ్వసాగాడు.

ఆమె హృదయం ద్రవించిపోయింది .... గుండెలకి గట్టిగా హత్తుకొని 'పిచ్చి నాన్న' అంది.

"హఠాత్తుగా అప్పుడు తలుపు దగ్గరేదో చప్పు

దైంది. అదిరిపడి ఆమె తల తిప్పి చూసింది. అప్పుడే తలుపు తెరుచుకొని రెండు ముసుగు ఆకారాలు లోని కొచ్చేశాయి! ఆమె భయంతో కెవ్వున అర్చింది. బిడ్డని బలంగా పొదివిపట్టుకొంది. ఆ ఆకారాలు వేగంగా దగ్గర కొచ్చేసి ఆమె మీదకి వంగి చూశాయి. ఆమె కొయ్యబారి అలాగే వుండిపోయింది—ఊపిరి పీల్చడం మర్చిపోయింది.

"తే!" అంటొక ఆకారం చేతులు జాపి, "నీ చంటాణ్ణిలా తే!"

"మానసి వణికిపోతూ తల అడ్డంగా వూపింది.

"రెండో ఆకారం జేబులోంచి రుమాలు తీసింది. అందులో చుట్టివున్న సిరంజి తీసి, ఆమె జబ్బలో కసిక్కున గుచ్చి ద్రవాన్ని ఇంజక్టు చేసింది. ఆమె పెనుగులాడింది....అరవాలని ప్రయత్నించింది....క్షణాల్లో కండరాలు సడలిపోయి, కళ్ళు మూతపడి అచేతనంగా వుండిపోయింది. మొదటి ఆకారం చేతులు దుడుకుగా, దురుసుగా, ఏడ్పుమాని బిత్తర చూపులు చూస్తున్న తొమ్మిది నెలల వినయ్‌బాబుని, తల్లి నుండి వేరుచేశాయి....

* * *

"ఏమిటలా చూస్తావ్?" అన్నాడు ఆత్మారాం నన్ను ఎగాదిగా చూస్తూ, "తలాతోకాలేని సంఘటనలు చెప్పి పిచ్చెక్కిస్తున్నానా? నేను పాయింట్ కొచ్చేవరకు నువ్వు ఓపిక పట్టాల్సిందే, రామన్! ఇప్పుడు మరో టీ తెప్పిస్తే...."

# 3

సైరస్ ముఠాకో ప్రత్యేకత వుంది—

ఆత్మారాం ఇలాగే ప్రారంభించాడు తిరిగి, మరో

కప్పు టీ సేవిస్తూ—

ఆ ప్రత్యేకత ఏమిటంటే, ఎన్ని కలహాలొచ్చినా ఎలాంటి తగాదా లేర్పడినా, ఒక నిర్ణీత కాలంలో చప్పున రాజీకొచ్చేసి భుజం భుజం రాసుకుంటూ తిరుగుతారు. ఐకమత్యమే మహా బలమని నమ్మినవాళ్ళు.

అని పోలీసులూ విశ్వసిస్తారు—

అందుకే ఢిల్లీ నగరంలో ఏ కుబేరుడి భుజానికి గండి పడ్డా, పరిసరాల్లో ఏ హైవేమీద దారి దోపిడి జరిగినా, ఏ రైలుమీద బందిపోటు స్వైర విహారం జరిగినా వాళ్ళ దృష్టిలో మొదట మెదిలేది సైరస్ ముఠా. అంత పటిష్టంగా పనిచేసే గ్యాంగ్ అదొక్కటేనని వాళ్ళ నమ్మకం.

సైరస్ వయసు 50 వుంటుంది. అంత లావూ కాదు, సన్నమూ కాదు. ఉన్నంతలో ఆరోగ్యంగా కన్పిస్తాడు. చూస్తే కిరాతకుడన్పించడు మామూలు మనుషులకి. అతని కళ్ళలో నక్క వినయం, ముఖంలో మోసపూరిత నమ్రత అతనికి ముఖ్యమైన ఎస్సెట్స్. అతనికి నలుగురు అసిస్టెంట్లు. జయన్, విక్టర్, అమలేందు సేన్, షబ్నమ్. వీరు నలుగురూ చోరవీర శిఖామణులు. నేర రంగంలో వీరు నిపుణులు, నిష్ణాతులు.

వీళ్ళకు స్థిరంగా ఒక స్థావరమంటూ లేదు. పోలీసులకి తమపైన వుండే డిమాండ్‌ని బట్టి; వాళ్ళ మూడ్ తెలివితేటల్ని బట్టి, మార్చేస్తుంటారు. వాళ్ళ బుద్ధి వికసిస్తున్నప్పుడు ఎక్కడో దూరంగా ఏ పుట్టలూ గుట్టల్లోనో వశిస్తూ—మందగించినపుడు సమీపంలో, అతిసమీపంలో కాకపోతే మారు వేషాల్లో కళ్ళముందే వర్ధిల్లిన సందర్భాలూ ఉన్నాయ్!"

అలాగని ఎన్నడూ పట్టుబడలేదని కాదు. లోపలికి వెళ్తూనే వున్నారు, వస్తూనే వున్నారు; కొన్ని ముఖ్యమైన ఛానల్స్‌లో నోట్లకట్టలు సరఫరా చేస్తూ.

ఇప్పుడీ మూఠా కొత్తగా ఓ మేజర్ పథకం రూపొందించి రంగంలో దూకింది. అందువల్ల పాత ఢిల్లీలో మరీ పాత మేడను తమ కొత్త స్థావరంగా ఎన్నుకొన్నారు. ఇక్కడ వాళ్ళనెవరూ అనుమానించరు. ఈ పథకంలో మొదటి అడుగే హత్యలతో కూడుకొన్నది గనుక ఎవరికీ అందకుండా జాగ్రత్తలో వుండాలి. అప్పుడే పథకం చివర పూరించే ఫలితం దక్కుతుంది!

ఆ రోజు తెలతెలవారుతోండగా ఆ మేడముందు ఒక పాత అంబాసిడర్ వచ్చి ఆగింది. దాని లైసెన్స్ ప్లేటు నకిలీ అని ఎవరికీ తోచదు. అందులో వున్న ఇద్దరు మనుషులు ఘరానా నేరస్థులని కూడా గుర్తించరు.

వాళ్ళిద్దరు కారు దిగి ఇంటి మెట్లెక్కారు. ముందు జయన్, వెనుక అమలేందు సేన్. వాళ్ళిద్దరి కళ్ళు నిద్రలేమితో ఎర్రగా వున్నాయి. సేన్ చేతుల్లో పూర్తిగా కప్పబడిన మూటలాంటిది వుంది. అందులో కదలిక దేనిదో ఎవరైనా ఇట్టే గ్రహించవచ్చు గానీ, ఆ సమయంలో అక్కడెవరూ లేరు. ఆ పేట వాళ్ళకి ఇంకా తెల్లారలేదు.

జయన్ తలుపుమీద కొట్టాడు. వెంటనే తలుపు తెరుచుకోవడంతో లోనికి జొరబడ్డారిద్దరూ. వాళ్ళకెదురుగా ముగ్గురొచ్చారు.

"తెచ్చారా?" సైరస్ అన్నాడు ఆత్రుతగా.

జయన్ తలూపాడు.

సేన్ చేతుల్లో గుడ్డలాగేసి, అందులో పిల్లాడ్ని ఆదుర్దాగా అందుకున్నాడు సైరస్. అతన్ని గాఢంగా

హత్తుకొని, కళ్ళు మూసుకుని ఉక్కిరిబిక్కిరవుతూ అర్చాడు. "నా స్వప్నం! నా సొమ్ము! నా సింగపూర్! అహ్!....ఓహ్!....నా దిక్కూ మొక్కూ చెక్కూ అన్నీ నువ్వేరా చంటోడా!"

వినయ్‌బాబు ఊపిరందక గిలగిల్లాడాడు. కాళ్ళు కొట్టుకున్నాడు. వెంటనే జయన్ అతన్ని సైరస్‌నుండి వేరుచేశాడు. వినయ్ కళ్ళల్లో భయం మెరిసింది, పరిచయంలేని స్పర్శకూ, కొత్త మనుషుల్నీ చూసి. ఆ భయం కళ్ళల్లో తెరలు తెరలుగా కదిలి మాటాత్తుగా కేరుమన్నాడు.

సైరస్ గాభరాపడ్డాడు. "ఏమటది? జయన్! ఏం చేశావు?"

"నేనేం చేశాను? నువ్వే ఊపిరాడకుండా చేశావు!" జయన్ కసిరాడు సముదాయిస్తూ. కానీ వినయ్ ఇంకా ఏడ్పు ఎక్కువచేశాడు. సైరస్ తిరిగి అతన్ని లాక్కున్నాడు కంగారుగా.

"ఖామోష్!" అన్నాడు లాలిస్తూ. "అరె బాబూ ఖామోష్! షబ్నమ్! బేబీ ఫుడ్, క్విక్!"

షబ్నమ్ తటాలున అక్కడనించి పరుగుతీసింది—

వినయ్ వళ్ళంతా నీలిరంగులో మారి ముక్కులోంచీ, కళ్ళనుంచీ నీళ్ళు కారుతున్నాయి. కాళ్ళతో పొట్టలో తన్నుతున్నాడు. క్రిందకు జారిపోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు. సైరస్ ముసిముసిగా నవ్వుతూ బుజ్జగిస్తున్నాడు.

సేన్ భయంభయంగా అన్నాడు. "అంకుల్....వీడి అరుపులు వింటోంటే నాకు పోలీస్ సైరన్‌లా వుంది!"

"ఓరి పాపాత్ముడా! అలా దూషిస్తావా!" అర్చాడు

సైరస్. "జన్మలో పసిపాపల ఏడ్పు విన్నావా? అసలు నువ్వు ఏడ్పు ఎరుగుదువా? పిచ్చివాడా! పిల్లల ఏడ్పు ఎంత ముచ్చటగా, ఎంత మెలోడియస్‌గా, వీనుల విందుగా వుంటుందో నీకెలా తెలుస్తుంది? వెళ్ళిక్కడ్నుంచి!"

షబ్నమ్ సీసా పట్టుకొని పరిగెత్తి వచ్చింది.

సైరస్ దాన్నందుకొని వినయ్ నోట్లో పెట్టాడు ఆదుర్దాగా. అలా చెయ్యడంలో వినయ్ తలవిదిలించాడు, సీసాపై చిగుళ్ళకి బలంగా కొట్టుకుంది. ఒక్క క్షణం స్తబ్దైే, అకస్మాత్తుగా తిరిగి కెవ్వుమన్నాడు.

"అంకుల్, వీడి ఏడ్పు బయట ఎవరైనా వింటే...." జయన్ నసిగాడు.

సైరస్ చటుక్కున వినయ్‌ని షబ్నమ్ మీదకు తోశాడు. "తీసుకో, ఇది నీ కేసు."

అక్కడ్నుంచి కదిలి వేగంగా గదిలోకెళ్తూ, "మీరు ముగ్గురూ రండి నాతో!" అన్నాడు.

జయన్, సేన్ విక్టర్‌లు అనుసరించారు. షబ్నమ్ అక్కడే కుర్చీలో కూలబడి వినయ్‌ని సముదాయించ సాగింది. వినయ్ స్పర్శ మారడంతో, తను పడుకున్నది తల్లి ఒడిలాగే అన్పించడంతో ఏడ్పు మాని, నిప్పుల్‌ని ఆకలిగా చప్పరిస్తూ పాలు పీల్చసాగాడు.

"సక్సెస్?" సైరస్ అడిగాడు జయన్‌ని చూసి.

జయన్ తలూపాడు.

"పర్‌ఫెక్టు జాబ్ అంకుల్. సుమిత్ర అంతెత్తునుంచి పడ్డుంటే చూడాలి—ఠాప్‌మంది ఆమె తల! అంతే, చాలా సింపుల్. మమ్మల్నెవరూ అక్కడ చూడలేదు."

"దినకర్?" సైరస్ అడిగాడు మళ్ళీ.

జయన్, సేన్‌ని చూశాడు. సేన్ వెకిలిగా నవ్వాడు.

"ఆ ప్లే బాయ్ ఇబ్బంది పెట్టకుంటూ బాల్చీ తన్నేశా డంకుల్!"

"మానసి?"

"ఫైన్. ఆమె కేమీ కాదు. పన్నెండు గంటలకి కళ్ళు తెరుస్తుంది."

"కళ్ళు తెరిస్తే మిమ్మల్ని గుర్తు పడ్తుందా?"

"నీకు మతిలేదు అంకుల్, మేం ముసుగేసుకున్నాం" జయన్ చెప్పాడు.

"ఓ. కే! ఇక అరవింద్ ఉన్నాడు....అతను ఏడున్నర ఫ్లైట్ దిగుతాడు...." అంటూ సైరస్ కిటికీ దగ్గర కెళ్ళి సిగరెట్ ముట్టించుకున్నాడు.

"నేను బయలుదేరుతాను అంకుల్" విక్టర్ అన్నాడు వాచీ చూసుకుంటూ.

సైరస్ తలూపాడు. "ఆల్ రైట్, మరోసారి వినండి! ఇది మన మేజర్ ప్లాను, ఎక్కడా పొరపాటు జరక్కూడదు! పొరపాటనేది జరిగితే క్షమించను. చంపుతాను! అర్థమైందా? ఇన్నాళ్ళ మన ఐకమత్యం ఆత్మీయత అన్నీ మర్చిపోతాను. మన చేతకానితనం చాటుకొంటూ మిస్టర్ సి ముందు దద్దమ్మల్లా నిల్చోవటం చచ్చినా సహించను!"

"అంకుల్, ఈ మిస్టర్ సి ఎవరు? ఏ దేశస్థుడు?" విక్టర్ అడిగాడు.

సైరస్ విసుక్కున్నాడు. "డామ్ యువర్ క్యూరియాసిటీ! ఎవరైతే మనకెందుకు? మనక్కావల్సిందేమిటి? డబ్బు! అతనితో చుట్టరికం కాదు! అవునా? మిస్టర్ సి తనక్కావల్సింది డబ్బిచ్చి పొందుతున్నంతవరకూ అతన్ని

గురించి మనకనవసరం!

మనం పొందే డాలర్లని ఊహించుకోండొక్కసారి! యాభై వేల డాలర్లు! మన కరెన్సీలో ఆరులక్షల రూపాయలు! ఖర్చంతా అతనిదే—అరవింద్ భాగం కూడా అతని జేబులో సొమ్మే! మన లక్ష లెక్కడికీపోవు, చెక్కు చెదరవు! రాబోయే స్వర్ణయుగాన్ని వూహించుకోండింకో సారి!"

# 4

ఆత్మారాం చెప్పడం ఆపి, అనుమానంగా చూశాడు నన్ను. "రామన్ ఫాలో అవుతున్నావా?"

"అవుతున్నాను."

"గుడ్. అవకపోతే రైటర్‌వి కావు. ఇప్పుడు మరో టీ తెప్పించు రామన్, కథలో కెళ్తాను—"

"నా పేరు రామన్ కాదని ఎన్నిసార్లు చెప్పాలి నీకు?"

"ఓ.కే! ఓ.కే! సారీ నీ పేరు రామన్ కాదు, మోహన్. నాకు మతిమరుపా ఏమిటి! రైట్, మళ్ళీ అలా పిలవను. గాడ్ ప్రామిస్. సరేనా?"

టీ వచ్చింది. అతను తిరిగి ప్రారంభించాడు.

"ఓ.కే! సైరస్ గ్యాంగ్ గురించి తెలుసుకున్నావు. అక్కడక్కడా సందేహాలుండొచ్చు. వాటినలా వదిలెయ్ ప్రస్తుతానికి....ఆ రెండు హత్యల గురించి చెప్పుకుందాం.

సుమిత్ర మోహన్ శవం ఆదే రాత్రి 1½ గంటలకి కనుగొనబడింది. ఆమె క్రిందపడినప్పుడు అక్కడెవరూ లేరు. కేక కూడా విన్పించలేదు. జానిటర్ మెయిన్ గేటు మూస్తున్నప్పుడు చూశాడు. వెంటనే కేక వేశాడు.

జనం వచ్చారు. ఆఫ్‌కోర్స్ తర్వాత పోలీసులూ వచ్చారు.

ఆమె ముఖం నుజ్జునుజ్జయింది. ఆమెని గుర్తించడానికి దుస్తులే ఆధారమయ్యాయి. జానిటర్ గుర్తించాడు. వెంటనే పోలీసులు ఆమె ఫ్లాట్ చేరుకొన్నారు. అక్కడ తలుపు దగ్గర—గాలికి ఎగిరిపోకుండా రాయిపెట్టి ఒక కాగితం కనిపించింది. అది ఆమె భర్త ధోరణి సహించలేక ఆత్మహత్య చేసుకుంటున్నట్లు వ్రాసిన చీటీ—

"మిస్టర్ మోహన్, ఆ చీటీ చూసి భర్త గుండెలు పగిలేలా ఏడ్చాడు. ఆమె ఇలాంటి పని కొడిగడుతుందని అతను కల్లో కూడా అనుకోలేదు. తన ప్రవర్తన గురించి ఎన్నోసార్లు ఇద్దరికీ ఘర్షణ జరిగింది—ఇలాంటి పర్యవసానం వూహించలేదు. సరే, అప్పటివరకూ ఎవరికీ తెలియని విషయం ఒకటి ఆమెని గురించి బయటపడింది— భర్త చెప్పాడు పోలీసులకి—ఆమె డాక్టర్ రఘునాథ్ షిండేకి సీనియర్ అసిస్టెంట్ అట! షిండే గొప్ప సైంటిస్టు.

"ఉదయం ఆరుగంటలకి దినకర్ శవం కూడా బైట పడింది. పనిమనిషి మామూలుగా తలుపు తట్టబోతూ ఆగి అది తెరుచుకుని వుండటంతో లోపలికి వెళ్ళి వెల్—సో అండ్ సో విధంగా రియాక్టు అయిందనుకో. జనం వచ్చారు. పోలీసులూ చేరుకున్నారు. సీలింగ్ ఫ్యానుకి వ్రేలాడుతోన్న శవాన్ని దించి చూశారు. అక్కడే టేబిల్ మీద ఒక కవరు కన్పించింది. అందులో మూడు ఫోటోలున్నాయి. వాటిని చూసి సంగతి అర్థమైంది, మిస్టర్ రామన్. ఆ ఫోటోలతో బ్లాక్ మెయిల్ చేయబడి అతను బయట పడలేక ఆత్మాహుతి చేసుకున్నాడు. ఆమేన్. అప్పుడింటి సోదాలో ఒక అడ్రసు దొరక

పుచ్చుకొని సూరత్ లో అతని తల్లికి టెలిగ్రాం పంపారు.

"వెల్, దినకర్ ఎవరో యేం చేస్తాడో పోలీసులకింకా తెలియలేదు. పొరుగువాళ్ళకీ అతని గురించి ఏమీ తెలీదు. ఒంటరిగాడు, ఎప్పుడో రాత్రికి ఇంటికొస్తాడు. అంతే. వెల్, పోలీసుల తతంగం అలా సాగుతోంది....మనం అందులో తలదూర్చనవసరం లేదు....ఇప్పుడు కథను, డాక్టర్ షిండే జూనియర్ అసిస్టెంట్ అరవింద్ మీదకి మళ్ళిద్దాం—"

# 5

అరవింద్ కుమార్ వయసు ముప్పైఒకటి. నెంబర్ వన్ ఎలక్ట్రానిక్ ఇంజనీర్.

ఎలక్ట్రానిక్ రంగంలో అతని సామర్థ్యానికీ, తెలివితేటలకీ సాటిలేరు. అందుకే ఉన్నత వర్గాల దృష్టి నాకర్షించి రెండేళ్ళ క్రితం బెంగుళూరులో HAL లో పనిచేస్తున్న అతను డాక్టర్ షిండే చేబట్టిన ప్రాజెక్ట్ కి జూనియర్ అసిస్టెంట్ గా తీసుకోబడ్డాడు.

ఈ ప్రాజెక్టు అత్యంత సంకీర్ణమైనదీ, క్లిష్టమైనదీను - దానితో మన రక్షణ వ్యవస్థ మరే ప్రపంచ రాజ్యమూ సాటిరాని విధంగా ఉన్నత ప్రమాణాల్ని ఇనుమడించుకుంటుంది....

ఈ ప్రాజెక్టులో అరవింద్ కి పూర్తి విశ్వాసముంది. కానీ, ఉద్యోగంలో ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలు అతనికా ప్రాజెక్టుపట్ల అనాసక్తినీ, నిరుత్సాహాన్నీ కల్గిస్తున్నాయి. అక్కడ అతని అభిప్రాయాలకీ, సూచనలకీ విలువలేదు. అతను కోరే సవరణలకి గుర్తింపులేదు. పైగా పరనిందలు మోయవల్సివస్తోంది. వీటి మూలంగా రాజీనామాకు పురిగొల్పిన పరిస్థితులూ వున్నాయి....

కాని డాక్టర్ పట్ల గల గౌరవభావం, ప్రాజెక్టుమీద వున్న కార్యదీక్ష అందుకు పూనుకోనివ్వడంలేదు. డాక్టర్ పట్ల తనకు నిరసనలేదు. అసంతృప్తిలేదు. తనకి ప్రతి విషయంలో అడ్డుపడి డామినేట్ చేస్తున్న సీనియర్ వ్యక్తి సుమిత్రా చౌహాన్ అంటే మాత్రం తగని ద్వేషం ఉంది.

సుమిత్రలో స్వార్థానికి అంతులేదు. అది స్వార్థమో ఉట్టి ఉన్మాదమో ఒక్కోసారి అరవింద్ కి అంతుపట్టదు. ఆమె ఏదో తీవ్రమైన మానసిక రుగ్మతతో సతమత మవుతున్నట్టు కన్పిస్తుంది చూస్తే. ఆమె భర్త వ్యసన పరుడని ప్రపంచానికి తెలుసు. ఈ కారణంవల్ల నిస్సార మైన తన సంసారం పట్ల విముఖత, అసంతృప్తి, విరక్తి మొదలైన వాటితో అలాంటి ప్రవర్తనను అలవర్చు కుందా? లేక అన్యోన్యంగా సాగుతోన్న అరవింద్ దాంపత్యం చూసి అసూయతో, ఓర్వలేనితనంతో, ఇలా కసితీర్చుకుని తృప్తిచెందుతోందా?

ఏదేమైనా అతనికి ఆమె ప్రమాదకరంగా తయా రైంది. డాక్టర్ సహజంగానే వయసులోనూ, అనుభవం లోనూ అతనికంటే పెద్దదైన ఆమె అభిప్రాయాల్ని గౌరవిస్తున్నాడు. సరే, అది అతను సర్దుకుపోగలడు. కానీ, ఆమెచేసే పొరపాట్లనీ, ఇతరులు చేసే పొరపాట్లనీ కూడా తనమీద రుద్ది డాక్టర్ కి ఫిర్యాదులు చెయ్యడం, అపార్థాలూ మనస్తాపాలూ కల్గించడం ఎంతమాత్రమూ భరించలేకపోతున్నాడు.

దినకర్ అంటే ఆమెకు ఎనలేని అభిమానమో, లేక కేవలం అరవింద్ మీద కసి తీర్చుకొనే సాధనమో ఆమెకే తెలియాలి. అతన్ని మాత్రం బాగా సమర్థిస్తుంది.

అతని తెలివితేటల్ని — ఆ ప్లేబాయ్ రొమాంటిసిజాన్ని తెలివితేటలంటే అరవింద్ కి నవ్వొస్తుంది—ఆమె బ్రహ్మాండంగా మారిస్తుంది. డాక్టర్ దగ్గర పొగడుతుంది.

ఈ కారణాలవల్ల దినకర్ అంటే కూడా అరవింద్ కి పడదు. ఈ కుట్రలూ కుతంత్రాలూ డాక్టర్ కి తెలియక కాదు. కానీ వాటిని పట్టించుకొని సరిదిద్దే తీరిక ఆయన కెక్కడిది? నిజానిజాల వివక్షతా స్పష్టి ఆయనకుంది గనుకనే ఇంతవరకూ అరవింద్ మీద అభిమానం చెరిగి పోకుండా మనగల్గుతోంది.... దేశ పటిష్టతకు కృషి చేయ వల్సిన స్థానే స్వార్థ రాజకీయాల్ని ప్రతిష్ఠించడం ఎంత శోచనీయం! సిగ్గుచేటు.

ఇలాంటి వాతావరణంలో అరవింద్ విసిగిపోతు న్నాడు. అయితే ఇది కేవలం తాత్కాలికం అన్న ధైర్యమే అతన్ని నిలబెడ్తోంది.... ఇంకో రెండు నెలల్లో ఈ ప్రాజెక్టు పూర్తవుతుంది. అక్కడెలాగూ తను పాత ఉద్యోగంలోకి వెళ్ళిపోతాడు....

ఆ రోజు ఉదయం అతను సరిగ్గా పదున్నరకి పాలం విమానాశ్రయంలో అడుగుపెట్టాడు.

రెండు రోజుల క్రిందట బెంగుళూరు వెళ్ళి ఏరో నాటికల్ ఇంజనీర్లతో చర్చలు జరిపిస్తున్నాడు.... విమానం దిగుతున్నపుడు అతని శరీరమంతా వింత పులక రింతతో జలదరించింది.... ఆ రెండు రోజుల తహతహ నేటితో అంతమైంది.

టాక్సీ ఎక్కి ఇంటికి బయల్దేరినపుడు ఉత్సుకత మరింత ఎక్కువైంది.

బాబుని చూడకుండా ఒక్క రోజుండలేడు! ఈ ప్రయాణాలు అతన్ని అప్ సెట్ చేస్తున్నాయి. బాబుని

వదిలి వెళ్ళడమంటే, వివాహమైన మొదట్లో భార్యని వదిలి వెళ్ళినంత అశాంతిగా వుంటుంది!

అంటే ఇప్పుడు భార్యమీద ఆసక్తి నశించిందని కాదు. ఆమెమీద అనురాగం ఎప్పటికీ మాయదు. మానసి తన భార్య కావడం గొప్ప అదృష్టం. సెంటిమెంటల్‌గా చెప్పాలంటే ఏ జన్మలోనో చేసుకొన్న సుకృతం. తనెప్పుడూ అనుకోలేదు, వైవాహిక జీవితం ఇంత మధురంగా వుంటుందని! చాలామంది పెళ్ళిచేసుకొన్నందుకు వాపోతుంటారు. తానలా కాదు, గర్వపడ్తాడు దేవతలాంటి భార్యని చూసి. ఇలాంటి అనుకూలవతియైన భార్య లభిస్తే పురుషులు బాగుపడతారు.

మానసి నోరు విప్పి ఏదీ అడగదు. కోరికలు కోరదు. ఎంతసేపూ భర్తనెలా సంతోషపెట్టాలన్నదే ఆమె తాపత్రయం. జబ్బుచేసినా, ఏమైనా లెక్కచెయ్యదు. ఏంచేసినా ఇంకేదో తక్కువ జరిగినట్లు అపరాధభావంతో కుమిలిపోతుంటుంది....ఒక్కోసారి జాలివేస్తుంది ఆమె పాట్లు చూస్తే హృదయం ద్రవిస్తుంది ఆమె అమాయకపు చేష్టలకి.

అరవింద్ అలసటగా వెనక్కివాలి సిగరెట్ వెల్గించాడు.

మళ్ళీ ఆలోచనలు బాబుచుట్టూ ముసురుకున్నాయి. అప్పుడు దారిపొడవునా అతన్ని రెండు కళ్లు గమనిస్తున్నాయన్న సంగతి అతనికి తెలీదు.

ఇంటి దగ్గర టాక్సీ దిగి లోనికెళ్ళినప్పుడు కూడా అలాంటి తలంపు కలగలేదు. కల్గాలని ఎవరూ ఆశించరు కూడా. సహజ ధోరణిలో ఉత్సాహంగా మెట్లెక్కి బెల్ నొక్కాడు. 'మానసీ!' అని పిల్చాడు.

కానీ సమాధానంలేదు.

మళ్ళీ నొక్కాడు. పిల్చాడు.

అప్పుడూ ఉలుకూ పలుకూలేదు.

నిరుత్సాహపడ్డాడతను. ఏం చేస్తోందీమె! తనీరోజు వస్తున్నట్లు తెలీదా? మర్చిపోయిందా? ఇంకా నిద్ర లేవలేదా?

అరవింద్ ఏదో పసిగట్టాడు. తలుపు పూర్తిగా మూసి లేదు! ఓరగా వేసివుంది! చటుక్కున సెట్టి లోనికెళ్ళి పోయాడు. "మానసి! ఎక్కడున్నావ్?"

నడుస్తున్నవాడల్లా బెడ్‌రూం తలుపు దగ్గర ఆగి పోయాడు. లోపల దృశ్యం చూసి సూట్‌కేసు పడేసి విసురుగా ఉరికాడు.

"మానసి, ఇంకా లేవలేదా?"

ఆమె ప్రశాంతంగా నిద్రపోతోంది. పైట స్థాన భ్రంశం చెందింది. దుప్పటి చెదిరిపోయింది. ప్రక్కలో వినయ్ లేడు.

అతను ఆదుర్దాగా ఆమెని తట్టాడు. "మానసి! విన్నూ ఏడి? ఇంకా లేవకుండా ఏమిటిది, లే!"

ఆమెలో కదలికలేదు, ఉచ్ఛ్వాసనిశ్వాసలు తప్ప. ఆమెను కుదిపేస్తూ, ఆందోళనగా అర్చాడు. "ఓహ్, ఏమిటిది! ఏమైంది? విన్నూ ఏడి? తలుపులెందుకు తెరిచి వున్నాయి? కళ్ళు తెరు మానసి!"

అప్పుడు నెమ్మదిపడి ఆమె స్థితి ఏమిటో, ఆమె కేమైందో గ్రహించాడు. వెన్ను జలదరించింది. ఏమైంది? మానసికేమైంది? అతనికి మతిపోతోంది. విన్నూ ఏడి? ఏం జరిగిందిక్కడ? భయాన్ని అతి కష్టంమీద తమా యించుకొని కర్తవ్యం ఆలోచించాడు. డాక్టర్‌ని

పిలవాలి ముందు!

తటాలున ఫోన్ దగ్గరికి పోకాడు.

కానీ అది హఠాత్తుగా మోగింది....

బెదిరిపోయి, కదుటపడుతూ రిసీవరెత్తాడు.

"మిస్టర్ అరవింద్" అంది అవతలి కంఠం.

అరవింద్ వెన్నులో పాము ప్రాకినట్లయింది ఆ స్వరం విని.

"మిస్టర్ అరవింద్, డాక్టర్ అనవసరం. రెండు గంటల్లో ఆమె కళ్ళు తెరుస్తుంది. డోంట్ వర్రీ. ఈ లోపు నువ్వు త్వరత్వరగా చెయ్యవల్సిన పనులున్నాయి. వెంటనే టాక్సీ ఎక్కి హోటల్ బిల్లిమోరా, సూట్ నెంబర్ పన్నెండుకిరా! సంగతులన్నీ అక్కడే. కాన్ఫిడెన్షియల్. జాగ్రత్త. ఎవర్నీ తేకు. ఎవరికీ చెప్పకు. బ్రదర్, నీ ముద్దులబాబు మా బందీ అని ఎట్టిపరిస్థితిలో మర్చిపోకేం?" లైను కట్ అయింది.

అరవింద్ కి ముచ్చెమటలుపోసి స్తంభించిపోయాడు.

## 6

హోటల్ బిల్లిమోరా నాల్గో అంతస్తులోని పన్నెండవ నెంబర్ సూట్ లో సైరస్ కిటికీ దగ్గర నిలబడి అవతల చూస్తున్నాడు.

అతని వెనుక సోఫాలో మిస్టర్ సి సిగరెట్ తాగుతూ కూర్చున్నాడు. అతనెదురుగా జయన్, సేన్ లు వినయంగా తలలు వంచుకొని కూర్చున్నారు.

సైరస్ మాటిమాటికీ గడియారం చూసుకుంటున్నాడు. అంతక్రితమే విక్టర్ నుంచి ఫోన్ వచ్చింది అరవింద్ బయల్దేరినట్టూ తను వెంటాడిస్తున్నట్టూ. ఇప్పుడు సమయం పది కావస్తోంది....మరో అయిదు నిమిషాల్లో

వచ్చేసూలి.

సరిగ్గా అయిదు నిమిషాల్లో రానేవచ్చాడు అరవింద్. హోటల్ ఆవరణలో టాక్సీ దిగి గబగబా నడచి వస్తున్నాడు. ఆ దూరంనుంచి సైరస్ అతని ముఖంలో ఉద్రేకం గమనించాడు. మనుషుల వదనాల్లో ఉద్రేకం అతనికే మాత్రం నచ్చదు. దానికి బదులు భయం ఇంకెంతో వినోదంగా, చూడముచ్చటగా వుంటుందతనికి.

"హి ఈజ్ కమింగ్" అన్నాడు చటుక్కున వెనుదిరిగి.

మిస్టర్ సి సిగరెట్ ఆర్పేసి సర్దుక్కూర్చున్నాడు. జయన్, సేన్‌లు వెంటనే లేచారు. ఆ వెంటనే బయట అడుగులు విన్పించాయి. మరుక్షణం బెల్ మ్రోగింది.

జయన్ ఠీవిగా వెళ్ళి తలుపుతీసిన వాడల్లా అమాంతంగా వెనక్కి తోసివేయబడి, వెల్లకిలా విరుచుకుపడ్డాడు నేలమీద.

సేన్ సకాలంలో ముందుకు దూకాడుగానీ, అంతకంటే వేగంతో అరవింద్ ఉక్కు పిడికిళ్ళు ముఖంమీద ఎడాపెడా బాదేయడంతో కళ్ళముందు ఓ మెరుపు మెరిసి చీకటి కమ్మింది. గతి తప్పిన శనిగ్రహంలా వెళ్ళి విదేశీయుడి వొళ్ళో పడ్డాడు. ముక్కు అదిరి కెవ్వుమన్నాడు.

ఆ తరువాత సైరస్ వంతు వచ్చింది.

అరవింద్ రెండు చేతులు అతని మెడని చుట్టేసి వెనక్కి వంచాయి. మోకాలు పొట్టలో కుమ్మింది.

సైరస్ కళ్ళు బైర్లు కమ్మె. కడుపులో పేగులు గొంతులోకి రాబోతూ ఆగిపోయాయి. అరవింద్ ఇంకా ఉద్రేకంతో సైరస్ తలపట్టి కిటికీకేసి బాదాడు. అద్దం

భళ్ళున పగిలి పెంకులు జలజలరాలాయి బాల్కనీలో.

"నా బాబు నేం చేశావ్? రాస్కెల్, నా బాబు నేం చేశావ్?"

అప్పుడు జయన్, సేన్‌లు తేరుకొని లేచి, వళ్ళు దులుపుకొని చిరుతల్లా ముందుకు దూకి అరవింద్ మీద పంజా విసిరారు. అతని మెడమీద రెండు గుద్దులు, సైరస్‌ని వదలగానే పొట్టలో రెండు దెబ్బలు, ముఖం మీద మరో దెబ్బపడి అతన్ని కూల్చేశాయి.

"వాట్సిట్ హి ఈజ్ క్రయింగ్ ఫర్?" విదేశీయుడు అర్చాడు రెచ్చిపోతూ.

"హి ఈజ్ సఫరింగ్ ఫ్రం ఎక్యూట్ హైపర్ టెన్షన్" సైరస్ చెప్పాడు తల దువ్వుకుంటూ.

జయన్, సేన్‌లు బట్టలు దులుపుకున్నారు.

అరవింద్ బాధగా కళ్ళు తెరిచి చూశాడు. కాస్సేపు ఏమీ అర్థంగాలేదు. తల విదిలిస్తూ లేవబోయాడు.

"హి విల్ స్ట్రయిక్ ఎగైన్!" విదేశీయుడు అర్చాడు నిటారుగా కూర్చొని.

జయన్ నవ్వుతూ అరవింద్ కి సాయంపట్టాడు. "గెటప్ హీ మాన్, అయిపోయిందా? ఇంకా ఫీట్స్ వున్నాయా?"

అరవింద్ అతన్ని విదిలించబోయాడు. కాని అతనివల్ల కాలేదు. సేన్ కూడా పట్టి సోఫాలో కుదేశాడు. జయన్ చేతిలో రివాల్వర్ ప్రత్యక్షమైంది, "ఇప్పుడు కదలక!"

అరవింద్ ఊపిరి బిగబట్టాడు. ఏం జరిగిందో, తనేం చేశాడో కాస్సేపటివరకు తెలియలేదు. తెలిసి కలవరం చెందాడు.

"ఓ.కే; మై సన్" సైరస్ అన్నాడు ఎదురుగా

కూర్చుంటూ, "నీ ధైర్యాన్ని మెచ్చుకున్నాం. కానీ మా హెచ్చరిక నువ్వు నిర్లక్ష్యం చెయ్యడం బాధగా వుంది. పరిస్థితి తెలుసుకునే వచ్చావా? లౌక్యం తెలిసినవాడివి నువ్విలా ప్రవర్తించడం భావ్యం కాదు. ఈసారికి క్షమించేస్తున్నాను. మళ్ళీ ఇలాంటి న్యూసెన్స్ సృష్టించావా సందేహించకుండా నీ బాబు ప్రాణాలు మేం తీసేసుకొని, వట్టి శవం నీ చేతుల్లో పెడతాం! బుర్రకెక్కిందా?"

"వాడ్నెందుకు తీసుకొచ్చావు? ఏం కావాలి నీకు?"

"గుడ్. అలా అడిగావు బాగుంది. మర్యాదస్తులు శాంతియుతంగా బిజినెస్ మాట్లాడుకుంటారు. ఇక్కడ వీరు మిస్టర్ సి అని విదేశీయులున్నారు. వీరి ముందు తగాదా పడి తన్నుకుంటే ఆయన మొత్తం భారతజాతినే బడాయి కోర్లని అపోహపడే ప్రమాదముంది. మన కంట్రీ డిగ్నిటీని కాపాడుకోవాలి!

"నువ్వు సమర్థుడైన ఇంజనీరువి—కాదు సైంటిస్టు అనడం ఉచితంగా వుంటుంది—డాక్టర్ షిండేతో కలిసి ఒక ప్రాజెక్టుమీద పనిచేస్తున్నావు. రెండేళ్ళ నుంచి సాగుతోంది మీ రీసెర్చి. మీ డాక్టర్ ఊహా పథంలోని పరికరం మరో రెండు నెలల్లో వాస్తవంలోకి ఊడిపడుతుంది....కరెక్టు? ఆ పరికరం—లేక దాన్ని ఆయుధం అనడం బాగుంటుందా—అది ప్రపంచాన్ని విస్మయంలోముంచుతుంది. దడపుట్టిస్తుంది. యుద్ధరంగంలో మన ప్రగతికి గుండెలు బాదుకొనేలా చేస్తుంది — అంతేనా?"

అరవింద్ గొంతు తడారింది. మాట పెగిలి రాలేదు.

"వెల్ మై సన్, ఆ మిస్సైల్ సృష్టికి చేతులెత్తి

మీకు జోహారు లర్పించాల్సిందే! మీ కార్యదీక్షకూ, దేశ సేవా నిరతికీ....ఇంకా....ఓహ్, మీ విజయాన్ని ఏ మాటల్లో అభినందించాలో తోచడంలేదు! ఈ రెండేళ్ళూ మీరు అహోరాత్రాలు వర్క్ చేశారు. ఫలితాలు చూశారు. సత్ఫలితాలు. ఇప్పుడు స్ట్రక్చర్ కి పూను కున్నారు. ఇంకా శ్రమ పడ్తున్నారు....విజయం తప్పక సాధిస్తారు. నాకా నమ్మకముంది. కాని, దాని ప్రయో జనం మన దేశం ఒక్కటే అనుభవించే అదృష్టం లేక పోవడం విచారం కలిగిస్తోంది."

"అంటే!"

"ఆ ప్లాను—బ్లూ ప్రింట్—డేటా—యేమంటారు మీరు దాన్ని? అది నాక్కావాలి."

అరవింద్ ముఖం కోపంతో ఎర్రబడింది. "యూ థగ్! నీ పిచ్చి మాటలు—"

"అది నాక్కావాలి, అరవింద్ పరాచికాలు కాదు. స్ట్రక్చర్ మీరు చేసుకోండి, ప్లాను నాకిచ్చేయండి. మిస్టర్ సి ఇందులో ఆసక్తి కనబరుస్తున్నారు. ఎంతో ఆశ పెట్టుకున్నారు. ఆయనకదికావాలి, మేం ఆయన కోర్కె తీర్చాలి. దీనికి తిరుగులేదు. ఆయన ప్రపోజల్ అయిదువేల డాలర్లు. మన కరెన్సీలో అరవై వేలు—

ఆలోచించు అరవింద్....నువ్వలా రెచ్చిపోకు! నీ కిష్టమైతేనే అంగీకరించు. కాదంటే నీ పిల్లాడ్ని పర్మ నెంట్ గా మర్చిపో. ఫర్గెట్ హిమ్. ఆఫ్టరాల్, పిల్ల వాడెంత?"

"యూ బ్లడీ బాస్టర్డ్!" అరవింద్ లేచి సైరస్ మీద దూకబోయాడు. జయన్ అతన్ని ఆపి రివాల్వర్ చూపిం చాడు.

"వెల్, మోర్ డిటేల్స్" సైరస్ అన్నాడు అదేమీ పట్టించుకోకుండా, "నీ సౌకర్యార్థం మేం కొన్ని పనులు ముందుగా చేసిపెట్టాం. అభినందించి తీరాలి నువ్వు! నీకు న్యూసెన్స్‌గా తయారైన సుమిత్రాచౌహాన్ నీ కోలీగ్ మరిక లేదు. స్వర్గస్తురాలైంది. నిన్న రాత్రి ఆత్మహత్య చేసుకుంది. రిలీఫ్ కదూ? ఎమోషన్స్ దాచకు. వాటినలా కనపడనీయ్. ఆమెతోపాటు దినకర్ కూడా పోయాడు. వాళ్ళిద్దరు నిన్ను విసిగించారు. నీ ప్రగతికి అవరోధాలు కల్పించారు. అవునా?

"వెల్, నువ్వు వాళ్ళెంత ద్వేషించినా ఇంతటి తీవ్రమైన గుణపాఠం భరించలేకపోతున్నావుకదూ? వాళ్ళు నువ్వూహించని దారుణ శిక్షకు గురయ్యారు కదూ? శిక్షించడం మా బిజినెస్. కేవలం నీ కోసమే శిక్షించ లేదు. మా లాభం కోసం చంపాం! అది యధాలాపంగా నీకు రిలీఫ్ అయి కూర్చుంది! అందుకని దానికి నువ్వే కారణమైనట్టూ, ఘోరమైన పాపం చేసినట్టూ గిల్టీ కాన్షస్‌తో కుళ్ళిపోనవసరంలేదు—"

"యూ మెర్సీలెస్ డర్టీ థగ్స్!"

"స్టాప్ హిమ్ ఫ్రం కాలింగ్ నేమ్స్!" విదేశీయుడు అరిచాడు కోపంతో.

"అరవింద్, అలా తిట్టకు. అతిథి ఏదు స్తున్నారు. నా పాయింట్ నువ్వు అర్థంజేసుకోలేదు. డాక్టర్ సేఫ్‌లో నువ్వు డాక్యుమెంట్స్ నలుగుర్లో తీయలేవు. రహస్యంగా తీయాలి. ఎలా తీస్తావు? అది నీకు కుదరదు. సుమిత్ర, దినకర్ నిన్ను వెయ్యికళ్ళతో గమనిస్తుంటారు. నీ నీడంటి వుంటారెప్పుడూ. వాళ్ళ దృష్టిలో పడకుండా నువ్వు ఉమ్మికూడా వెయ్యలేవు. రాత్రిళ్ళు రహస్యంగా

వెళ్ళలేవు. లాబ్ చుట్టూ పటిష్టమైన సెక్యూరిటీ వుంది. గార్డ్సు సెన్ గన్స్ నిన్ను జల్లెడ చేస్తాయి.

కాబట్టి పగలు ఆఫీసువేళల్లోనే వెళ్ళాలి. కానీ అప్పుడు నీ కొలిగ్స్ నే చెప్పినట్టు అంతరాయం కలిగిస్తారు. అప్పుడెలా? అర్థమవుతోందా నా పాయింట్ ఇప్పుడు? అందుకే వాళ్ళని అంత మొందించి—"

"డర్టీ థగ్స్! చంపడానికి మీ కెలా—"

"షటప్. అడ్డు తగలక విను! టైంలేదు. నీ భార్య కళ్ళు తెరిచినప్పుడు ప్రక్కన వుండాలి నువ్వు! ఆమెని ఒప్పించాలి. ప్రమాదం లేదని నచ్చజెప్పాలి. సంగతి బైటపొక్కకుండా చూసుకోవాలి.

"రేపుదయం మామూలుగానే లాబ్ కెళ్ళి నువ్వీపని చెయ్యాలి. ఈ మినీ కెమరా నీ దగ్గర వుంచు. సిగార్ లైటర్‌లా వుంటుంది. ఎవరూ అనుమానించరు. సేఫ్ కాంబినేషన్ నీకు తెలుసు. తెరిచి ఆ కాయితాల్ని స్నాప్స్ తీయ్. యధాప్రకారం పెట్టేయ్. తిన్నగా సాయంత్రం ఇక్కడ కొచ్చేయ్. అరవైవేలు సిద్ధంగా వుంటాయి. అంతా నీదే! చాలా సులభం, అరవింద్. తర్వాత అంతా సుఖాంతమవుతుంది. నన్ను నమ్ము. నీ బాబుని క్షేమంగా నీ కప్పగించేస్తాను. మళ్ళీ నీ జోలికి రాము."

"లేదు! నేనీపని చెయ్యను! చెయ్యనుగాక—"

"చిన్న పొరపాటుతో నీ ఇల్లు కూల్చుకోకు. వివేకంతో ఆలోచించు. నీకు దేశం ముఖ్యమనిపించవచ్చు, నీ గుండెలనిండా దేశభక్తి వుండవచ్చు. కానీ నీ భార్య అలా కాదు. ఆమెకు బిడ్డ సర్వస్వం. బిడ్డ తర్వాతే మిగతా ప్రపంచం. బిడ్డని బలి ఇచ్చి నువ్వామెని ఏ

రకంగానూ నచ్చజెప్పలేవు. రాజీ పర్చలేవు. బ్రతికించు కోనూ లేవు. బిడ్డపోయిన బెంగతో ఆమె మంచం పడు తుంది. మంచంలోనే ఆక్రోశిస్తుంది. అందులోనే కృశి స్తుంది. అందులోనే ప్రాణాలు....నో, అరవింద్, అప్పు డామెని కూడా దక్కించుకోలేవు—"

సైరస్ ఇంకా చెపుతున్నాడు. వారిస్తున్నాడు, హెచ్చరిస్తున్నాడు, మంచీ చెడ్డా వివరిస్తూ హితబోధ చేస్తున్నాడు—

చివరకి అరవింద్ కన్నీళ్ళతో తలెత్తి చూశాడు.

"నా బాబునేం చెయ్యకండి, చెప్పినట్టు చేస్తాను."

## 7

బాగా చీకటి పడింది. గార్డెన్ లైట్లతో దేదీప్య మానంగా వెలిగిపోతోంది. ఆ వెలుతుర్లో ఆత్మారాం ముఖం విచిత్రంగా మెరుస్తూ కన్పించింది.

"మిస్టర్ రామన్, నాదొక సందేహం తీర్చు" అన్నా డతను.

"ముందు నిన్ను నీవు సవరించుకో! నా పేరు మోహన్!" అన్నాను.

"ఓ.హ్, నా మతి—దీన్ని తీసి—"

"ఆల్ రైట్, ఏమిటి నీ సందేహం?"

"కథ చెప్పడం తేలికా, వ్రాయటమా?"

"రెండూ ఒక్కటే. ముందు వ్రాసేది, లేక చెప్పే విషయం గురించి పూర్తి అవగాహన వుండాలి. ఔచిత్యం తెలియాలి. ఏ విషయం ఎక్కడ చెబితే అది పండు తుందో ముందు జాగ్రత్తగా బ్రెయిన్‌లో బ్లూ ప్రింట్ వేసుకోవాలి. అప్పుడే చెప్పేదైనా, వ్రాసేదైనా రాణి స్తుంది. దానికి వన్నె చేకూరుతుంది."

"మరి నే చెప్పేది ఎలా రాణిస్తోంది?"

"బ్రహ్మాండంగా. సందేహించకు, ప్రొసీడ్!"

"ఒక్క మాట మాత్రం నిజం. వ్రాయడంలో పొందే అనుభూతి చెప్పడంలో వుండదు! ఏమంటావు?" అన్నాడు ఆత్మారాం భారంగా. "వ్రాయగలేవాళ్ళు అదృష్ట వంతులు. ఆల్ రైట్, తిరిగి కథలో కొద్దాం....ఎక్కడాగింది? అరవింద్ దగ్గర....అరవింద్ ముండగల బెదిరింపులకి తలొగ్గాడు. దేశ ద్రోహానికి పూనుకున్నాడు. దేశ రక్షణ భవితవ్యం పరుల పరం చెయ్యడానికి సిద్ధమయ్యాడు....

"ఇక డాక్టర్ షిండే ప్రాజెక్టు గురించి .... ఈ ప్రాజెక్టు గురించి చాలా కొద్దిమందికి—ఉన్నతాధికార్లలో అతి ముఖ్యమైనవారికి మాత్రమే క్షుణ్ణంగా తెలుసు. ఈ కుట్ర జరిగిన తర్వాత దీన్ని ఇంకా గోప్యంగా వుంచడం సాధ్యం కాలేదు. ఇప్పుడు సర్క్యులేషన్‌లో వున్న జనరల్ అయిడియా చెప్తాను....

"డాక్టర్ రఘునాథ్ షిండే నేవీలో ఉన్నత పదవిలో రిటైర్‌మెంట్‌కు దగ్గర్లో వున్నప్పుడే ఈ ఆలోచనకు అంకురార్పణ జరిగింది. యుద్ధరంగంలో ఆయన ఎన్నో నౌకలు పైనుంచి విమాన దాడికీ, ప్రక్కలనుంచి శత్రు నౌకల దాడికీ, అడుగునుంచి జలాంతర్గాముల దాడికీ గురై పేలిపోవడం, మునిగిపోవడం వంటివి ఎన్నో చూశాడు. ఇలా గమనిస్తూనే ఒకవైపు ఈ త్రివిధ దాడులనుంచి మన నౌకల్ని కాపాడ్డమెలా అని నిరంతరంగా ఆలోచించాడు .... ఒకానొక సుముహూర్తంలో దానికి పరిష్కారం కనిపెట్టాడు.

"ఇప్పుడు— డాక్టర్ ఊహాపథంలోని క్షిపణి లేదా మిసైల్ ఇలా వుంటుంది: నౌకలో కొన్ని నిర్ణీతమైన కేంద్రాల్లో అమర్చబడే ఈ క్షిపణుల సముదాయం ఏ వైపునుంచైనా శత్రుబాంబులు దాడిచేస్తుంటే పసిగట్టి స్వయం చోదియలై బయలుదేరి, వాటిని మధ్యమార్గంలోనే ఢీకొట్టి డిఫ్యూజ్ చెయ్యడమేగాక, శత్రు స్థావరాన్ని తుదముట్టిస్తాయి.

"మిస్టర్ రామన్, ఇంతటి క్లిష్టమైన వ్యవస్థ ప్రపంచ సైనికాగారాల్లో ఇంతవరకు లేదు. ఇటీవల అమెరికా నిర్మించిన ఫాస్టు ఫ్రిగేట్ గైడెడ్ (FFG) నౌకలో టార్గెట్‌ని పసిగట్టి పేల్చివేసే సౌకర్యమే వుంది. కానీ, తనవైపు వస్తున్న శత్రుబాంబుల్ని నివారించలేదు. మన సిస్టమ్ అది విజయవంతంగా నెరవేరుస్తుంది.

"డాక్టర్ తన ప్రతిపాదన ప్రభుత్వం ముందుంచినప్పుడు తీవ్రమైన వ్యతిరేకత ఎదురైంది. అది అసంభవమన్నారు. అసాధ్యమన్నారు. డాక్టర్ తన పట్టుదల వదల్లేదు. చివరకి దానిమీద ఒక రహస్య కమిటీ ఏర్పడింది. సంభవాసంభవాలను సమీక్షించుకున్నారు. డాక్టర్ తన ప్రతిపాదన ఎంతవరకూ సహేతుకమో తగిన ఆధారాలతో నిరూపించి వాళ్ళని సమన్వయపర్చారు.

"ప్రభుత్వం పునరాలోచించింది. అలాంటి వ్యవస్థ గనుక నిర్మాణం జరిగితే ఇంక యుద్ధరంగంలో నష్టానికి తావెక్కడిది? వెంటనే డాక్టర్ ప్రాజెక్టుని ఆమోదించింది. నిధులు కేటాయించి, ప్రయోగాలకొరకు చైతన్యపురిలో ఒక బంగళా సమకూర్చింది.

"ఈ రీసెర్చిని డాక్టర్ కోరికమీద అత్యంత రహస్యంగా వుంచే వుద్దేశ్యంతో పటిష్టమైన రక్షణ ఏర్పాట్లు చేసింది. మందీ మార్బలం ఎక్కువలేకుండా డాక్టర్ ఎన్నుకున్న ముగ్గురు సైంటిస్టులని ఆయన అసిస్టెంట్స్‌గా నియమించింది. ఆ పరిశోధన రెండేళ్ళుసాగాక ఇప్పుడు నిర్మాణానికి పూనుకొన్నారు.... ఈ దశలో ఆ ప్రాజెక్టు ఉనికి శత్రువులకెలా తెలిసిందన్నది ఎవరికీ తెలీదు.

"వెల్, ఇప్పుడు శత్రువులు ఈ ప్రాజెక్టుని కాజెయ్యాలని రంగంలో దిగారు. ఇంకా ఇరవై నాలుగు గంటలుంది అది వాళ్ళ హస్తగతమవడానికి.... సందేహం లేదు, సైరస్ వైఫల్యాల్ని సహించడు. అతనెంత సీరియస్‌గా తీసుకుంటున్నాడో మొదట జరిగిన రెండు హత్యల్నిబట్టి అర్థం జేసుకోవచ్చు. ఇప్పుడు అరవింద్ కూడా అతని గుప్పిట్లో ఉన్నాడు—"

ఆత్మారాం ఆగి మళ్ళీ ప్రారంభించాడు—

"రామన్, ఆ రెండు ఆత్మహత్యలు పోలీసుల్ని ఏమీ ఆలోచింపజేయలేదు. సుమిత్రచౌహాన్ డాక్టర్ షిండే అసిస్టెంట్ అని తెలిసినప్పటికీ, అప్పుడామె మానసిక స్థితిని పరిగణలోకి తీసుకొంటే ఆత్మహత్యకు పురిగొల్పిన పరిస్థితులు సుస్పష్టమవుతాయి. అక్కడ ప్రధానంగా ఆమె కుటుంబ పరిస్థితే ప్రస్ఫుటమవుతుందిగానీ, ఆమె చావులో అసహజత్వం అప్పుడే స్ఫురించదు ఎవరికీ! ఆమె సైంటిస్టు. అదేమిటోగానీ, ఢిల్లీలో గడచిన పదిహేనేళ్ళలో నల్గురైదుగురు సైంటిస్టులు ఇలాగే భవనాల మీదనుంచి దూకి ఆత్మహత్యలు చేసుకొన్నారు.... అందువల్ల పోలీసులు దీన్ని ఆత్మహత్యగానే సరిపెట్టుకొంటే

ఆశ్చర్యంలేదు.

"ఇక దినకర్ సంగతి....దినకర్ కూడా డాక్టర్ షిండే రెండో జూనియర్ అసిస్టెంట్ అని పోలీసులకింకా తెలీదు. కానీ నువ్వు గ్రహించే వుంటావు కథాక్రమంలో. ఆ పూర్ బాయ్ చావు వార్త అతని తల్లి మీద ఎలా పనిచేసిందో కథ కనవసరం....కానీ జూలీ గురించి అవసరం. జూలీ గుర్తుందా? దినకర్ ప్రియురాలు? చావుకి ముందు అతడామెని కలుసుకోని ఇంటికొచ్చాడు. రైట్, ఆ జూలీ ఇతని చావు వార్త తెలిసి వెంటనే పోలీసుల్ని కలుసుకుంది—

"మిస్టర్ రామన్, సరిగ్గా అప్పుడే పోలీసుల పక్కలో వేచివున్న టైంబాంబు ఘనామని ప్రేలింది! జూలీద్వారా దినకర్ గురించి తెలిసి డంగై పోయారు. కలకలం బయలు దేరింది....

"డాక్టర్ షిండే రెండో అసిస్టెంట్ కూడా ఆత్మ హత్య! ఇంపాసిబుల్! ఇట్స్ ఫౌల్ గేమ్! అప్పుడే వాళ్ళ బుర్రలు మేల్కొన్నాయి. హుటాహుటిన తిరిగి బిజినెస్‌లో దిగారు. ఘటనా స్థలాల్ని నిపుణులు ఆక్ర మించుకొన్నారు. ఈ సంఘటన వెనుక పెద్ద కుట్ర వుందని పసిగట్టారు. ఇది ఒక వ్యక్తి చర్యకాదని, పెద్ద ముఠావుందనీ అనుమానించారు....

"అదే వేగంతో సైరస్ గ్యాంగ్‌తో సహా అన్ని చిన్నచిన్న ముఠాల కోసం హెచ్చరికలు వెళ్ళాయి. అందిన వాళ్ళని లోపల తోసి తోమారు. అందనివాళ్ళ కోసం అలుపులేకుండా తిరిగారు....వెల్, ఇదిలా సాగు తుండగా మన కథలో ఇప్పుడు హీరోయిన్ జూలీ ప్రవే శిస్తుంది."

"ఏం చేసిందామె?" అన్నాను ముందుకి వంగి.

ఆత్మారాం నవ్వి చెప్పసాగాడు, ఆరో కప్పు టీ లాగించేస్తూ.

# 8

జూలీ వయసు ఇరవైమూడు. తెల్లగా, మామూలు ఎత్తులో, జుట్టు కత్తిరించుకొని, జీన్స్‌తో ఆధునికంగా వుంటుంది.

ఆమె ఓల్డు జాన్ రెస్టారెంట్‌లో సింగర్‌గా పని చేస్తోంది. చక్కగా, తియ్యగా పాడుతుంది. ఆమె టాలెంట్స్‌ని ఇక్కడ వృధా చెయ్యక స్టేట్స్ కెళ్ళిపోతే డోనా సమ్మర్స్‌ని తలదన్నగలదని అభిమానులు గోల పెడుతుంటారు.... కాని ఆమెకి దేశాభిమానం మెండు.

దినకర్‌తో సంవత్సరంనుంచీ ఆమెకి పరిచయం వుంది. అతను బుర్రను ఉద్యోగంలో ఉపయోగించక వ్యసనాల మీద దుర్వినియోగం చేస్తున్నాడని ఆమె ఎన్నోసార్లు కురుచేసింది. మందలించింది. కానీ అతడి తత్వం ఎన్నడూ మారలేదు.

ఇప్పుడు శాశ్వతంగా తనకు దూరమైపోయాడు.

ఫ్లాట్‌కి తిరిగివచ్చినప్పట్నించి ఆమె మనసు నిమిథంగాలేదు. అతని చావుని నమ్మలేకపోతోంది....అది అసంభవమన్పిస్తోంది. లేకపోతే అలా జరగడం అసంభవంగా తోస్తోంది. తనకు ఏమీ తెలియనివ్వకుండా, మాటమాత్రం చెప్పకుండా అతడలా చెయ్యాడనిపిస్తోంది.

అతను బ్లాక్ మెయిల్‌లో ఇరుక్కుంటే తనకెందుకు చెప్పలేదన్నది ఆమెని తీవ్రంగా వేధిస్తోన్న ప్రశ్న! ఆ ఫోటోల్లో తామిద్దరూ వున్నారు. మరి అతని సమస్యను తనతో ఎందుకు పంచుకోలేదు? లేదు, దినక

అంత పిరికితనంగా ప్రవర్తించడు! ఆ మాత్రానికే ధైర్యం కోల్పోయి ప్రాణాలు తీసుకోడు!

ఆలోచిస్తున్నకొద్దీ ఆమెకి దినకర్ చావు వెనుక గూడుపుఠాణీ వుందని నమ్మకం కల్గుతోంది. అసలా ఫోటోలెవరు తీశారు? ఎలా తీశారు? ఎక్కడ తీశారు? బ్లాక్ మెయిలర్ ఎవరు?

పోలీసుల దగ్గర తను ఆ ఫోటోల్ని పరిశీలనగా చూసింది. వాటినిప్పుడు ఉన్నదున్నట్లుగా స్పష్టంగా చూడగలదు మనోఫలకం మీద!

గదిలో అశాంతిగా పచార్లుచేస్తూ జ్ఞాపకం చేసుకోసాగింది.... ఒక్కొక్కటే గుర్తొస్తోంది.... ఆ ఫోటోల్లోని గది అలంకరణ, కిటికీ బయట పరిసరాలు, ఆమెని క్షణాల్లో తను వారంక్రిందట దినకర్ని ఎక్కడ కలుసుకుందో తెలియజెప్పాయి.

వెంటనే ఆమె ముఖం కోపంతో ఎర్రబడింది. పళ్ళు నూరింది. మెరుపు వేగంతో ఆమె బ్యాగు అందుకొని బయటకురికింది. పది నిమిషాల్లో హోటల్ సన్ సెట్ లో వుంది. బి క్లాస్ హోటల్.

ప్రొప్రయిటర్ దారూవాలాకి జూలీ అంటే మంచి ఇష్టముంది. ఆమెని చూసి సంతోషం పట్టలేకపోతూ ఆహ్వానించాడు.

"రా, జూలీ! ఏమిటి సంగతి?"

జూలీ ముఖంలో కోపం ఇంకా ఎక్కువయింది. అతన్ని కోరచూపులు చూసింది.

"దారూ నీతో మాట్లాడాలి, ఆ గదిలోకి పద!" కఠినంగా అందామె, చటుక్కున కదిలి కౌంటర్ వెనుకనించి అవతల గదిలో చొరవగా వెళ్తూ.

దారూవాలా ఆమె ప్రవర్తనకి కలవరపడ్డాడు. సంకోచిస్తూ ఆమెని అనుసరించాడు. "ఏమిటి జూలీ, అలా వున్నావ్?"

ఆమె ఈసారి పళ్ళునూరి, "నిన్ను చాలా నమ్మాను, దారూ!" అంది.

అతనింకా అయోమయంలోనే వున్నాడు. "అవును జూలీ, నువ్వంటే నాకు చాలా ఇష్టం."

"కానీ నువ్వా నమ్మకం వుంచుకోలేదు" అంది జూలీ.

"అసలేమిటి నువ్వనేది జూలీ?"

"నా కళ్ళల్లో చూసి చెప్పు. నువ్వు మోసం చేశావు. అవునా? నిజం చెప్పు ఫాట్సో! నా బ్యాగులో రివాల్వర్ వుంది."

"నే—నేనేం చేశాను జూలీ?" అతని గొంతు వణికింది.

"ఆల్ రైట్, వారం క్రిందట నేనిక్కడ గది తీసుకున్నాను. అవునా?"

"అవును....నీతో మరొకతను వచ్చాడు" అతని కళ్ళనిండా భయిం మెరిసింది.

"మేం రాకముందు ఎవరొచ్చారు? చెప్పు?"

దారూవాలా నోరు విప్పలేదు. పారిపోతానన్నట్టు చూశాడు.

"చెప్పు దారూ, నా బ్యాగులో రివాల్వర్ వుంది. నిన్నిక్కడే చంపుతాను."

"బేటీ! నువ్వలా మాట్లాడకు. నువ్వు ఫోన్ చేసి గది వుంచమన్న కాస్సేపటికి ఎవడో వచ్చాడు. డబ్బు చూపించాడు. సహకరించమన్నాడు. నన్ను క్షమించు బేటీ, రెండు వేలకాశపడ్డాను...."

"నిన్ను క్షమించే దశ దాటింది, దారూ!"

"నన్ను మన్నించు బేటీ! నచ్చి నీ—"

"వాడు మా గదిలో కెమేరా యేర్పాటు చేశాడు, అవునా?"

"అవును. ఆటోమాటిక్ కెమేరా. మీరెళ్ళాక వచ్చి తీసుకెళ్ళిపోయాడు."

"వాడెవడు? తెలుసా?"

"తెలీదు! నల్లగా, ఎత్తుగా, రింగుల జుత్తు.... నాకు నచ్చలేదు. కార్లో వచ్చాడు. పచ్చ అంబాసిడర్."

"నెంబర్ చూశావా?"

"లేదు.... కానీ, ఆగు బేటీ! ఆ బ్యాగుమీద చెయ్యి తీసేయ్! వాడు ఫోన్ నెంబర్ ఇచ్చాడు. మీరు వెళ్ళి పోయాక పిలవమన్నాడు."

"ఆ నెంబర్ చెప్పు ఫాస్ట్!"

"నన్నలా పిలవకు! ఆ నెంబర్ వ్రాశాను. చూపిస్తాను రా!" అతను వేగంగా బయటకు కదిలాడు. జూలీ అనుసరించింది. ఆతను కౌంటర్‌లో చిన్న పుస్తకంతీసి, పేజీలు తిప్పి చూపించాడు. "ఇదుగో బేటీ, నెంబర్!"

జూలీ ఆ కాయితం చింపి తీసుకుంది.

"బేటీ, యేం జరిగింది? యేమిటి గొడవ?"

"నీవల్ల నా ఫ్రెండ్ చచ్చాడు. నిన్ను వూరికే వదలను, టోనీతో చెప్తాను నీ వళ్ళు మరమ్మత్తు చెయ్యమని!"

ఆమె విసురుగా కదిలి బయటికెళ్ళిపోయింది. రోడ్డు చివరగా పబ్లిక్ కాల్ బూత్‌లోకెళ్ళి ఒక నెంబర్ తిప్పింది.

"హలో డియర్.... బాగున్నావా? నేను జూలీని!"

"జూలీ!" సంతోషంతో అరచింది అవతలి కంఠం.

"అబ్బా. నెమ్మది! అవును, జూలీని. సారీ, నీతో హాస్కు కొట్టేందుకు టైంలేదు. నాకో చిన్న సాయం చేసిపెట్టాలి."

"చెప్పు! చెప్పు జూలీ, యేం చెయ్యాలి?"

"ఈ నెంబర్ చెప్తున్నాను చూడు....నాకు అడ్రసు కావాలి."

"ఆ నెంబర్ మా జోన్‌లో వుందని ఎందుకనుకున్నావ్?"

"ఓహ్, డియర్. అలా ఎందుకో అనిపించింది, అంతే" జూలీ నెంబర్ చెప్పింది.

"ఒక్క క్షణం!" అంది అవతలి కంఠం. కొన్ని క్షణాలయాక తిరిగి పలికింది. "కరోల్ బాగ్‌లో ఒక ఫ్లాట్. సబ్‌స్క్రైబర్ పేరు విమలా మజుందార్. అడ్రసు వ్రాసుకో...."

"జూలీ తలూపింది. చాలు, థాంక్స్ సుష్మా."

"ఎవరు జూలీ ఆమె?"

"ఉందిలే ఒక వగలాడి....అయితే ఆ బాస్టర్డు అక్కడుంటాడన్నమాట!"

"జూలీ, జూలీ, ఎవరా బాస్టర్డు?"

"ఉన్నాడులే ఒక రాస్కెల్!" ఆమె ఫోన్ పెట్టేసి బయటకొచ్చింది.

పావు గంటలో ఆ అడ్రసుకు చేరుకుంది. ఆమె సందేహిస్తూ బెల్ నొక్కగానే లోపలనుంచి, "ఎవరూ?" అని పలికింది ఆడగొంతు.

జూలీ గొంతు సవరించుకొని, "జూలీ హియర్, ఓపెన్ ది డోర్!" అంది,

రెండు క్షణాల్లో తలుపుతీసి ఒక 20 యేళ్ళ యువతి తొంగి చూసింది.

జూలీ పలకరింపుగా నవ్వింది. "హలో డియర్ కులాసేనా?"

ఆ యువతి కలవరంగా చూసింది. "క్షమించాలి, మీ రెవరు?"

"నీకు కావాల్సినదాన్నే. లోనికి రానివ్వు" లోని కెళ్ళబోయింది జూలీ.

ఆ యువతి అడ్డు తొలగలేదు. "మీరు-మీరెవరో-"

జూలి ఆమెని వెనక్కి తోసేసి లోనికెళ్ళింది. "చూడూ, నా బ్యాగులో రివాల్వర్ వుంది. మాజర్ ఆటోమేటిక్. మర్యాదగా అడిగింది చెప్పు. నీ లవర్ బాయ్ ఎక్కడ?"

"ఏమిటి? ఎవరు మీరసలు?"

"ప్రశ్న లెయ్యకు! అడిగింది చెప్పు. లవర్ బాయ్ ఎక్కడ?"

ఆమె గాభరా పడింది. "అతనితో ఏం పని?"

"చూడు పోరీ! మరోసారి చెప్తున్నాను—"

"నన్ను పోరి అంటావా?!"

"షటప్. మళ్ళీ అరుస్తే నోట్లో గుడ్డ నింపేస్తాను. విను! నీ లవర్ బాయ్‌ని కాపాడాలనుకోడం పిచ్చితనం! నువ్వేమీ చేయకపోయి వుండవచ్చు. కానీ వాడ్ని కాపాడబోయి కష్టాల్లో పడ్తావు. ఇది ఖూనీ కేసు వెర్రి మొఖమా!"

ఆ యువతి ముఖం పాలిపోవడం గమనించింది జూలీ. తోక త్రొక్కిన త్రాచులా ఎగిరి జూలీమీద పడిందా యువతి క్షణకాలంలో! ఆమెని వెనక్కి నెట్టేస్తూ గోడ

కేసి కొట్టింది. తల తట్టుకొని గోడకి బాదబోయింది.

అప్పటికి తేరుకొన్న జూలీ, తన కాళ్ళతో ఆ యువతి పాదాల్ని తన్ని, పట్టువదలి బోర్లాపడేలా చేసింది. పడుతూ ఆ యువతి జూలీ కాళ్ళు కూడా పట్టిలాగేసి సింది. అదే పళంగా జూలీమీద ధబీమని బోర్లాపడింది.

క్రిందనుంచి చేపలా జారిపోయి చెంగున నిలబడి జూలీ జుట్టుపట్టుకుందా యువతి. కానీ రిబ్బను వూడిరావ డంతో కాలితో తల వెనుక బలంగా ఈడ్చి తన్నింది.

జూలీ ఉక్కిరిబిక్కిరై వెల్లకిలా తిరిగింది. మరో దెబ్బ పడింది....అలా పడుతోనే వున్నాయి....ఆమె ఎప్పుడో కళ్ళు మూతపడి అచేతనంగా, జడపదార్థంలా వుండిపోయింది....

ఆ యువతి తటాలున జూలీ బ్యాగు అందుకొని, దాన్ని తెరిచి చూసి, "హుం!" అని కసిరి దూరంగా విసిరికొట్టింది.

అప్పుడు గబగబా ఫోన్ దగ్గరికెళ్ళి డయల్ తిప్పింది.

"హలో జోగ్లేకర్, జయన్ కన్పించాడా?"

"లేదు విమ్మీ... ఎందుకు?"

"వెంటనే కలుసుకుని నా దగ్గరికి రమ్మను!"

"కాని ఎక్కడున్నాడు? మకాం మార్చేశారని విన్నాను."

ఆమె వెంటనే అడ్రసు చెప్పి డిస్కనెక్టు చేసింది.

చటుక్కున తిరిగి షెల్ఫుమీద తాడు అందుకుంది. దాంతో ఆత్రుతగా, వేగంగా జూలీ దగ్గరికి కదిలింది....

## 9

డాక్టర్ షిండే అసహనంగా సిగరెట్ విసిరేసి లేచాడు.

ఆయనకేమీ బోధపడ్డంలేదు. ఈ సంఘటన లేమిటో, ఎందుకు జరుగుతున్నాయో అంతుపట్టడంలేదు! పోలీసు రాకపోకలూ, వారి ప్రశ్నలూ వేధింపులతో ఆయన పిచ్చెత్తిపోయాడు. తీవ్రంగా ఆందోళన పడ్డాడు.

ఉన్నట్టుండి ఈ ఉదయం అంతా ఏం కూడబలుక్కున్నారు? ఎందుకీ చావులు! ఆయన మనసు వికలమైంది. ఈ సంఘటనల అర్థమేమిటి? సూచనలేమిటి? తన ఇన్నేళ్ళ కృషి ఫలించబోతున్న తరుణంలో ఏదైనా విపత్తు సంభవించబోతోందా....?

ఈ భయంకరమైన ఆలోచన ఆయన్నింకా ఆందోళనకి గురిచేస్తోంది—దాన్ని దూరంగా వుంచుతూ, ఏవేవో సర్ది చెప్పుకుంటూ కాలాన్ని క్షణమొక గంటలా గడుపుతున్నాడు.

దానికి తోడు అరవింద్ వ్యవహారం ఒకటీ! ఈ స్టుపిడ్‌కి తను రెండుసార్లు ఫోన్ చేశాడు ఇంటికి. ఉలుకూ పలుకూ లేదు. ఉదయంనించీ అతనింట్లో లేడు. ఇప్పుడు మధ్యాహ్నం ఒంటిగంట. అతను తప్పకుండా ఉదయం ఏడున్నర ఫ్లైట్‌కే వచ్చేసి వుండాలి. మరి వచ్చినవాడు తనకు ఫోన్ చెయ్యాలా? ఏమిటి చెయ్యకపోవడంలోని ఉద్దేశ్యం? రాలేదా? మరి భార్య యేమైంది? ఎందుకు పలకడంలేదు?

ఇటువంటి సవాలక్ష సందేహాలతో ఆయన వేడెక్కిపోయి తల పగిలిపోతోందన్పిస్తోండగా, ఇక భరించలేక కారెక్కి తిన్నగా అరవింద్ ఇంటికి బయల్దేరాడు.

కార్లో ఆయనకిద్దరు గార్డ్సు వున్నారు. లేకుండా ఆయన ఎక్కడా కదలకూడదు. కారు ఇంటికి చేరగానే, ఆ గార్డు సైతం వూహించనంత వేగంగా కిందికి దూకేసి

పరిగెత్తి, తలుపుమీద దబదబకొట్టాడు; ముఖంమీద చెమట తుడుచుకొంటూ.

తలుపు తీసిన అరవింద్ అటువంటి షాక్‌ని జన్మలో చవిచూడలేదు.

బెదిరిపోయి, వెన్నులోంచి వణుకుపుట్టి, గుండెకొట్టుకోవడం మానేసింది.

"అరవింద్!" డాక్టర్ అర్చాడు అతన్ని పట్టుకొని, "యేమిటిది! యేం జరిగింది?"

అరవింద్ ముఖం పాలిపోయి, కళ్ళు వాచి, చేతులు నిస్సత్తువగా, వొళ్ళు చల్లగా చిక్కి—శల్యమైన దీర్ఘకాల రోగిలా వున్నాడు.

"అరవింద్! మాట్లాడు!" డాక్టర్ కుదిపేశాడు.

అరవింద్ స్వప్నలోకం వచ్చిన వాడిలా ఉలికిపడి, "సర్—మీరు—మీరిలా—" అన్నాడు అస్పష్టంగా గొణుగుతూ.

"యేమైంది? చెప్పు. ఎందుకిలా వున్నావ్?"

మళ్ళీ అరవింద్ గొంతు పూడుకుపోయింది. డాక్టర్ అసహనంగా గార్డ్సని సైగచేసి లోనికి పరుగుతీశాడు. గార్డ్సు అరవింద్‌ని పట్టి సోఫావైపు నడిపించారు.

కంగారుగా బెడ్‌రూంలో కెళ్ళిన డాక్టర్ సంభ్రించిపోయాడు. రక్తం గడ్డకట్టినట్లయింది. ఎదురుగా మానసి బెడ్‌మీద రెండు మోకాళ్ళమీద గడ్డం ఆనించి, శూన్యంలోకి చూస్తూ, పీక్కుపోయిన ముఖంతో, ఎండిపోయిన పెదవులతో, లోతుకుపోయిన కళ్ళతో జీవం లేనిదానిలా కూర్చునివుంది.

"మానసి!" అన్నాడాయన ఆమె ప్రక్కన కూలబడి "మానసి! ఏమిటిది? ఏమైంది? చెప్పవేం!" ఆమెని పట్టి

ఊపేస్తూ అరిచాడు.

ఆమె తెలివిలోకి వచ్చినట్లు ఉలికిపడింది. డాక్టర్ని గుర్తుపట్టి చివాల్న వెక్కి జరిగిపోయింది భయంతో. కానీ పెల్లుబికి వచ్చిన దుఃఖం ఆమెని ఆయన వళ్ళోకి నెట్టింది. డాక్టర్ గుండెల కతుక్కుపోయి రోదించ సాగింది.... వెక్కి వెక్కి ఏడ్వసాగింది....

డాక్టర్ ఆమె తల నిమురుతూ మౌనంగా వుండి పోయాడు కాస్సేపు.

"మానసి, మై గర్ల్, ఏమిటిది?"

"ఓ౼హ్, డాక్టర్!" అర్చిందామె.

"కమాన్! స్పీకప్! ఏం జరిగింది?"

"డాక్టర్ — బాబుని —"

"బాబుని....?" అన్నాడాయన ఉలిక్కిపడి. అంత వరకు బాబు గుర్తుకు రాలేదు. చుట్టూ చూశాడు. "చెప్పు, బాబుకేమయింది?"

ఆమె మళ్ళీ నోరు తెరిచే లోపులో అరవింద్ అక్కడ వున్నాడు, వగరుస్తూ వణికిపోతూ పరుగెత్తుకొచ్చి. కానీ అతను నోరు తెరవడమే ఆలస్యమైంది—

మానసి వెక్కిళ్ళు ఆపుకుంటూ అంది—"బాబుకి—"

"బాబుని హాస్పిటల్లో చేర్పించాం!" అర్చాడు అరవింద్ గొంతుచించుకుని, మానసిని వెనక్కులోసేస్తూ.

డాక్టర్ నిర్ఘాంతపోయి చూశాడు.

"ఎందుకు? ఎందుకు చేర్పించారు?"

"జ్వరం! జ్వరం, సర్! ఉదయం నేనొచ్చాను, ఒళ్ళు కాలిపోతూ శోష లేకుండా పడివున్నాడు—నూటాఆరు! వెంటనే హాస్పిటల్కి తీసుకెళ్ళాను. వాళ్ళక్కడే వుంచేసుకున్నారు—"

"మరి మీరిక్కడ?"

"మా అవసరంలేదు పొమ్మన్నారు. వాళ్ళే చూసు కుంటారట—"

డాక్టర్ కళ్ళల్లో అనుమానం మెరిసింది. కానీ ఎక్కువ సేపు ప్రదర్శించకుండా అరవింద్ ని ఆపాదమస్తకమూ నిశితంగా చూశాడు. చూస్తున్న కొద్దీ పరిసితి అసహజంగా తోచసాగింది ... ఆ తర్వాత ఎక్కువవుతోంది.... తమాయించుకొంటూ మనసులో ఒక నిర్ణయం చేసుకున్నాడు. వాళ్ళిద్దర్నీ మార్చి మార్చి చూసి ఫకాలున నవ్వేశాడు.

"మీరు నిజంగా ఎంత పిచ్చివాళ్ళు! పిల్లాడికి జ్వరమైతే ఈ అవతారాలా!" మళ్ళీ నవ్వాడు, "టేకిట్ ఈజీ .... ఎవరైనా నవ్విపోతారు. ఏ హాస్పిటల్ లో చేర్చారు?"

"చిల్డ్రన్ హోమ్, కరోల్ బాగ్ లో...." వచ్చేశాయి మాటలు అరవింద్ నోటివెంట.

డాక్టర్ ఇంకో అయిదు నిమిషాలు అక్కడ గడిపాడు; పరామర్శిస్తూ; అభయమిస్తూ. అప్పుడు సెలవు తీసుకొని నెమ్మదిగా జారుకున్నాడు.

వేగంగా ఇంటికి చేరుకొని అరవింద్ చెప్పిన హాస్పిటల్ కి ఫోన్ చేశాడు. ఊహించినట్టే అతని మాటలు అబద్దమని ఋజువైంది.

కాబట్టి మరో నెంబర్ తిప్పి పోలీస్ కమీషనర్ తో మాట్లాడాడు.

డాక్టర్ మాటలు పూర్తిగా విన్న కమీషనర్ అన్నాడు—"యస్, డాక్టర్. ఇప్పుడర్థమైంది. కేసు విడిపోతోంది....దిసీజ్ కిడ్నాప్. ఆ పిల్లాడ్ని ఎత్తుకు

పోయారు. అంతే. మీరు నిర్భయంగా వుండండి. దీన్ని నేను హాండిల్ చేస్తాను....డోంట్ వర్రీ!"

"థాంక్యూ, కమిషనర్!" అంటూ డాక్టర్ ఫోను పెట్టేసి నిట్టూర్చాడు.

లైను అవతల కమిషనర్ చంద్రజిత్ రైనా కూడా ఫోను పెట్టేసి, ఇంటర్ కంలో "ఇన్స్పెక్టర్ దేవ్," అన్నాడు.

మరునిముషం ఇన్స్పెక్టర్ దేవ్ లోనికి వచ్చాడు.

రైనా గబగబా సంగతి చెప్పాడు.

"చాలావరకు గ్యాంగ్స్ పట్టుబడ్డాయి. వాళ్ళందరి ఎలిబీలు రుజువయ్యాయి. ఇన్నోసెంట్స్. కానీ సైరస్ జాడలేదు. వాచిట్! ఇది వాడి పని కావచ్చు. వెంటనే మనుషుల్ని పంపండి, మఫ్టీలో. అరవింద్ ఇంటిదగ్గర నిఘా వుంచండి. అతని కదలికల్ని కనిపెట్టండి. బి కేర్ఫుల్! ఇది చాలా సున్నిత వ్యవహారం. ఇదిగో అడ్రసు...."

# 10

విక్టర్ ముసిముసిగా నవ్వుతూ షబ్నమ్ని చూశాడు. ఆమె ఉరిమి చూసి తల తిప్పుకుంది. ఆమె భుజమ్మీద వినయ్ నిద్రపోతున్నాడు....విక్టర్ దగ్గరకు జరిగి అతడి బుగ్గలు నిమిరాడు.

"వెరీ నైస్. మనకూ ఇలాంటి బాబు వుంటే బాగుంటాడు కదూ?"

షబ్నమ్ గిరుక్కున తిరిగి ఛెళ్ళుమనిపించింది అతని చెంప!

"పిచ్చిగా వాగావంటే పళ్ళూడతాయి, జాగ్రత్త!"

విక్టర్ ఆ బాధ ఓర్చుకున్నాడు. చెంప రుద్దుకుంటూ

ఆమెకేసి నిరసనగా చూశాడు.

"నేనంటే నీకసహ్యం! ద్వేషం తేలికతనం! ఎందుకని? నీ హృదయం పాషాణం! నీలో కనీస జాలీ దయా లేవు! ఒక్కోసారి అనిపిస్తుంది నువ్వు మనిషివి కాదు, రక్క సివి—"

ఆమె మళ్ళీ కొట్టబోయింది. అతను చటుక్కున చెయ్యి పట్టి ఆపాడు. ఆమెని దీనంగా, అర్థింపుగా చూశాడు.

"నన్నెందు కర్థం జేసుకోవు, షబ్నమ్? ఎందుకిలా శిక్షిస్తావు? ఎన్నాళ్ళిలా రంపపుకోత పెడతావు? ఒక్కమాట చెప్పలేవా—ఒక్కమాట నన్ను ప్రేమిస్తు న్నానని— నేనంటే నీకు—"

"చెయ్యొదులు ముందు! రాస్కెల్, నీ దరిద్రపు మొఖానికి ప్రేమ కావాలా. మళ్ళీ ఆ మాట అన్నా వంటే నోట్లో ఉమ్మేస్తాను, నూవర్ కే బచ్చే!"

ఆమె చెయ్యి విడిపించుకొని, నిప్పులు కురిపిస్తూ విస విసా వెళ్ళిపోయింది.

విక్టర్ నిట్టూర్చాడు. ముఖం తుడుచుకొని చేతికి చెమట తుడుచుకున్నాడు.

## 11

జయన్ వంగి నేలమీద జూలీను పరిశీలనగా చూశాడు.

"నో డౌట్! ఈ పిట్ట జూలీ....మామూలు పిట్టకాదు సుమా, కోకిల. సుమధుర గానకోకిల. క్లబ్ లో కమ్మగా పాడి కైపెక్కించే బ్యూటిఫుల్ థింగ్. ఈ పిట్ట ఇక్క డెలా వాలింది బేబీ?"

విమ్మి అంతా వినిపించింది.

"బ్రౌరా....ఎంత గొప్ప సాహసం!" జయన్ నవ్వాడు పెద్దగా, గుండెలు బాదుకుంటూ. "వీర నారీ వర్ధిల్లు!" అన్నాడు.

విమ్మి కూడా నవ్వేసింది. "పిట్టకి బక్క ప్రాణం జయ్. లెక్కబెట్టి మూడు ఇచ్చానో లేదో, మూర్ఛలోకి చెక్కేసిందంతే!"

"వెల్ డన్. ఎగిరిపోనిచ్చావు కాదు. అన్నట్టు మా కొత్త మకాం నీకెలా తెలుసు బేబీ!"

"నువ్వే కదా డార్లింగ్ చెప్పావు!"

"నేనా?"

"నువ్వే డార్లింగ్. మొన్న వచ్చినప్పుడు చెప్పావు, మీ కొత్త మకాం, కొత్త ప్లాను—"

"నీతోనా?"

"నాతో నే—నవ్వప్పుడు బాగా తాగేశావులే డార్లింగ్—"

ఆమె ముఖం బ్రద్దలయ్యేలా జయన్ పిడికిలి విసురుగా వచ్చి తగిలింది. కళ్ళు చీకట్లుకమ్మి ఊపిరందక ఆమె గిర గిరా తిరుగుతూ వెళ్ళి తలుపుకి కొట్టుకొని, ధబీమని వెల్లికిలా పడింది ఆవతలి గదిలో.

"మర్చిపో! వింటున్నావా? మర్చిపో! గుర్తు చేసుకోకు!"

విమ్మి అంత బాధలోనూ అర్చింది: "అలాగే జయ్! మర్చిపోతాను! గుర్తు చేసుకోను!"

"గుడ్! ఇక లేచిరా, ఈ పార్సిల్ని డిక్కీలో పడేద్దాం."

విమ్మి అతి కష్టంమీద లేచి తూలుతూ, మూలుగుతూ

వచ్చింది. ఇద్దరూ కలిసి జూలీని లేపి బయటకు మోసు కెళ్ళారు. చుట్టూ కాంపౌండ్, దట్టంగా చెట్లూ వున్నాయి. మెట్లదగ్గర కారు డిక్కీ తెరిచి ఆమెని అందులో చేర్చారు. డిక్కీ మూసేసి కారెక్కాడు జయన్.

"మర్చిపోయావా?"

"మర్చిపోయాను, జయ్! ఒట్టు!" ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"గుడ్!" అతను కారు స్టార్టుచేసి వెళ్ళిపోయాడు.

బయట కారు శబ్దం విని సైరస్ కుర్చీలోంచి దూకాడు. సేన్, విక్టర్‌లు తటాలున తలుపుదగ్గర కెళ్ళారు. తలుపుతీసి మెట్లదగ్గరాగిన కారును చూశారు. వీధిలో జనం ఎవరూ లేరు. జయన్ కారు దిగి డిక్కీ వైపు చూపించాడు. విక్టర్ చటుక్కున కదిలి డిక్కీ తెరిచాడు. సేన్ వంగి చూశాడు. మరుక్షణం వాళ్ళిద్దరు మెరుపు వేగంతో జూలీని లేపుకొని ఇంట్లోకొచ్చి పడ్డారు.

సైరస్ బెదిరిపోయి అర్చాడు, "నో! ఈయన జూలీ___"

"మాట తప్పు అంకుల్. ఈమె జూలీ!" అన్నాడు జయన్, "దినకర్ లవర్! ఇంత త్వరగా, ఇంత స్పీడుగా మనల్ని క్యాచ్ చెయ్యడం వండర్‌గా లేదూ?" అని విమ్మా దగ్గర జరిగింది చెప్పి, "ఈమె డేరింగ్ నేచర్‌ని మెచ్చుకోవాలి అంకుల్?" అన్నాడు.

"నోర్ముయ్, స్టుపిడ్!" సైరస్ అర్చాడు, "ఈమెని ఆ గదిలో పడెయ్యండి. కట్టి తాళం వెయ్యండి! ఆమె సంగతి తర్వాత చూద్దాం."

"ఇంకెప్పుడు చూస్తావు? ఈమె ఇంకా బ్రతికి వుండడం మంచిది కాదు."

"ఓహో, తెలుసు! ఈ పరిస్థితుల్లో పోలీసులకి మరో శవం దొరకడం మంచిదికాదు! బుర్ర కెక్కిందా? ఈమె టినకర్ లవర్. మన ఎస్సైన్ మెంట్ పూర్తయే వరకూ బందీగానే వుంటుంది. పడేయండి ఆమెనా గదిలో."

విక్టర్, సేన్లు సైరస్ చెప్పిన గదిలో పడేసి తాళం వేశారు.

"వినండి!" సైరస్ అన్నాడు మళ్ళీ, "రేపు రాత్రి కల్లా అంతా పూర్తయిపోతుంది. ఆపైన క్షణం కూడా మనమిక్కడ వుండం! సింగపూర్ ప్రయాణమవుతాం. సమ్మతమేనా? ఈ డబ్బు తరిగేదాకా వేరే ఆలోచనలు వుండకూడదు. ఈ వృత్తికి స్వస్తి. నాకు విశ్రాంతి కావాలి. కొన్నాళ్ళు ప్రశాంతంగా జీవించాలి....అంతే. డబ్బయిపోయాక కొత్త ప్రపోజల్. అన్నాళ్ళూ మీరు నాతోనే వుంటారు. ఏమంటారు? మీరు నా మాట ఎప్పుడూ కాదనలేదు."

"కాదనం అంకుల్, అలాగే కానీయ్." అన్నాడు సేన్ ఉత్సాహంగా.

"నాకు నమ్మకం లేదు అంకుల్." జయన్ అన్నాడు నిరాశగా.

షబ్నమ్ అంది, "నీకు అపనమ్మకం ఎక్కువ, శకున పక్షీ!"

"నువ్వు నోర్ముయ్ చెకుముకి పిట్టా!" జయన్ కసిరాడు.

"స్టాపిట్, యేమిటి మీ పిల్లికూతలు?" సైరస్ కల్పించుకున్నాడు.

"నాకు నమ్మకం లేదంకుల్!" జయన్ అన్నాడు మళ్ళీ.

"ఏం, ఎందుకని?"

"అరవింద్‌ని నమ్మకంకుల్, అతనంత సులువుగా తలొగ్గడు!"

"లొంగకపోతే బిడ్డని చంపుతాం.... కసక్ .... కసక్ ....!"

జయన్ నవ్వాడు. "పిచ్చి అంకుల్! బిడ్డనీ ప్రాజెక్ట్‌నీ కాపాడ్డానికి తనే ఆత్మహత్య చేసుకుంటే?"

సైరస్ విసురుగా అన్నాడు, "యేమిటి నువ్వనేది?"

"దేశద్రోహానికి ఇష్టపడక అరవింద్ ఆత్మహత్య చేసుకుంటే బిడ్డ దక్కుతుందనీ, ప్రాజెక్టు చెక్కు చెదరదనీ అర్థం చేసుకో అంకుల్. అరవింద్ అలా ఆత్మహత్య చేసుకుంటే బిడ్డని మనం చంపడంలో అర్థంలేదు. ఏమంటావు? అందుకే ఈ జాబ్ సక్సెస్ అవుతుందని నమ్మలేనంటున్నాను....మన గెలుపోటములు అరవింద్ మీద ఆధారపడి వున్నాయి—"

సైరస్ ముఖం ఉద్రేకంతో కందిపోయింది! "మన గెలుపోటములు మన చేతుల్లో వున్నాయి. ఈ గీతల్లో! చూస్తున్నావా? ఈ గీతల్లో గెలుపే వుంది. ఓటమిలేదు" అర్చాడతను.

"ఆల్‌రైట్, మన చేతుల్లోనే వుంది; గెలుపే వ్రాసి వుంది." జయన్ అంగీకరించాడు సైరస్ తృప్తికోసం.

"లెటజ్ గో!" అన్నాడు సైరస్. "మిస్టర్ సెతో సింగపూరు వెళ్ళే యేర్పాటు చేసుకోవాలి...."

సమయం సాయంత్రం అరవుతోంది.

* * *

"రామన్!" ఆత్మారాం అన్నాడు, నక్షత్రాల్ని చూస్తూ. "సైరస్‌కి ఆత్మవిశ్వాసం ఎక్కువ. తన సామర్థ్యం మీద నమ్మకం ఎక్కువ. అందుకే అంత కచ్చితంగా అనుకున్నది జరిగితీరుతుందన్నట్లు—దానికి తిరుగు లేదన్నట్టు మాట్లాడాడు. వెల్, మానవుడు తలపోస్తాడు. కానీ దేవుడు నిర్ణయిస్తాడు. మితిమీరిన ఆత్మవిశ్వాసం కూడా మూర్ఖత్వం కిందే లెక్క. ఏమంటావు?"

"కావచ్చు."

"కానీ సైరస్ అప్పుడే మూర్ఖుడనుకోలేం. అయితే ముందు ముందు జరగబోయే సంఘటనల్లో పూర్తిగా తెలివితక్కువతనం ప్రదర్శించాడు. దాని ఫలితం ఏమిటో నీకు తెలుసు. విధి ఎప్పుడూ అనూహ్యంగానే వుంటుంది. వెల్, నువ్వు నవల ఒకే పట్టులో వ్రాసి పడేయలేవు. ఒకసారి వ్రాశాక ఎక్కడో ఒక పదం నచ్చదు. మరెక్కడో ఒక వాక్యం అతకదు. ఇంకెక్కడో ఒక మాట సందర్భోచితంగా ఉండదు. వాటిని సవరిస్తావు. మార్పులూ చేర్పులతో మెరుగులుదిద్ది బాగా వ్రాస్తావు. అప్పుడు మనసుకు నచ్చితేనే ఓ. కే అంటావు. ఇంత శ్రద్ధ తీసుకోకుండా నువ్వు వ్రాయడం అనవసరం. అయినప్పటికీ ఇంకెక్కడో నీకు తెలియని పొరపాటు అభిప్రాయమో, అంశమో ఉండనే వుంటుంది. అది చదివే వాళ్ళకు దొరుకుతుంది. లేకపోతే విమర్శకులకి పనేం వుంటుంది చెప్పు?

"అందుకని ఈ కథని మనమిలా మధ్య మధ్యలో లూప్ హోల్స్‌తో వదిలేయక, వాటిని చివరికి చర్చిద్దాం. అప్పుడే నువ్వు డౌట్స్ అడగాలి. కథాగమనానికవి ఆటంకం కలిగించకుండా వుండేందుకే ఈ ఏర్పాటు.

ఏమంటావు?"

"అలాగే!"

"అప్పటివరకు ఓపిక పడతావుగా?"

"పడతాను."

"అయితే కథలో కెళ్ళిపోదాం—ముగింపు దాకా డైరెక్టుగా నడిపించేద్దాం ఒకే పట్టులో!"

## 12

జూలీ కళ్ళు తెరిచింది....

ఆమె ఒళ్ళంతా నొప్పులుగానూ, కళ్ళు విపరీతమైన మంటలుగానూ వున్నాయి. తనెక్కడుందో తెలియదు. చీకటితప్ప ఏమీ కన్పించడంలేదు. జ్ఞాపకం చేసుకోడానికి ప్రయత్నించింది. లాభంలేకపోయింది. మరి కాసేపట్లో తన కాళ్ళూ, చేతులూ కట్టేసివున్నాయని తెలుసుకుంది. కానీ ఆ కట్లు వదులుగా వున్నాయి. విడిపించుకోవడం కష్టంకాలేదు. చెంగున లేచి నిలబడింది.

ఇప్పుడామె భయం రెట్టింపయింది. అంతా గందరగోళంగా అన్పిస్తోంది. తనకేం జరిగిందో అంతు చిక్కడం లేదు! తనెక్కడుందో అసలు తెలీదు! క్రమంగా పూర్తి తెలివిలోకొచ్చాక ఆమెకేదో విన్పించింది....కీచుశబ్దం. కాదు ఏడ్పు! పసిపాప ఏడుపు. గుక్క తిప్పుకోకుండా వస్తోంది!

ఆమె అయోమయంగా గోడని తడుముకుంటూ వెళ్ళింది. ఒకచోట ఏవో తగిలాయి. వెంటనే ఆగి అవేమిటో గుర్తించింది. చకచకా వాటన్నింటినీ నొక్కేసింది. గదిలో వేలాడుతున్న ఒకే ఒక్క బల్బు హఠాత్తుగా వెలిగింది! గది ప్రకాశవంతమైంది!

ఆమె తేలిగ్గా వూపిరి పీల్చుకుంది. ఒక్క క్షణంలో

తనెక్కడుందో అర్థమైంది. శత్రువు ఖైదులో.

గదిని పరికించి చూసింది. పాతగోడలు, పెచ్చులూడిన సీలింగ్, గదిలో ఓమూల చిన్న మేజా, దానిమీద పాల పొడిడబ్బా, మర చెంబూ.... వాటిని ఆసక్తిగా చూసింది. బయట ఏడుపు ఇంకా ఎక్కువైంది. దాంతోబాటు ఒక ఆడగొంతుక అరుస్తోంది.... జూలీకేం చెయ్యాలో తోచక మేజా ఎక్కి కూర్చుంది.

షబ్నమ్ విసిగిపోయింది. వినయ్ ఓ పట్టాన ఏడుపు మానడంలేదు. పావుగంటనుంచీ ఏడుస్తున్నాడు. ఊరుకో బెట్టలేక ఆమె ప్రాణం విసిగింది. సహనం చచ్చింది. చేయికూడా చేసుకుంది. చెవులుపట్టి మెలేసింది. అరగంట క్రితమే పాలుపట్టింది—మళ్ళీ అప్పుడే ఏడుపు.

షబ్నమ్‌కి నిజంగా ఏడుపు ముంచుకొచ్చింది. ఈ న్యూసెన్స్ భరించలేకపోయింది. పరాయిబిడ్డని చూచుకొనే ఖర్మపట్టినందుకు తిట్టుకుంది. ఇప్పుడేదీ అనుకుని లాభంలేదనుకుని సీసా పట్టుకుని మళ్ళీ పాలు కలపడానికి బయల్దేరింది.

బయట అడుగులు విని జూలీ గభాల్న మేజా దూకేసింది. ఓ ఆలోచన మెరిసి లైటార్పేసింది...అదేక్షణంలో తాళంతీసిన చప్పుడయింది. జూలీకి టేబుల్ మీద పాల డబ్బా, చెంబూ స్ఫురించాయి.

తలుపు కిర్రుమంటూ చిన్నగా తెరుచుకుంటుంటే ఆమె వూపిరి బిగబట్టి చూసింది. లోపల టార్చి వెలుగు పడింది. అది నేలమీద నలువైపులా ప్రసరిస్తోంటే ఆమె తలుపుప్రక్కన అతుక్కుపోయి నిల్చుంది. ఇంతలో హఠాత్తుగా టార్చి ఆరిపోయి తలుపు మూసుకోబోయింది- జూలీ ఆలస్యం చేసి ఆ అవకాశాన్ని జారవిడుచుకో

దలచలేదు.

తలుపు ప్రక్కనుంచి మెరుపువేగంతో పిల్లిలా బయటకు గెంతి, ద్వారంలో షబ్నమ్‌ని బలంకొద్దీ ఢీకొట్టి వెల్లకిలాపడేస్తూ పరుగుతీసింది.

మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చినదానిలా ఆగిపోయి, వెనుదిరిగి వచ్చి షబ్నమ్ కడుపులోనూ, నడుము మీద చాచి తన్నింది.

కిందపడి ఇంకా తేరుకోలేని షబ్నమ్, అదనంగా సర్‌చార్జిలా పడ్డ దెబ్బలకి తాళలేక తన్నుకుంది. జూలీ వంగి ఆమె తలపట్టి నేలకేసి బాదింది. అప్పుడు షబ్నమ్ అదుపులోకొచ్చి రెండు కాళ్ళెత్తి జూలీ వీపుమీద తన్నడంతో—పల్టీలుకొడుతూ దూరంగా వెళ్ళి పడింది జూలీ. ఆ అదనుతో పులిలా లేచి దూకబోయింది షబ్నమ్. కానీ ఆలస్యమైంది—

కుర్చీకోడు ఆమె నెత్తిమీద ఫట్‌మంది.

"ఎలా వుంది పోరీ!" అర్చింది జూలీ.

కుప్పలా కూలిపోయింది షబ్నమ్.

జూలీ కుర్చీ పడేసి, ఏడుపు వస్తోన్న గదిలో కురికింది. కాస్సేపు తటపటాయించి, వినయ్‌ని చంకన బెట్టుకుని బయటికి దౌడుతీసింది—

## 13

మిస్టర్ సి ని కలుసుకుని తిరిగివచ్చిన సైరస్ అండ్ పార్టీకి షబ్నమ్ స్వాగతం గుండెల్లో దడపుట్టించింది.

"షబ్నమ్! ఏం జరిగింది?" అరిచాడు సైరస్ అదుర్దాగా.

షబ్నమ్ చేతులు నలుపుకొంటూ నిల్చుంది. ఆమె జుట్టు బట్టలు చెదిరిపోయాయి. కళ్ళల్లో విపరీతమైన భయం

మెరుస్తోంది. నోరు పెగలడంలేదు.

"షబ్నమ్! యూ ఫూల్, ఏం జరిగింది?"

"జూలీ.... జూలీ పారిపోయింది, అంకుల్!"

సైరస్ అదిరిపడ్డాడు, "ఏమిటీ! జూలీ పారిపోయిందా!"

"అవునంకుల్! పిల్లాడ్నెత్తుకుపోయింది!"

"పిల్లాడ్ని....!! చంటాడ్ని ఎత్తుకుపోయిందా!"

షబ్నమ్ తలూపింది, విపరీతంగా వణికిపోతూ. సైరస్ ముఖం కందిపోయింది. కోపంతో, అవమానంతో.... ఆవేశంతో పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అతని అనుచరులు కొయ్యబొమ్మలా నిల్చుని కళ్ళప్పగించి చూస్తున్నారు.

"యూ కవర్డ్ బిచ్! ఎలా జరిగిందిది?" సైరస్ ముందుకు దూకి షబ్నమ్‌ని పట్టుకున్నాడు.

"అంకుల్, అంకుల్, ఇప్పుడే పదినిమిషాల క్రితం...." షబ్నమ్ చెప్పింది రొప్పుతూ రోజుతూ; ఊపిరి సరిగా అందక ఆయాసపడుతూ.

సైరస్ వింటూ నిలువునా కంపించిపోయాడు. "ఎంత పని చేశావు రాక్షసీ!" పిడికిలితో ఆమె ముఖం బద్దలు చెయ్యాలన్నంత ఉద్రేకం అణచుకొని ఒక్క విదుపుతో ఆమెని వెనక్కి నెట్టేశాడు, కుర్చీలోపడి దాంతోపాటు దొర్లిపోయేలా. విసురుగా అనుచరులవైపు తిరిగి పాములా బుసకొట్టాడు.

"పరిగెత్తండి! ఆమెని గాలించండి! క్విక్, తక్షణం పట్టుకోండి! గెటవుట్ యూ డమ్మీస్, అలా నా ముఖం చూస్తారేం? పారిపోండి! ఈ పరిసరాల్లోనే వుంటుంది ఎక్కడో. వెళ్ళండి త్వరగా! ఓహ్, వినండి! మళ్ళీ ఇక్కడికి తిరిగి రాకండి! ఈ ఇల్లు వదిలేయాలి!

నేను దరియాగంజ్ ఇంటికెళ్తున్నాను—అక్కడికే రండి! గెటవుట్, యూ అగ్లీ బాస్టర్డ్స్! మూవ్ ఫాస్ట్—"

ఆ ముగ్గురూ మరబొమ్మల్లా బయటపడి, కార్లో దూకి దూసుకుపోయారు.

షబ్నమ్ లేవడానికి ఆమె కాళ్ళూ చేతులూ ఆడ్డం లేదు.

సైరస్ ఆమెకేసి చేతులు జాపి కదిలాడు; పళ్ళు నూరుతూ, నిప్పులు కురిపిస్తూ.

"నన్ను క్షమించు అంకుల్!" షబ్నమ్ అర్చింది గొంతు పెగల్చుకొని.

సైరస్ అడ్డంగా తలూపాడు. ఆమె జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి బలంగా లాగుతూ లేపి నిలబెట్టాడు. అంకుల్ నన్ను క్షమించు! వేడుకొందామె.

అతడు మళ్ళీ అడ్డంగా తలూపి గొంతు పట్టుకున్నాడు. ఆమె ఉక్కిరి బిక్కిరవుతూ, బిగుసుకొంటూన్న అతని పట్టుకి కళ్ళు తేలవేసింది.

"నన్ను.... నన్ను చంపకు అంకుల్....!!"

"నువ్వంతా చెడగొట్టావు, హరాంజాదీ!" అరిచాడతను రెచ్చిపోతూ, "నా సింగపూర్ ప్రోగ్రాం నాశనం చేశావు! ఈ ముదనష్టపు బ్రతుకుతో అలసి, విసిగి వేసారిపోయాను. పిడికెడు విశ్రాంతి కోసం మొహం వాచివున్నాను! అదిప్పుడు—ఇన్నాళ్ళకి అనుభవిస్తానని ఆశపడ్డాను. ఆరాటపడ్డాను. అర్రులు చాచాను! ఎంత నమ్మకంతో! మిమ్మల్ని ఎంత నమ్ముకునీ! అంతా గల్లంతుచేశావు ఈ చివరి క్షణాల్లో, డర్టీ బిచ్! పొరపాటుకి క్షమాపణ వుండదని ముందే హెచ్చరించాను— అవునా? ఇది నువ్వు కోరి తెచ్చుకున్న చావు.... చచ్చిపో!"

సైరస్ ఆమె గొంతు వదిలి, తలపట్టి గోడకేసి కొట్టాడు. ఆమె ఉక్కిరిబిక్కిరై పిడికిళ్ళతో అతని ఛాతీ మీద బాదుతోంది. పెనుగులాడుతోంది. గింజుకుంటోంది. సైరస్ ఇంకా కొడుతూనే వున్నాడు, ఆమె తల పగిలి రక్తం చిమ్మేవరకూ—

## 14

జయన్ కారు పిచ్చిపిచ్చిగా తోలుతూ అశాంతిగా అన్నాడు. "డామిట్, ఎక్కడని వెతుకుతాం? వెళ్ళి కనీసం అరగంటయింది—ఈపాటికి కొన్ని మైళ్ళు దాటేసి వుంటుంది—"

"భాయ్, ఒకవేళ ఆ దగ్గర్లోనే ఏ ఇంట్లోనో దాక్కుంటే....?" సేన్ సందేహం వెలిబుచ్చాడు.

"అదే ఆలోచిస్తున్నాను.... ఆ ఇళ్ళన్నీ వెతుకుతామా? రభస అవుతుంది. ఆ స్లట్ పబ్లిక్ చేసిందిదంతా!"

విక్టర్ పిడికిళ్ళు ఆవేశంతో బిగుసుకున్నాయి.

సేన్ అన్నాడు, "లాభంలేదు. ఇలా తిరిగి లాభం లేదు భాయ్. కారాపేయ్. ఇప్పుడాలోచించు....ఆమె పారిపోతుండగా వీధిలో ఎవరూ చూళ్ళేదు. ఆమె ఏ ఇంట్లోనో వెళ్ళివుంటే సంగతి తెలిసి ఎప్పుడో పేటంతా కదిలి మనల్ని పట్టుకుని చట్నీ—కైమా—హల్వా చేసి వుండేవారు. కానీ అలా జరగలేదు. మనం ఘన రూపంలోనే వున్నామింకా! కాబట్టి ఆమె ఇళ్ళల్లో దాక్కోలేదు. పారిపోయింది— దూరంగా —అతి దూరంగా—పూర్తి—"

"ఆగు, ఆగు సేన్!" జయన్ అన్నాడు కంగారుగా. "అసలామె చంటాడితో ఎందుకు పారిపోవాలి?"

సేన్ తల విదిలించాడు. "నీ అయిడియా అర్థం

కాలేదు, భాయ్."

"ఆమె పిల్లాడితో ఎందుకు పారిపోయింది?" తీవ్రంగా అన్నాడు జయన్, స్టీరింగ్ మీద గుద్దుతూ. "ఆ పిల్లాడెవరో ఆమెకి తెలుసు! మనలో ఎవరి బిడ్డో ననుకొంటే ఎందుకెత్తుకెళ్తుంది? ఆ రిస్క్ తీసుకోదు. వట్టి చేతులతోనే పారిపోతుంది! ఆ బిడ్డ ఎవరిదో ఆమెకు తెలుసు! గుర్తుపట్టింది. దినకర్‌తో అన్నేళ్ళ పరిచయంలో అతని కొలీగ్స్ గురించి తెలుసుకోకుండా — తెలియకుండా వుంటుందా? ఆలోచించు సేన్! అది అరవింద్ బిడ్డ అని ఆమెకి తెలుసు. అందుకే ఆ బుడ్డి రాస్కెల్‌తో పారిపోయింది!"

సేన్ ఉలిక్కిపడ్డాడు. "అవును భాయ్ సమజ్ గయా!"

"లెటజ్ మూవ్! మనం అరవింద్ ఇంటికి పోవాలి. ఆమె అక్కడికి రావచ్చు!"

"గుడ్ అయిడియా! మరి విక్కీ ఎందుకు?"

"విక్కీ వద్దు. విక్కీ నువ్వెళ్ళిపో!"

విక్టర్ కోడిలా చూశాడు, "ఎక్కడికి బాస్?"

"అంకుల్ దగ్గరికి. వెళ్ళి సంగతి చెప్పు. మేం ఏ విషయం ఫోన్ చేస్తాం. ఈ పనికి ముగ్గురనవసరం. మంది ఎక్కువైతే ముసలకం ఎక్కువవుతుంది—"

విక్టర్ సంతోషంగా దిగిపోయాడు. కారెక్కినప్పట్నించీ అతడికి ఒకటే అరాటంగా వుంది... షబ్నమ్ గురించి. ఏదో కీడు శంకిస్తోంది మనసు. ఏదో జరగరానిది జరిగిందనిపిస్తోంది.... ఘోరమైనదీ, దారుణమైనదీ....

అంకుల్ తానొక్కడే దరియాగంజ్ ఇంటికి పోతున్నట్లు అర్థం వచ్చేలా ఏకవచనం ఉపయోగించాడు—

ఎందుకలా మాట్లాడాడు? పబ్బుమ్ని తీసికెళ్ళడా? ఇదే అనుమానం విక్టర్ని పీకుతోంది—పబ్బుమ్ని అంకుల్ ఏం చేస్తాడు?

ఆరాటం ఎక్కువవుతోంటే అతను టాక్సీలో వేగంగా కొత్త ఇంటికి చేరుకున్నాడు—ఈ ఎస్సైన్మెంట్ కోసం ఎన్నుకున్న ఇంటికి.

కానీ వీధి మొదట్లో అతనికి కన్పించిన దృశ్యం గుండా గేలా చేసింది. ఒక్క క్షణం తిరిగి టాక్సీ ఎక్కి పారి పోవాలనుకున్నాడు. కాని అందుకు వ్యతిరేకంగా ముందుకు సాగాడు, కళ్ళార్పకుండా చూస్తూ. కర్ఫ్యూ విధించినట్లు వీధి నిర్జనంగా, నిశ్శబ్దంగా వుంది. ఒక్క ఆ ఇంటిముందు మాత్రం హడావిడిగా వుంది—

నీడల్లో నక్కుతూ అతి జాగ్రత్తగా సమీపిస్తున్న వాడల్లా విక్టర్ తక్కున ఆగి అపాయం గుర్తించాడు. అప్పుడు వెనుదిరిగి వేగంగా, నిశ్శబ్దంగా వెనుక వీధిలోకి పరుగుతీశాడు.

భవనాల నెక్కడంలో సైరస్ చేత శభాష్ అన్పించుకున్న అతనికి ఒక మామూలు డాబా ఇల్లు ఎక్కడం కష్టం కాలేదు. ఇప్పుడతను సందడిగా వున్న ఆ ఇంటికి రెండిళ్ళవతల ఇంటి డాబామీద, పిట్టగోడ వెనుక నక్కి నిల్చున్నాడు.

ఇప్పుడంతా దగ్గరగా, స్పష్టంగా అగుపిస్తోంది.... ఒక పోలీస్ కారు, వ్యాను, అంబులెన్స్, హడావుడిగా వున్న పోలీసులు....అతడి వొళ్ళు చెమటపట్టేసి సన్నగా కంపిస్తోంది—నోట్లోంచి విచిత్రంగా శబ్దాలు వస్తున్నాయి, ఎంత ప్రయత్నించినా ఆగకుండా. అలాగే నక్కలా కాచుకున్నాడు.

ఇంతలో ఆ ఇంట్లోంచి ఒక స్ట్రెచర్ బయటకొచ్చింది. విక్టర్ అమాంతంగా ముందుకి వంగాడు.

అంబులెన్స్ వైపుకు నిశ్శబ్దంగా సాగిపోతున్న స్ట్రెచర్‌లో దృశ్యం అతని నెత్తిమీద పిడుగులు కురిపించింది! అతని కళ్ళముందు ప్రపంచం తునాతునకలైంది!

రక్తంలో ఎర్రగా మెరుస్తూ ముఖం మాత్రమే కన్పిస్తున్న షబ్నమ్ దేహం సూటిగా అంబులెన్స్‌లోకి వెళ్ళిపోయింది.

కానీ విక్టర్ మనోఫలకం మీద మాత్రం ఆమె వదనం అలాగే శాశ్వత ముద్ర వేసుకుంది. అతని కళ్ళముందు ప్రపంచమింకా బ్రద్దలవుతూనే వుంది....అగ్నిపర్వతాలు ప్రేలుతున్నాయి.. జ్వాలలు లేస్తున్నాయి....అందులో అందులో దూకి ఆమెతో పాటుగా వెళ్ళిపోవాలనుకున్నాడు. అక్కడైనా తానామె అనుగ్రహం సంపాదించడా అని ఆశపడ్డాడు. కానీ అతను అనుపు చేసుకున్నాడు. తను చేయవల్సింది మరొకటి వుంది! అప్పుడే షబ్నమ్ అనుగ్రహిస్తుంది.

అతని ముఖమంతా చెమటలు కారుతూ, కళ్ళలో క్రోధం వికృతంగా మెరిసింది. ఒక్కక్షణం పాటునోసారి తడుముకుని అతను ధైర్యం పుంజుకొని వెనక్కి అడుగు వేశాడు. తెగించి మరికొన్ని అడుగులువేసి, తర్వాత తేలిగ్గా సునాయాసంగా నడిచి చేరుకున్నాడు—దరియాగంజ్ ఇంటికి.

గుమ్మం తలుపు తీసేవుంది. అలికిడి-గాకుండా పిల్లిలా నడిచాడు లోనికి. వెలుతురు వస్తోన్న తలుపు దగ్గరాగి, ఓరగా వేసివున్న డెక్కల్లోంచి లోనికి చూశాడు. లోపల చడీ చప్పుడూ లేదు.

"సైరన్!"

"ఏవరది?" లోపలి గొంతు పలికింది గాభరాగా.

విక్టర్ వికృతంగా నవ్వుతుంటూ నడుములోంచి రివాల్వర్ తీశాడు. దాన్నోసారి చూసుకొని, తలుపు తోసి, బుసకొడుతూ అడుగేశాడు గదిలోకి.

## 15

"అంతే, రామన్. కథ ముగిసింది," అన్నాడు ఆత్మారాం, సిగరెట్ నలిపి పారేస్తూ.

బాగా చీకటి పడింది.... గార్డెన్‌లో జనం పల్చబడ్డారు. కోలాహాలం తగ్గి ప్రశాంతంగా వుంది వాతావరణం.... ఇంకా స్పెపట్లో గార్డెన్ సెక్షన్ మూసేసేలా వున్నారు.

తేరుకొని ఆత్మారాంని చూశాను. అతను లేవడానికి సిద్ధమవుతూ, "మరి నా ఫీజు...." అన్నాడు చెయ్యి జాపి.

"కథ అప్పుడే పూర్తి కాలేదు, ఆత్మారాం" గుర్తు చేశాను.

"పూర్తి కాలేదా?"

"కాలేదు, నువ్వు మర్చిపోయావు."

"మర్చిపోయానా?"

"అవును ఇంకా చెప్పాలి. జూలీ ఏమైందో జయన్, సేన్ లేం చేశారో...."

"ఆగాగు! అవి నీ డౌట్స్! నేను కథ పూర్తి చెయ్యకపోడం కాదు."

"సరే డౌట్స్. మరి వాటిని తీర్చాలా?"

"ఓ.కే, తీరుస్తాను. కానీ ముందు నాకు ఫీజు ఇవ్వు."

"దానికెందుకంత కంగారు? నన్నపార్థం చేసుకుం

టున్నావు. ఇవ్వకుండా పారిపోతాననుకొన్నావా?"

"నువ్వేం అనుకొన్నా పట్టించుకోను. డబ్బు దగ్గర నాకు మొహమాటంలేదు—వద్దన్నారు పెద్దలు."

అసహనంగా చూశాను. "సరే, తీసుకో కానీ నా దగ్గర 50 నోటులేదు. పదులున్నాయి."

"నెవర్ మైండ్, అవే ఇవ్వు. పదులుంటే వదులుగా వుంటాయి దేనికైనా."

లెక్కబెట్టి ఇచ్చాను. "టీ ఒకటి మిస్ అయినట్టు డౌటు!" అన్నాడు మళ్ళీ.

చప్పట్లు కొట్టి వెయిటర్‌ని పిల్చాను. చెప్పకుండానే టీ తెచ్చాడు.

"వెరీ గుడ్, అయితే విను!" ప్రారంభించాడు టీ చప్పరిస్తూ ఆత్మారాం, "జూలీ ఆ ఇంటినుంచి పారిపోయి బాబునెత్తుకొని తిన్నగా టాక్సీ ఎక్కి ఉదయం తను వెళ్ళిన హెడ్‌క్వార్టర్స్‌కి వెళ్ళిపోయింది....

"ఉదయం ఆమెని ఇంటరాగేట్ చేసిన అధికారులు ఆమెని గుర్తుపట్టి, భుజాన పిల్లాడ్నిచూసి ఉద్రేకపడి, టాక్సీ ఫేర్ స్వయంగా చెల్లించి—హుటాహుటీన ఆమెని కమీషనర్ ఎదుట హాజరు పర్చారు.

"కమీషనర్‌తో ఆమె గబగబా తను చేసింది, తనకు జరిగింది చెప్పేసింది. కాని కమీషన్నర్‌కి - అక్కడెవరికీ ఆ బాబు అరవింద్ బిడ్డగా నిర్ధారణ కాలేదు. కమ్మీషనర్ గారు వెంటనే డాక్టర్ షిండేకి ఫోన్ చేసి, ఇన్స్పెక్టర్‌కి సెరస్ ఇంటిమీద రెయిడింగ్‌కి పురమాయించి, జూలీని తీసుకొని బిడ్డతో డాక్టర్ ఇంటికి బయల్దేరాడు.

"డాక్టర్ వినయ్‌బాబుని గుర్తుపట్టి చలించిపోయాడు,

అతడే అరవింద్ బిడ్డ అని ధృవపర్చాడు. వెంటనే కమీషనర్ అరవింద్ దగ్గరకు వెళ్ళడానికి సిద్ధమయ్యాడు.

సైరస్ స్థావరాన్ని ముట్టడిచేయడానికి వెళ్ళిన పోలీసులకి అక్కడ షబ్నమ్ శవం తలపగిలి రక్తం మడుగులో భయంకరంగా కన్పించింది. ఇంట్లో ఇంకెవరూ లేరు. ఇల్లంతా ఖాళీగా వుంది. ఇల్లు సోదా జరిపి, శవాన్ని అంబులెన్స్‌లో తరలిస్తున్నప్పుడు రేడియో మెసేజ్ అందింది—దరియాగంజ్‌లోని ఒక ఇంట్లో హత్య జరిగిందని.

"శరవేగంతో అక్కడ వెళ్ళి వాలారు. ఆ ఇంట్లో ఒక గదిలో సైరస్ చచ్చిపడి వున్నాడు కుర్చీలో. నుదుటిమీద చక్కని గుండ్రటి రంధ్రం కుంకుమ అద్దినట్లుంది.... అతని కళ్ళు తెరిచివున్నాయి.... మెడ ముందుకు వాలిపోయి వుంది.

"మిస్టర్ రామన్, రివాల్వర్‌తో ఆ గదిలో కెళ్ళిన విక్టర్, ఒకే ఒక్క గుండుతో సైరస్ ప్రాణాలెగరగొట్టాడు. మాటామంతీలేదు. ఆ ప్రేలుడికి ఆ పేటంతా కదిలి ఇంటిని చుట్టుముట్టింది, హాహాకారాలు చేస్తూ. కానీ విక్టర్‌కి పారిపోవాలన్పించలేదు. షబ్నమ్ లేనిది అతనికి ప్రపంచం లేదు. రివాల్వర్ తల కాన్చుకుని వెంటనే ట్రిగ్గర్ లాగేసుకున్నాడు.

"మిస్టర్ రామన్, అలా జరగబోతున్నదని సైరస్ వూహించలేదు. చావు చెప్పిరాదు. కళ్ళు తెలియని ఆవేశంతో తను చేస్తున్న పొరపాటుని గుర్తించలేదు. షబ్నమ్ మీద కసి తీర్చుకొని తన చావే కోరితెచ్చుకున్నాడు. అన్నేళ్ళ సావాసంలో ఆమెమీద విక్టర్ ఫీలింగ్స్‌ని గమనించక పోవడం దురదృష్టం. విధి వక్రించ

డానికెంత సేపు? వ్యక్తి శక్తి ఓటమి ఎంతలో! ఒక్క క్షణం చాలు!

తన పట్ల అచంచల విశ్వాసంగల సైరస్, ఆ ఒక్క రాత్రి అపజయం తథ్యమన్న నిజాన్ని జూలీ పారిపోయినప్పుడే తెలుసుకున్నా మూర్ఖత్వంతో పట్టించుకోలేదు— లేకపోతే ప్రాణాలతోనైనా మిగిలివుండేవాడు. చాలా విచారకరం. వెరీ సాడ్!"

"మరి జయన్, సేన్ లేమయ్యారు?" అడిగాను.

నవ్వాడతను. "వాళ్ళిద్దరు పాపం స్టోలెన్ ప్రాపర్టీ కలెక్టు చేసుకుందామని అరవింద్ ఇంటికి బయల్దేరారు— జూలీ అక్కడే వెళ్ళి వుంటుందన్న అంచనాతో. ఎంతో నమ్మకంగా, చాలా ఉత్సాహంతో వెళ్ళారు. అక్కడ ఉదయంనించీ పడిగాపులు కాస్తున్న మఫ్టీ పోలీసులు వాళ్ళనలాగే నిరభ్యంతరంగా రానిచ్చారు. కానీ ఎప్పుడైతే ఇంట్లో కాలూన బోయారో, సరిగ్గా అప్పుడే వాళ్ళ నీడల్లాగే కదిలి వెళ్ళి వెనుకనుంచి మెడలు పుచ్చుకున్నారు."

"అయితే అరవింద్? అతను బాబు నెప్పుడు చూసుకున్నాడు?"

"అప్పుడే!" అన్నాడు ఆత్మారాం లేస్తూ. "ఇక పద మిస్టర్ రా—మోహన్. ఇంకా సందేహాలేవనుకొంటాను. సందేహాజీవులంటే నాకు విసుగు. సాధ్యమైనంతవరకు అవి రాకుండా నే ప్రయత్నిస్తుంటాను.... అయినా వస్తూనే వుంటాయి...."

నేను కూడా లేచి అతనితో పాటు నడిచాను.

—: ఐ పో యిం ది :—

# నిప్పులు కురిసిన రాత్రి

ఎమ్.వి.వి. సత్యనారాయణ

"కాఫీ తయారైందా?" అడిగాడు రంగారావు.

జయంతి పలకలేదు. రంగారావు తెల్ల కోటు తొడుక్కుంటూ వంటింట్లోకి నడిచాడు. జయంతి కుంపటి ముందు కూర్చుంది. ముందుకు ఒంగి కుంపటిని వూదుతోంది. వంటింట్లో పొగ పలచగా అలుముకుని వుంది. రంగారావు వంగి జయంతి భుజాలమీద చేతులు వేశాడు.

"విసనకర్ర అందుకోండి. పాడు బొగ్గులు....రాత్రి మంచు పడి తడిసిపోయాయి" అంది జయంతి.

రంగారావు చుట్టూ చూచి కూరగాయల బుట్టకి సమీపంలో వున్న విసనకర్ర అందుకున్నాడు. జయంతి కుంపటి విసరసాగింది.

"సరే, జయా! నేను స్టేషనుకి వెళ్ళి మరలవస్తాను. లేకపోతే హెల్పర్ ను పంపిస్తాను" అన్నాడు రంగారావు.

జయంతి అతడివంక చూచింది. ఆమె కళ్ళు పొగ తగిలి ఎర్రగా వున్నాయి. ఆమె కళ్ళతడి అతడిని

కదిలించింది.

"జయా! రాత్రికి కిరసనాయులు తెప్పించుతాను" ప్రేమగా అన్నాడు రంగారావు.

"కాఫీ అయిపోతుంది. పదినిముషాలుండండి!" అంది జయంతి.

ఘంటి మండసాగింది.

"ఆల్ రైట్!" రంగారావు బయటికి నడిచాడు. స్టూలుమీద కూర్చుండి షూ తొడుక్కున్నాడు. ఉన్నట్టుండి చెవులు రిక్కించి వినసాగాడు.

దూరంగా రైలు కూత వినిపిస్తోంది. చకచక నడుచుకుంటూ వాకిట్లోకి వచ్చి నిలబడ్డాడు. రైల్వేస్టేషను ప్లాట్ ఫాంమీద హెల్పర్ నిలబడి వున్నాడు. అతడి చేతిలో ఆకుపచ్చ జెండా ఎగురుతోంది. హెల్పర్ వెనక రేకు షెడ్డు.

హెల్పర్ తలత్రిప్పి రంగారావు వైపు చూశాడు.

"గూడ్సు వస్తోంది సార్! వా త్తేరునుండి!" అన్నాడు హెల్పర్.

రంగారావు తలూపి తిరిగి క్వార్టర్ లోపలికి వెళ్లాడు. డబ్బా తెరిచి బిస్కట్సు తీశాడు. కుర్చీలో కూలబడి మెల్లగా బిస్కట్టును కొరకసాగాడు. అయిదు నిమిషాలలో జయంతి కాఫీ గ్లాసుతో ఆ గదిలోకి వచ్చింది.

బయటనుండి గూడ్సు ట్రయిను వెళ్తోన్న డబడబ చప్పుడు వినిపిస్తోంది. టకటకా వాగనులు క్వార్టర్సును దాటుతున్నాయి.

రంగారావు కాఫీ త్రాగి బయటపడ్డాడు. చకచక స్టేషను షెడ్డువైపు నడవసాగాడు. ఎంత కాలంనుండి తాను ఇక్కడే ఈ పరిసరాలను అంటిపెట్టుకుని వుంటు

న్నాడో తనకే తెలియదు. మార్పులేని జీవితం. అదే రేకు షెడ్డు ఆఫీసు. ఆ షెడ్డుమీద అదే అక్షరాలు....జగ్గయ్యపాలెం. తాను ఎన్నిమార్లు చదివినా ఆ అక్షరాల్లో వున్న ఒంపులలో ఒక్క ఒంపూ మారదు.

జయంతీ తాను కాపురం పెట్టి నాలుగేళ్ళవుతుంది. తనకి డిగ్రీ పూర్తికాగానే సర్వీస్ కమీషన్ సెలక్షన్ వచ్చింది. అప్పట్నించీ తనని ఇదే స్టేషనులో ఎ.ఎస్.ఎం. (ఆసిసెంట్ స్టేషను మాస్టర్)గా ఉద్యోగం వేశారు. టిక్కట్లు అమ్మకం దగ్గరనుండి తానే. తనతో బాటు వేసిన క్లర్కు సెలవు పెట్టాడు.

చివరకు జెండా చూపించడం తానే చెయ్యాలి. తనకో హెల్పర్ ని యిచ్చారు.

లెవెల్ క్రాసింగ్ దగ్గర ఒక వాచ్ మాన్. ఈ నిర్జనమైన పరిసరాల్లో ముగ్గురే ముగ్గురు వుద్యోగులు. రాత్రీ పగలూ మొత్తం మీద మూడు పాపింజర్లు ఆగుతాయి. పట్టుమని పది టిక్కెట్లు కూడా అమ్ముడుకావు.

ఆలోచనలలో రంగారావు స్టేషను షెడ్డును సమీపించాడు.

"పాసింజరు వస్తోందా?" అడిగాడు రంగారావు.

"ఇంకా లేదండి" అన్నాడు హెల్పరు పచ్చ జెండాను కర్రకి చుడుతూ.

రంగారావు షెడ్డులోపలికి వెళ్ళాడు. బుకింగ్ కౌంటరు ముందు కూర్చున్నాడు. బుకింగ్ కిటికీలోంచి, "గంట కొట్టెయ్యి!" అన్నాడు రంగారావు.

గంట గణగణ లాడింది.

అంత సేపూ ప్లాట్ ఫాంకి అవతలా యివతలా పచార్లు చేస్తున్నవాళ్ళు బుకింగ్ కిటికీని సమీపించసాగారు.

'పరుగూ, వేగమూ లేని జీవితాలు!' గొణుక్కున్నాడు రంగారావు.

టిక్కెట్లు అమ్ముతున్నాడన్న మాటేగానీ, తన ఆలోచనలు వడీ జవా వున్న కాలేజీ రోజులవైపు పరుగులు తీస్తున్నాయి. తాను కాలేజీ మొత్తానికి వాలీబాల్ ఛాంపియను. తన ఆట చూచే జయంతి తన్ను ప్రేమించింది. ఆమెకీ వెనకాముందూ ఎవరూ లేరు. తన పినతండ్రి యింట అనాధ ప్రేతలాగా బతికే జయంతి తనవెంట జీవితంలోకి నడిచిరావడానికి ఎవరికీ అభ్యంతరం లేకపోయింది.

అయితే తన వైవాహిక జీవితానికి సమగ్రతలేదు. జయంతి కడుపున యింత నలుసు పడుతుందని ఎదురు చూస్తోంది. ఆమెకు గర్భాశయం దోషం.

రంగారావు ఉలిక్కిపడ్డాడు.

అతడి ఆలోచనల దారాలు పట్టుకుని ఎవరో లాగుతోనట్టు ఫీలయ్యాడు.

పీటర ! దుర్మార్గుడు!

పీటరు వల్లనే తన జయంతికి ఆ రోగం అంటుకున్నది. గర్భిణి అయే అర్హత కోల్పోయింది.

రంగారావు బుకింగ్‌లోంచి బయటకు చూశాడు. బయట ఎవరో భారీ మనిషి నిలబడివున్నాడు.

"ఎక్స్‌ప్రెస్ ఎన్ని గంటలకు?" అతడి గొంతు కర్కశంగా వుంది.

రంగారావు నుదురు చిట్లించాడు. ప్రభుత్వోద్యోగితో పని చేయించుకునేపాటి సంస్కారం ఈ పుణ్యభూమిలో యొక్కువమందికి తెలియదు.

"ఈసుకోస్టు వెళ్ళిపోయి గంటయింది."

"నేను అడిగేది సింహాద్రి!"

"ఇంకా గంటకి గానీ రాదు!"

"ఈలోపులో పాసింజరు వస్తుందా?"

దూరంగా ఎక్కడో పాలపిట్ట అరుస్తోంది.

"అవును." అన్నాడు రంగారావు.

"వాల్తేరు స్టేషనుకి వెళితే సింహాద్రి అందుతుందా?" అడిగాడు అతడు.

"అందవచ్చు."

"అదేమిటి! అందకా పోవచ్చునన్న మాట!"

"కావచ్చును." చిరాకుగా అన్నాడు రంగారావు.

"ఏం?"

"మీరు వాల్తేరుస్టేషన్‌కి వెళ్ళగలిగే పద్ధతి మీదా, చేరుకోగలిగే సమయం మీదా ఆధారపడి వుంటుంది."

"వాల్తేరు స్టేషన్ దూరమా?"

"మిస్టర్ మీకేం కావాలి?"

"ఎంక్వయిరీ!"

"ఎక్కడినుండో బయలుదేరే బళ్ళ గురించి అడగడం 'ఎంక్వయిరీ' అనిపించుకోదు."

"వాల్తేరు ఎక్కడో లేదు. పది కిలోమీటర్లు!"

రంగారావు బుకింగ్ కిటికీలోంచి వొంగి చూశాడు.

విశాలమైన భుజాలు, పెద్దమొహం, గుబురుగా పెరిగిన గడ్డం, మీసాలూ, వొంకీలు తిరిగి నిర్లక్ష్యంగా వొది లేసిన జుట్టూ, బలిష్టమైన ఛాతీ....

"ఆల్ రైట్! ఇప్పుడే రోడ్డుమీదకు వెళ్ళండి. సిటీ బస్సు అందుకుంటే పావుగంటలో స్టేషన్ ముందు దిగుతారు."

"ఆ మాట యిందాకనే ఏడవ్వలసింది!"

రంగారావు వులిక్కిపడ్డాడు. చకచక నడుచుకుంటూ షెడ్డులోంచి బయటికి వచ్చాడు.

ఆ వ్యక్తి అప్పటికే ప్లాట్ ఫాం చివరకి చేరుకున్నాడు. క్వార్టర్స్ వెనక వున్న కట్టను దాటసాగాడు.

## 2

"ఎవరికోసం ఎదురు చూస్తున్నారు?"

రంగారావు తల త్రిప్పి చూశాడు. హెల్పర్! అతడి చేతిలో కూరగాయల సంచి వుంది.

"ఎవరికోసమూ లేదు!" రంగారావు వెనక్కి తిరిగి ప్లాట్ ఫాంమీదకు నడుచుకుంటూ వెళ్ళాడు. అక్కడక్కడ ప్రయాణీకులు నిలబడి వున్నారు.

"బండి ఎన్ని గంటలకు వస్తుంది మాష్టారూ!" ఎవరో అడుగుతున్నారు.

రంగారావు సమాధానం చెప్పి కట్టవైపు వెనక్కి తిరిగి చూశాడు. తల త్రిప్పి ప్లాట్ ఫాం చివరకు వెళ్ళాడు. దూరంగా ఓవర్ బ్రిడ్జి దాటి ఎత్తులో చిన్న సైజు కొండ దానిమీద సన్నటి చెట్లు, రైలుపట్టాలు వున్నాయి. రైలు పట్టాలమీద ట్రాలీ వస్తోంది. కిరండల్ కి బొగ్గు రవాణా కోసం కట్టిన రైలుపట్టాలు.

రంగారావు కళ్ళు పెద్దవయ్యాయి. రైలుపట్టాల ప్రక్క ఎవరో నడుస్తున్నారు. ఇందాక కట్టవ దాటుతోన్న భారీవిగ్రహం! అతడే! అతడు కొండదిగి మెల్లగా రైలు పట్టాలవైపు నడుస్తూ వస్తున్నాడు.

రంగారావు చకచకా అతడు నడుస్తూ వస్తున్నదిశగా వెళ్ళాడు.

భారీవ్యక్తి రంగారావును సమీపించాడు. అతడు తన ఎర్రటికళ్ళతో నిర్లక్ష్యంగా రంగారావును చూసు

కుంటూ షెడ్డువేపు నడిచాడు. రంగారావు చురుకుగా అతడిని సమీపించాడు.

షెడ్డులోంచి గణగణమని ఫోన్ మ్రోగింది.

రంగారావు షెడ్డులోకి ప్రవేశించి ఫోన్ అందుకున్నాడు.

ఫోన్‌లో మాట్లాడి బయటకు వచ్చాడు. భారీవ్యక్తి దీక్షగా తనవంకే చూస్తూ కనిపించాడు. రంగారావుకు ఏం చేయాలో పాలుపోలేదు. ప్లాట్‌ఫాం అంచువరకూ నడిచి తల పంకించి తన క్వార్టరువైపు అడుగులేశాడు. ప్రక్క క్వార్టరుకి తాళం పెట్టివుంది.

జయంతి గుమ్మంలో నిలబడి వుంది. ఆమె కళ్ళలో ఆశ్చర్యమూ భయమూ పెనవేసుకుని కనిపించాయి.

"మీరూ చూశారా వాడిని?"

"ఎవరిని?"

"పీటర్!"

రంగారావు షాక్ తిన్నట్టు చూశాడు.

"నువ్వే కరెక్టు! త్వరగానే గుర్తించావు. అవును వాడే!"

జయంతి రంగారావును సమీపించి అతడి చెయ్యి పట్టుకున్నది. ఆమె నరాలు వొణుకుతున్నాయి.

"జయా! నీకు వచ్చిన ప్రమాదం ఏం లేదు" అన్నాడు రంగారావు.

"ఏమండీ? వాడు పోలీసుల చేతులలో వుండికూడా ఏమన్నాడో గుర్తుందా?"

"ఆఁ! నన్ను చంపుతానంటాడు.... రాస్కెల్!"

"ఇందాక క్వార్టర్సు ప్రక్కనుండి వెళుతూ లోపలికి చూశాడు."

"నన్ను గుర్తు పట్టాడా?"

"వాడు మన కోసమే వచ్చాడు."

రంగారావు తలూపాడు.

"వాడు అప్పుడే జైలులోంచి ఎలా బయట పడ్డాడు?"

"తప్పించుకుని పారిపోయి వచ్చాడేమో!"

"ఎందుకు?"

"కొంపతీసి మనమీద కక్ష తీర్చుకోడానికేమో—నువ్వన్నట్టు—" రంగారావు గొంతు తడారిపోయింది,

"నా మూలంగా మీ జీవితం ప్రమాదానికి బలవుతోంది!"

"జయా! అంత మాటనక. మనం ఇద్దరమూ కలసి జీవించాలనుకున్నాం. పెళ్ళి చేసుకున్నాం. దుర్మార్గుడు మన జీవితాలతో ఆటలాడుతున్నాడు."

జయంతి నిట్టూర్చింది.

దూరంగా పాసింజరు రైలు వస్తోన్న చప్పుడూ, ఆ వెనకనే బొగ్గుఇంజను కూతా వినిపించాయి.

"నువు క్వార్టరుకి లోపల గడియవేసుకుని వుండు. నేను ఈ బండిని చూసుకుని మరల వస్తాను. ఏం ఫరవా లేదు." జయంతిని వదిలిపెట్టాడు. మెల్లగా స్టేషన్ షెడ్డువైపు కదిలాడు. ప్లాట్ ఫాం మీదకు చూశాడు రంగారావు.

ప్లాట్ ఫాంమీద నిలబడి పీటర్ క్వార్టరు వైపు చూస్తున్నాడు.

## 3

చుట్టూ చీకటి. క్వార్టరు వెనుక వున్న కట్టవలోంచి అతడు మెల్లగా నడుచుకుంటూ వచ్చాడు. చీకట్లో కళ్ళు

చించుకు చూస్తున్నాడు. స్టేషన్ షెడ్డులో ఒక దీపమూ ప్లాట్ ఫాం మీద ఒక దీపమూ వెలుగుతున్నాయి. కటిక చీకటిని తరమడం వాటివలన అసాధ్యమవుతోంది.

అతడు మెల్లగా నవ్వుకున్నాడు. క్వార్టరు ముందుకు వచ్చి నిలబడ్డాడు. క్వార్టరుకి తలుపు దగ్గరగా వేసివుంది. కిటికీలోంచి వెలుగు కనిపిస్తోంది.

ఉన్నట్టుండి చటుక్కున వెలుపలి దీపం వెలిగింది. క్వార్టరు ముందు వాకిలి ప్రకాశవంతమయింది. అతడు వులిక్కిపడి చీకట్లోకి తప్పుకున్నాడు. చెవులు రిక్కించి వినసాగాడు. క్వార్టరులోంచి మాటలు వినిపిస్తున్నాయి. మాటలు వినిపిస్తూనే తలుపులు తెరుచుకున్నాయి.

రంగారావు గుమ్మంలో నిలబడ్డాడు. అతడికి కాస్త వెనకగా జయంతి నిలబడి వుంది. వాళ్ళిద్దరి నీడలూ వాకిట్లో తేటగా పడుతున్నాయి.

"ఎక్స్ప్రెస్ వచ్చే టయిమయింది! నేను తిరిగివచ్చి పిలిచేవరకూ తలుపుతీయక." అన్నాడు రంగారావు.

"ఇప్పుడు వెళ్ళకపోతే ఏం?"

"లెవెల్ క్రాసింగ్ గేటు మూసివుందో లేదో చూడాలి."

"హెల్పర్ వున్నాడు కదా!"

"హెల్పర్ కీ వాచ్ మన్ కీ వదిలిపెడితేనే రైలు ప్రమాదాలు జరిగేది."

"మీ చాదస్తం!"

"ఆల్ రైట్ అలాగే అనుకో...."

"నాకు ఎందుకో భయంగా వుంది."

"ఏం?"

"ఫిటర్ మరల వస్తేనో...."

"ఉదయం పాసింజరు ఎక్కి వెళ్ళిపోయాడు కదా, దరిద్రుడు—టికెట్ తీయలేదు."

జయంతి మెల్లగా నవ్వింది. "మీ పాసింజరు రైళ్ళలో సగంమందికి టిక్కెట్లుండవు. సగంమందికి సీట్లుండవు. రైట్లు అసలే వుండవు."

రంగారావు మెల్లగా నవ్వి, "వస్తాను తలుపు వేసుకో. జాగ్రత్త....అరగంటలో వస్తాను." అంటూ వాకిట్లోకి దిగాడు.

ఆ వెనుకనే జయంతి తలుపు మూసుకున్నది.

రంగారావు చకచక ముందుకుసాగాడు. ప్లాట్‌ఫాం మీద అడుగుపెట్టాడు. వెనుకప్రక్క ఎవరో కదిలినట్టవుతోంది. ఠక్కగా వెనక్కి తిరిగిచూశాడు. వెనక ఎవరూ లేరు. రంగారావు మెల్లగా నడవసాగాడు. ఎక్కడో ఎండుపుల్ల పళక్‌మన్నది. ఎండుటాకులు కరకర లాడాయి.

కొంపతీసి పీటర్ మరల వచ్చాడా?

పాసింజరు ఎక్కి వెళ్ళినవాడు తిరిగి ఎలా వచ్చాడు? అతడు పాసింజరుమీద వెళ్ళిపోవడం కేవలం నటనా?

వెళ్ళినట్లే వెళ్ళి తిరిగివచ్చి ఈ చీకట్లో....

రంగారావుకు గుండెలు గుబగుబలాడాయి. ఎందుకు వస్తాడు? పీటర్ తనమీద కక్ష గట్టాడా? నాలుగేళ్ళ క్రితం నాటి కక్ష ఇంకా అతడి మనసులో సజీవంగా వుంటుందా? వుండివుంటే....తనని చంపుతాడా? తాను ఈ చీకట్లో ఒంటిగా బయలుదేరి తప్పు చేశాడా?

ఎక్కడో కంకరరాళ్లు కరకరలాడాయి.

రంగారావుకు తన తలలో శూన్యం ఏర్పడినట్లు తోచసాగింది. తాను హెల్పరును ఎటో పంపడం తప్పయింది.

అతడే మొదటి ఆట సినిమాకి వెళ్ళి వస్తానన్నాడు. సినిమాకి వెళ్ళాడో, ఎక్కడికి వెళ్లాడో..వాడికి వ్యసనా లున్నట్టు లెవెల్ క్రాసింగ్ గేటుకీపరు చెబుతూంటాడు.

రంగారావు తన కాళ్ళలోకి శక్తిని తెచ్చుకుని పరుగు పెట్టాడు. ప్లాట్ ఫాంకి ఆ చివర ముప్పయి గజాల్లో గేటు వుంది. ఆ గేటులోంచే రహదారి రైల్వేలైనుకు అడ్డంగా ప్రయాణిస్తోంది. గేటుకీపరు తాగుబోతు. వాడి ఏమరు పాటుతనం వలన ఏ ప్రమాదమయినా జరిగితే..

దూరంగా ఎక్కడో డీజల్ ఇంజను కూత విని పించింది.

'బండి ముందు స్టేషను దాటుతూ వస్తోంది.' గొణు క్కున్నాడు రంగారావు. కేబిన్ ప్రక్కగా పరిగెత్తుతూ గేటును సమీపించాడు. గేటువద్ద హరికేన్ లాంతరు గుడ్డి వెలుతురును ప్రసాదిస్తోంది. గేటు మూసి వుంది.

"సింహాచలం!" అరిచాడు రంగారావు.

నిశ్శబ్దంలో ప్రతిధ్వనించి అతడి పిలుపు చీకటిలో కలిసిపోయింది. కేబిన్ లోపలికి తొంగిచూశాడు. లోపల చిన్న దీపం వెలుగుతోంది. సింహాచలం గోడకి చారగిల పడి కనిపించాడు. అతడి కళ్ళు సగం తెరిచివున్నాయి.

"సింహాచలం మరల త్రాగి నిద్దరోతున్నావా?" అరిచాడు రంగారావు. అకస్మాత్తుగా అతడి చెవులకు గాలిలో ఎవరో కదులుతోన్న శబ్దమయినట్టు వినిపించింది. రంగారావు తలత్రిప్పి చూశాడు.

అతడికి తన గుండె తెగి కిందపడినట్లు తోచింది.

గేటు దగ్గరగా దీపం వెలుతురులో ఎవరో నిలబడి వున్నారు.

"ఎవరు?" రంగారావు గొంతు జీరబోయింది.

ఆ వ్యక్తి మెల్లగా రంగారావువైపు నడిచి రాసాగాడు.

"పీటర్!" అరిచాడు రంగారావు.

ఆ వ్యక్తి పకపక నవ్వాడు. చీకట్లో ప్రేతాలు నవ్వుతోన్నట్టుగా ఫీలయ్యాడు రంగారావు.

"ఎందుకు వచ్చావు?"

"నీ ప్రాణాల కోసం."

"సింహాచలం! సింహాచలం!" రంగారావు కాబిన్ లోకి పరుగెత్తాడు. తలుపులు దగ్గరగా వేశాడు. అంతలోనే ఆ వ్యక్తి తలుపుకు మధ్యగా కాలుపెట్టాడు. అతడిని తోసుకుని లోపలికి వచ్చాడు. రంగారావు అతడిని మృత్యువును చూచినట్టు చూశాడు. అతడి చేతిలోని కత్తి తళతళలాడింది.

డీజల్ ఇంజన్ హోరు పెడుతూ గేటు దాటుతోంది.

## 4

"జయా!" పిలిచాడు బయటినుండి.

జయంతి తలుపు తీయబోయేదల్లా ఆగింది.

"జయా! త్వరగా తలుపు తీయి....పీటర్...."

జయంతి చటుక్కున గడియతీసి తలుపులు తెరిచింది. గుమ్మంలో అతడు నిలబడి వున్నాడు. అతడి గుబురు గడ్డంలోంచి కళ్లు కక్కే ఎర్రదనం ప్రతిబింబిస్తోన్నట్టుగా ముఖంమీద రక్తం! బట్టలమీద రక్తం!

జయంతి కెవ్వున అరిచింది.

అతడు పకపకా నవ్వాడు. మెల్లగా లోపలకు నడిచాడు. జయంతి స్పృహతప్పి పడిపోయేదల్లా అతడు చాపిన చేతులలోనికి ఒరిగిపోయింది. అతడు జయంతిని ఎత్తుకుని మంచంవైపు నడిచాడు. ఆమెను మంచంమీద

పడుకోబెట్టాడు. దీపం వెలుతురులో ఆమెను పరీక్షగా చూడసాగాడు.

దంతం రంగులో వున్న ఆమె శరీరం దీపం వెలుగులో మెరుస్తోంది. సన్నటి నడుమూ, యవ్వనం ఒంపులూ ఆమె శరీరానికి వింత ఆభరణాలుగా అమిరాయి. భయపడటం వలన కాబోలు ఆమె ఆయాసంగా ఒగరుస్తోంది. విశాల మైన ఆమె నేత్రాలు మూతపడి వున్నాయి. పల్చటి చెక్కిళ్ళూ, కొనదేలిన గడ్డమూ, వొంకీలు తిరిగిన జుత్తు పడుతోన్న చెంపలూ, చెవులూ, పొడవుపాటి ముక్కూ ఆమె అందానికి తళుకులద్దుతున్నాయి.

అతడు చటుక్కున వంగి ఆమెను ముద్దుపెట్టుకున్నాడు. ఆమె ఒళ్ళు నిమిరాడు. అతడిలోసి నరాలు పురులు విప్పాయి. కోరిక చెలరేగింది. పెదిమలు కొరుక్కున్నాడు. ఆమె ప్రక్కగా కూర్చున్నాడు. అతడి నరాలు పట్టుతప్పుతున్నాయి.

చటుక్కున లేచి తలుపు మూయబోయాడు. అతడి కళ్ళు పెద్దవయాయి. రేకు షెడ్డుదగ్గర వెలుగులో ఎవరో నిలబడివున్నారు. అతడు అటూ యిటూ చూచి మెల్లగా క్వార్టర్సువైపు రాసాగాడు.

అతడు పళ్ళు పటపట నూరాడు.

* * *

సింహాచలం మెల్లగా కదిలాడు. తన శరీరం కింద వెచ్చగా ప్రవహిస్తోంది. చేతితో కింద తడిమాడు. చేతికి వెచ్చగా తగిలింది. చేయి అంతా జిగురయింది. సింహాచలం చటుక్కున కళ్ళు తెరిచాడు. మగతగా చూశాడు. గదిలో దీపం వెలుగుతోంది. ఎక్కడినుండో కీచురాయి గీపెడు తోంది.

సింహాచలం వులిక్కిపడ్డాడు. కళ్ళు నలుపుకొన్నాడు. తను చూస్తోంది కలా? నిజమా? తాగిన మత్తులో ఇలా కనిపిస్తోందా? ఒక మూలగా పెద్ద చందువాపెట్టె— ఆ పెట్టెప్రక్క నేలమీద ఎవరో వెల్లికిలా పడివున్నారు. అతడి గుండెప్రాంతంలో పిడివరకూ కత్తి దిగివుంది. అతడి బట్టల నిండా రక్తం ప్రవహిస్తోంది. రక్తం ప్రవాహం కట్టింది. తనవైపు ప్రయాణిస్తోంది. ఆ రక్తమే తనని మత్తులోంచి నిద్రలేపింది. సింహాచలం గజగజ లాడాడు.

అతడు ఎవరు? ఎవరు చంపారు?

సింహాచలం ఒక్కసారిగా శక్తిని కూనితెచ్చుకుని లేచాడు.

తాను 'చావు'లను చూశాడు. కాని మరీ యింతగా యింత దగ్గరగా హత్యను చూడలేదు. గడగడలాడు తోన్న చేతులతో దీపంబుడ్డిని అందుకుని శవం మొహం దగ్గరకు తీసుకువచ్చాడు.

వెన్నులోంచి చలి పుట్టుకొచ్చింది. చటుక్కున బయటికి గెంతాడు. చేతిలోని దీపాన్ని గుమ్మంలో ఎలా పెట్టాడో తెలియదు. దెయ్యం తనని తరుముతోన్నట్టుగా పరుగెత్తాడు. ప్లాట్‌ఫాం మీద అతడి అడుగులు ప్రతి ధ్వనించి భయంకరమైన చీకటికి నేపథ్యసంగీతం చేకూర్చి పెట్టాయి.

సింహాచలం షెడ్డును సమీపించాడు. దీపం వెలుగు తోంది. వెలుగులో షెడ్డుకు తాళంపెట్టి వుండినట్లు గమ నించాడు. ఎక్కడాలేని పిచ్చి ఆవేశం సింహాచలంలో ప్రవేశించింది.

చకచక గంటను సమీపించాడు. ఇనుపకడ్డీని చేతిలోకి తీసుకున్నాడు. తాళంమీద బలంకొద్దీ కొట్టాడు.

తాళం పగిలింది. షెడ్డు తలుపు తెరిచాడు. లోపలకు దూకాడు. టెలిఫోన్ అందుకున్నాడు.

చకచక నెంబర్లు తిప్పసాగాడు.

గుమ్మం దగ్గర అలికిడయింది. చటుక్కున తల త్రిప్పి చూశాడు సింహాచలం. దీపం వెలుగులో భారీ విగ్రహం నిలబడి వుంది. ఆ ఆకారం గుమ్మందాటి సింహాచలాన్ని సమీపించింది.

“ఎవరు నువ్వు?” కీచుమన్నాడు సింహాచలం,

ఆకారం పకపక నవ్వింది. గుబురు గడ్డంలోంచి తెరలు తెరలుగా నవ్వాడు. అతడి చేతిలోని ఇనుపకడ్డీ పైకి లేచింది.

## 5

“డిసీజ్ క్రైంబ్రాంచ్ ఆఫీస్!” అన్నాడు కుమార్ ఫోన్‌లో.

“ఎవరు మాట్లాడేది?” అవతలనుండి వినిపించింది.

“ఇన్స్పెక్టర్ కుమార్!”

“హలో.... కుమార్‌జీ నమస్తే. నేను డివిజినల్ సూపర్నెంటు—సౌత్ ఈస్టర్న్ రైల్వే.”

“సహానీగారా! నమస్తే సార్!”

“నమస్తే! వాల్తేరు — విజయవాడ మార్గంలో వాల్తేరుకు పది కిలోమీటర్ల దూరంలో జగ్గయ్యపాలెం రైల్వే స్టేషనులో ఎ. ఎస్. ఎం.ని ఎవరో హత్య చేశారు. మీరు వెంటనే బయలుదేరాలని నా కోరిక. నేను హత్యాస్థలానికి వస్తున్నాను.”

“ఆల్ రైట్! వస్తున్నాను” కుమార్ రిసీవర్ పెట్టి

హుడావుడిగా లేచాడు. సార్జెంటువైపు సాభిప్రాయంగా చూశాడు.

సార్జెంటు బయిటికి వెళ్ళాడు.

ఇన్స్పెక్టర్ కుమార్ వాచీ చూసుకున్నాడు.

రాత్రి 1 గం॥ 30 ని॥

చకచక డ్రెస్ సర్దుకున్నాడు.

అరగంటలో జగ్గయ్యపాలెం రైల్వే స్టేషనుకి కొద్ది దూరంలో పోలీసువాను ఆగింది. కుమార్, అతడి సిబ్బందీ జీపు దిగారు.

కుమార్ ప్లాట్‌ఫాం మీదకు దూకాడు.

ప్లాట్‌ఫాం సందడిగా వుంది. అయిదారు పెట్రోమాక్స్ లైట్లు వెలుగుతున్నాయి. డివిజినల్ సూపరింటెంటు సహానీ కంగారుగా షెడ్డు లోపలికి వెళ్తూ కనిపించాడు. కుమార్ చకచక అటు నడిచాడు. కుమార్ షెడ్డును సమీపించేసరికి సహానీ బయటికి వచ్చాడు. అతడి ముఖంలో భయం విచారం కనిపించాయి.

కుమార్‌ను చూడగానే ప్రాణం లేచివచ్చినవాడిలా చూశాడు.

"థాంక్స్యూ మిస్టర్ కుమార్! ఫోన్ చెయ్యగానే వచ్చారు. వాచ్‌మాన్ కాబోలు లోపల ఫోను దగ్గర స్పృహ తప్పి వున్నాడు."

కుమార్ తలూపి లోపలకు నడిచాడు.

"మై గుడ్ నెస్! ఇతడి ప్రాణాలు పోలేదు" ఒంగి కడ్డీని చూశాడు—కుమార్. ఇనుపకడ్డీ ఎర్రబడివుంది. వాచ్‌మాన్ తలవైపు చూశాడు. తలమీద రక్తం గడ్డ కట్టివుంది.

"హత్య జరిగింది ఎక్కడ?" అడిగాడు కుమార్.

"ఎ. ఎస్. ఎమ్. క్వార్టర్‌లో నేమో?"

"మీకు ఫోను ఎవరు చేశారు?"

"అనకాపల్లి స్టేషను మాస్టర్!"

"అదేమిటి?"

"ఎవరో యిక్కడినుండి అనకాపల్లికి ఫోను చేశారట! అవతల ఫోను ఎత్తారట ఎస్. ఎం. (స్టేషను మాస్టరు) అంతే. తర్వాత ఏమీ వినిపించలేదట! టక్‌మన్న శబ్దమూ, మూలుగూ వినిపించాయట.

"హలో...." అన్నారట ఎస్. ఎం.

"హలో....జగ్గయ్య పాలెం ఎ. ఎస్. యెం. చని పోయాడు. యెవరో చంపారు" అని వినిపించిందట. ఫోనులో.

"మీరెవరు?" అడిగాడట యెస్. యం-

ఇక్కడ ఫోను క్లిక్‌మన్నదట.

వెంటనే అయన నాకు ఫోనుచేశాడు" అన్నాడు డి. సూపరెన్టెంట్ సహానీ.

కుమార్ తలత్రిప్పి సార్జెంటుకు సైగ చేశాడు.

మరో నిమిషంలో వ్రేలిముద్రల నిపుణుడు, డాక్టరూ, ఫోటోగ్రాఫరూ షెడ్డులో ప్రవేశించారు. కుమార్ క్వార్టర్‌లోకి నడిచాడు. లోపలి గదిలో అదమరచి మంచంమీద ఒక స్త్రీ నిద్రపోతోంది.

కుమార్ క్వార్టరు సోదాచేశాడు.

ఆమె తప్పించి క్వార్టర్‌లో యెవరూ లేరు.

"మిస్టర్ కుమార్!" సహానీ అరిచాడు.

కుమార్ బయటకు బరుగెత్తాడు. పెట్రోమాక్స్‌లైట్లు చెట్టువెనక గుమిగూడాయి. కుమార్ అటు నడిచాడు. చెట్టుక్రింద యువకుడొకడు బోర్లగిల పడివున్నాడు. అతడి

నగుంవైపు చూశాడు కుమార్.

ప్రక్కటెముకలు క్రిందకూ మీదకూ లేస్తున్నాయి.

కుమార్ అతడిని వెల్లకితలా త్రిప్పాడు.

"హెల్పర్!" పెట్రోమాక్స్ లైట్లు పట్టుకున్న వారిలో ఒకడు అన్నాడు.

కుమార్ అతడిని తేరిపార చూశాడు.

అతడికి పాతికేళ్ళుంటాయి. నల్లటి శరీరం. చారల బనీనుమీద నల్లటిపాంటు టక్ చేసి సాండక్ బెల్టుబూటు కట్టుకున్నాడు.

"కానిస్టేబుల్స్!" పిల్చాడు కుమార్.

కానిస్టేబుల్సు పలికారు.

"స్టేషను చుట్టుప్రక్కల అంగుళం అంగుళం గాలించండి. జాగ్రత్త! అడుగుజాడలు...."

"సార్! ఇన్స్పెక్టరుగారూ! వాచ్ మాన్ కి తెలివి వచ్చింది."

"వెరీగుడ్!" కుమార్ పరుగెత్తాడు.

## 6

కాలింగ్ బెల్ గణగణలాడింది.

డిటెక్టివ్ శరీష్ బద్ధకంగా లేచాడు. నైట్ గౌను సవరించుకుంటూ తలుపు తీశాడు.

తలుపులకు ఆవతల వృద్ధుడిని చూశాడు.

"ఎవరు కావాలి?" అడిగాడు శిరీష్.

"మీరే బాబూ! మా అబ్బాయిని ఎవరో చంపేశారు." వృద్ధుడు వెక్కివెక్కి ఏడవసాగాడు.

శిరీష్ అతడిని సానుభూతిగా చూశాడు.

"లోపలకు రండి." దారి చూపించాడు శిరీష్. వృద్ధుడు లోపలికివచ్చి సోఫాలో కూర్చున్నాడు.

శిరీష్ నోరు బ్రష్ చేసుకుని వచ్చాడు.

సునీత యిద్దరికీ బ్రూ సర్వ్ చేసింది.

"ఇప్పుడు చెప్పండి!" అన్నాడు శిరీష్.

వృద్ధుడు తేరుకున్నాడు.

"మా అబ్బాయి రంగారావు. మా యింట్లో ఎవ్వరికీ ఇష్టం లేకపోయినా జయంతి అనే అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు...." అని చెబుతూ రంగారావు గురించిన పూర్తి వివరాలు చెప్పాడు వృద్ధుడు.

"ఈ తెల్లవారుజామున మా యింటికి కబురుపంపాడు డివిజినల్ సూపర్నెంటు. మా అబ్బాయిని కత్తితో...." వృద్ధుడు ఏడవసాగాడు.

డిటెక్టివ్ శిరీష్ అతడిని ఓదార్చలేదు.

చాలవరకు దుఃఖభారాన్ని ఆ సమయంలో కన్నీళ్ళు తగ్గిస్తాయి.

"క్షమించండి." అన్నాడు వృద్ధుడు పావుగంట తర్వాత.

"మావాడిని చంపిన వాడిని పట్టుకుని...."

"కేసు పోలీసులు టేకప్ చేశారుకదా? వెయిట్ చేయండి!"

"అలాకాదు. మరింత త్వరగా సులువుగా పరిష్కరిస్తారని ఆశతో మీ వద్దకు వచ్చాను. నా శక్తివంచన లేకుండా మీ ఫీసు ఇచ్చుకుంటాను."

"రంగారావు మీద ఎవరికయినా కక్ష వుందా?"

"మా అబ్బాయి పొగరుబోతుకాదు. ఘర్షణపడటం నచ్చదు."

"మీ స్వగ్రామం?"

"పెద్దాపురం."

"ఆశ్చర్యం. పెద్దాపురంనుండి ఇంత త్వరగా విశాఖ పట్నం చేరుకున్నారు."

"టెలెక్స్‌లో అక్కడి పోలీస్ స్టేషనుకి వార్త పంపించారు. ప్రక్కనే మా ఇల్లు."

"గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వచ్చారా?"

"అవును."

"మీ అబ్బాయిని మీరు యింకా చూడలేదు."

"తట్టుకోలేను."

"సరే, నేను అయిదునిమిషాల్లో తయారయి వస్తాను." శిరీష్ సమాధానం కోసం ఎదురు చూడకుండా లోపలికి నడిచాడు.

పదినిముషాల్లో తారురోడ్డుమీద దూసుకుపోతోన్న డాట్సన్‌లో ఇద్దరూ కూర్చున్నారు. శిరీష్ నేర్పుగా డ్రయిన్ చేస్తున్నాడు.

"మీ పేరు?" అడిగాడు శిరీష్.

"రాజయ్య."

"మీకు ఎంతమంది పిల్లలు?"

"రంగారావు ఇంటికి పెద్దవాడు. అతడి తర్వాత ఇద్దరు అమ్మాయిలు."

"పెళ్ళిళ్ళయాయా?"

వృద్ధుడు తలూపాడు.

"చూడండి రాజయ్యగారూ! మీ కోడలు ఎటువంటిది?"

"ఆ అమ్మాయి కూడా బాగా చదువుకున్నది బాబూ! మర్యాదగా ప్రవర్తిస్తుందని విన్నాను."

"ఆమెదీ పెద్దాపురమేనా?"

"కాదు!"

"ఆమెతో రంగారావుకు ఎలా పరిచయం?"

"నాకు ఏమీ తెలియనివ్వలేదు బాబూ! రంగారావు నా దగ్గర దాచాడు."

"ఆ అమ్మాయి తరఫున కూడా యెవరూ తెలియదన్న మాట!"

"అవును బాబూ!"

డిటెక్టివ్ శిరీష్ బ్రేకువేసి కారు ఆపాడు. లెవల్ క్రాసింగ్ గేటు తెరిచివుంది. గేటు ప్రక్కనే వున్న కాబిను బయట నేల యీనినట్టు పోలీసులు! నిద్రలేక కాబోలు వాళ్ళ కళ్ళు యెర్రగా వున్నాయి. వాళ్ళలోంచి ఇన్స్పెక్టరు కుమార్ నడచి వచ్చాడు. డాట్సను కారును సమీపించాడు.

"గుడ్ మార్నింగ్ కుమార్!" అన్నాడు శిరీష్, కారు దిగి.

కుమార్ తలూపి, "గుడ్ మార్నింగ్! ఆయనెవరు?"

"రంగారావు తండ్రి రాజయ్యగారు."

కుమార్ విచారంగా చూశాడు. రాజయ్య కారుదిగి మొహాన్ని అరచేతులలో కప్పుకున్నాడు.

"రాత్రినుండి ఇక్కడే వున్నట్టున్నారు" అడిగాడు శిరీష్.

"అవును. శవం దొరకలేదు!"

శిరీష్ వులిక్కిపడ్డాడు.

"మీరు వచ్చేటప్పటికే శవంలేదా?"

"అలాగే అనుకోవాలి" కుమార్ చనువుగా శిరీష్ భుజంతట్టి దూరంగా నడిపించుకు వెళ్ళాడు.

"రంగారావును హత్యచేసి కాబినులో విడిచాడు హంతకుడు. ఆ తర్వాత వాచ్ మాన్ నీ, హెల్పరునీ

గాయపరచి స్పృహ తప్పించాడు. ఈ సంఘటనలకి కాస్త ముందో వెనకో జయంతిని—ఐ మీన్ రంగారావు భార్యను రాక్షసంగా అనుభవించాడు. ఆమెను కోమాలో విడిచాడు. శవం మాయమైంది. హంతకుడే శవాన్ని తీసుకుని మాయిమయి వుంటాడు.''

"వింతగా వుంది. హంతకుడికి శవం దేనికి?''

"హంతకుడు పిచ్చెత్తినట్లు ప్రవర్తించాడు. వాడే ఇక్కడ హత్య జరిగినట్లు టెలిఫోనులో చెప్పాడు.'' అన్నాడు కుమార్ వివరిస్తూ.

"శవాన్ని మోసుకు వెళ్ళాడంటావా?''

"కాబినులోంచి బయటివరకూ కెట్స్ ముద్రలు స్పష్టంగా అచ్చాయ్యాయి. హతుడి రక్తంతో హంతకుడి కెట్స్ తడిశాయి. తడివున్నంత మేర అడుగుజాడలు పడ్డాయి. వాటినిబట్టి అవతలి ప్రక్కన వున్న సిగ్నల్ స్తంభంవైపు శవాన్ని మోసుకుంటూ వెళ్ళినట్లు అర్థం చేసుకున్నాను.''

"అంటే ప్లాట్‌ఫాంకి అవతలగా వున్న సిగ్నల్ స్తంభం వైపా?'' శరీఫ్ సాలోచనగా అడిగాడు.

కుమార్ తలూపి, "ఎందుకో మాత్రం తెలియలేదు!'' అన్నాడు.

"శవం కోసం వెతికించావా?''

"వూఁ! ఫలితం లేకపోయింది'' కుమార్ తలత్రిప్పి సార్జంట్ వైపు చూశాడు. సార్జెంట్ పాకెట్ అందించాడు.

శరీఫ్ పాకెట్ విప్పిచూశాడు. రక్తంతో యెర్రబడిన కత్తి! కత్తిమీద అక్కడక్కడా పౌడరు స్ప్రే చేసి వుంది.

"హంతుడు ఈ కత్తివల్లనే ప్రాణం పోగొట్టుకున్నట్లు సర్జను అభిప్రాయపడ్డాడు."

"ఐ. సీ."

"ఈ కత్తి యెక్కడ దొరికింది?"

"విచిత్రం! సిగ్నల్ స్తంభానికి కాస్త అవతలగా రైలు పట్టాల మధ్య."

శిరీష్ నుదురు చిట్లించాడు.

"ఈజిట్! పద మనం అక్కడికి వెళ్దాం!"

కుమార్ తలూపి, దారితీశాడు. సిగ్నల్ స్తంభం దాటాడు. రైలు పట్టాలమధ్య రాళ్ళు పేర్చి కాగితం పెట్టి వుంది.

"ఆ కాగితాన్ని గుర్తుకోసం నేనే వుంచాను. పట్టాల మధ్య యెలాంటి అడుగుజాడలూ లేవు. ఈ పట్టాల కివతలగా వున్న ఇనుపబడ్డీల మధ్య మాత్రం అడుగుజాడలు ఉన్నాయి."

"హంతకుడు తెగించినవాడు! తెలివిగా శవాన్ని యెత్తుకుపోయాడు!"

"యెందుకు?"

"నా వూహ కరెక్టే అయితే హంతకుడు కేవలం తమాషా కోసం శవాన్ని యెత్తుకుపోయి వుండాలి!"

"యెలా?"

"చెబుతాను" శిరీష్ మనసులో గుణించుకున్నాడు. "ముందు అనకాపల్లికి ఫోను చెయ్యి. రైళ్ళ వివరాలు— అయ్ మీన్ నిన్న రాత్రినుండి ఇప్పటివరకూ"

"రైల్వేస్టేషనుకా?"

శిరీష్ తలూపి స్టేషను షెడ్డువేపు కదిలాడు. కుమార్ చకచక అతడిని వదిలిపెట్టి షెడ్డులో ప్రవేశించాడు.

రెండు నిమిషాలలో అనకాపల్లి ఎస్. ఎం. పలికాడు.

శిరీష్ ముందుకు సాగి సర్జనుని సమీపించాడు. సరిగ్గా అప్పుడే గేటువద్ద ట్రాలీ ఆగింది. ఇద్దరు పోలీసులు దిగారు. వాళ్ళ మొహాలు ప్రేతకళ పడివున్నాయి. వాళ్లు ట్రాలీ దిగి సర్జనువైపు వచ్చారు.

"క్లాత్‌ఫాక్టరీ స్టేషనుకి రెండు మైళ్ళ దూరంలో శవం కాలుతోంది డాక్టరుగారూ!" అన్నారు పోలీసులు.

సర్జను వులిక్కిపడ్డాడు.

"శవం పూర్తిగా కాలిపోయిందా!" అడిగాడు శిరీష్.

"చాలవరకూ బాగ్గు అయిపోయింది. ఆర్పే సాధనం లేక వెనక్కి తిరిగివచ్చాం."

తెల్లవారేలోగా రెండు గూడ్స్ ట్రయిన్సు అనకాపల్లి వెళ్ళాయి.

ఇద్దరు గార్డులు కూడా ఇక్కడ ఎలాంటి సిగ్నల్స్ ఇవ్వకపోవడం గుర్తించారు." అన్నాడు కుమార్ అప్పుడే అక్కడికి వచ్చి.

"అంటే రెండు గూడ్స్‌ట్రయిన్సూ ఈ స్టేషను సిగ్నల్స్ స్తంభాల ముందు ఆగాయన్న మాట!"

"అవును. అప్పుడే హంతకుడు శవాన్ని వాగన్సు మధ్యవుండే షంటింగ్ పాయింట్స్‌మీద వేసి తీసుకు పోయాడు."

"కరెక్ట్. ఆ ట్రయిన్సులో ఒకదానిమీద వెళ్ళి ఎక్కడ వీలు కుదిరితే అక్కడ ఆ ట్రయిన్ విడిచిపెట్టి శవాన్ని తగలేశాడన్న మాట!" అన్నాడు శిరీష్ సంగతిని వివరించి.

"హతుడి గుండెలో కత్తి గుచ్చుకొని వుండడటం వాచ్‌మన్ సింహాచలం చూశాడు. శవాన్ని షంటింగ్

పాయింట్స్‌మీద వేసేటప్పుడు కత్తి జారిపడిపోయిందన్న మాట!"

శిరీష్ నిట్టూర్చాడు. మెల్లగా కాబిన్‌లోకి నడిచాడు.

"హతుడు మరణించే ముందు నేలమీద అక్షరాలు రాశాడండి. 'పీటర్' — 'గ్రూవ్ ఫోటో' .... ఇంతే రాశాడు. వాటిని ఫోటో తీశాను—" అన్నాడు ఫ్రాటోగ్రాఫరు.

"వెరీగుడ్!" శిరీష్ కళ్లు మెరిశాయి.

## 7

జయంతి మంచం దిగింది. మిగతా బెడ్స్‌మీద రోగులు పడుకుని వున్నారు. బెడ్స్ దాటుకుంటూ అడుగులు వేస్తోంది.

'ఉదయం పదకొండయివుంటుంది' కళ్ళు రెపరెపలాడించింది. వార్డులోకి స్టాఫ్‌నర్సు వస్తోంది. జయంతి ఆమెను భయంగా చూసింది. తనకి ఇవ్వవలసిన మామూలు కోసం రాత్రినుండి తినేస్తోంది తనని.

జయంతి గొంతు తడుముకున్నది.

తనకేమయింది?

"ఇక్కడ నిలబడ్డావేం?" స్టాఫ్‌నర్సు గయ్‌మన్నది.

జయంతి ఆమెను భయంగా చూసింది. మెల్లగా తన బెడ్‌ను సమీపించింది.

"చీఫ్ వస్తారని తెలియదా?" మరల గయ్‌మన్నది.

జయంతి తెలుసునన్నట్టు తలూపింది. బెడ్‌మీద పడుకుంది.

తన గొంతుకు ఏమయింది? తాను ఎందుకు మాట్లాడలేకపోతోంది? స్టాఫ్‌నర్స్ ప్రక్క బెడ్‌వద్దకు వెళ్ళి 'మామూలు' కోసం గొణుగుతోంది.

జయంతి కళ్ళు మూసుకుంది. ఆలోచనలు ఆమె మనసును చీకాకు పరుస్తున్నాయి. ఆ రాత్రి పీటర్ ....

తాను తలుపు తీసింది. గుమ్మంలో వెలుగుతోన్న కాంతిలో పీటర్ తమ గుమ్మంలో నిలబడివున్నాడు. తన భర్త వచ్చినట్టు భ్రమపడి తాను తలుపు తీసింది.

అతడు పకపకనవ్వి తనని సమీపించసాగాడు. తన తల తిరిగింది. ఆ తర్వాత ఏం జరిగిందో తనకి తెలియదు. స్పృహతప్పి వుండాలి.

తిరిగి స్పృహలోకి వచ్చేసరికి పీటర్ తన ప్రక్కనే నిలబడి వున్నాడు. అతడి భుజాన ఎవరో పడుకుని వున్నారు.

పీటర్ పకపక నవ్వి "ఏయ్ పిల్లా!" అన్నాడు.

తాను నిర్ఘాంతపోయి చూడసాగింది. తన పాత్తి కడుపు పచ్చిగా వుంది. కండలు మండిపోతున్నట్టుగా అనుభూతి!

"నీ మొగుడు! చంపేశాను!" అన్నాడు పీటర్.

ఆ మాటలు తన మస్తిష్కం మీద సమ్మెట పోట్లలాగా తగిలాయి.

పీటర్ తన భుజంమీదనుండి బరువు దించుకుని నేల మీద పడుకోబెట్టాడు.

తాను చూస్తోంది కలా? నిజమా?

తన భర్త రంగారావు నేలమీద పడివున్నాడు. అతడి గుండెలలో కత్తి! ఎర్రటి, చిక్కటి నెత్తురు అంటిన కత్తి.

పీటర్ కత్తిపిడిని కదిపాడు. అది అటూ యిటూ వూగి ఆగింది.

తాను కవ్వున అరిచింది.... అరుస్తోంది!

ఆశ్చర్యం! గాలేతప్ప తన గొంతులోంచి ఎటువంటి శబ్దమూ రావడంలేదు. తనకి పూరల స్పృహతప్పింది.

జయంతికి భయంతో ఒళ్ళు జలదరించింది.

ఆ రాత్రి తన జీవితంలో నిప్పులుకురిసిన రాత్రి!

ఆ రాత్రి తన భర్తను దుర్మార్గం పొట్టను పెట్టుకున్న రాత్రి!

జయంతికి కళ్ళలో నీళ్ళునిండాయి.

పీటర్ తన జీవితాన్ని మొదటినుండీ వెంటాడు తున్నాడు. రంగారావు మీద కక్షు పెంచుకున్నాడు. చివరకు తన జీవితాన్ని నాశనం చేయడంలో కృతకృత్యు డయాడు.

జయంతి వులిక్కి-పడి పక్క-కిచూసింది. చీఫ్ సర్జన్ అండ్ డాక్టర్! తన బెడ్ చుట్టూ హావుస్ సర్జన్లు నిలబడి వున్నారు.

వాళ్లు ఏం మాట్లాడుకుంటారో తనకి తెలుసు. రాక్షస రతివలన తను కోమాలో పడింది. ఊహించని దృశ్యం చూచి తనకి మాట పడిపోయింది.

పావుగంట తర్వాత చీఫ్ పిల్లల కోడిలాగా వార్డు లోని బెడ్స్‌చుట్టూ పచార్లు చేయసాగాడు.

జయంతి గుమ్మంలోకి చూసింది.

కానిస్టేబుల్స్ యిద్దరు తన బెడ్ మీద నిఘా వేసి కూర్చున్నారు.

డిటెక్టివ్ శరీఫ్ ఇన్స్పెక్టర్ కుమార్‌తో మాట్లాడి ఈ ఏర్పాటు చేశారట! జయంతి నిట్టూర్చింది.

చివరకు తన బతుకు ఇలా జనరల్ ఆసుపత్రి పాలయింది! పోలీసుల నిఘాతో బతకవలసి వస్తోంది.

స్టాఫ్‌నర్సు నడుచుకుంటూ కానుస్టేబుల్సు మధ్యనుండి

వస్తోంది.

జయంతి వులిక్కిపడింది. ఆమెను తానింతవరకూ చూడలేదు. తన వార్డులో ఇందాక 'మామూలు' అడగ వచ్చిన స్టాఫ్‌నర్సుకాదు.

కొత్త స్టాఫ్‌నర్సు జయంతి బెడ్‌ను సమీపించింది. జయంతి ఆమెనే చూస్తోంది. భారీయెత్తుమనిషి. మొహం నిండా దట్టమైన పౌడరు కోటింగ్ పూసింది. ఎడం చెయ్యి కోటుజేబులో పెట్టుకుంది. ఆ చేతికి సన్నపాటి బెల్టువున్న లేడీస్ రిస్టువాచీ!

"అమ్మా, జయంతీ! ఎక్స్‌రే తీయించాలి. తయారవు!" అంది కొత్త స్టాఫ్‌నర్సు.

అనుమానంగా చూసింది జయంతి.

కొత్త స్టాఫ్‌నర్సు జయంతి భుజాలక్రింద చేతులు వేసింది. జయంతికి బయిలుదేరక తప్పలేదు. నిజంగా ఎక్స్‌రే తీయించడానికే అయివుంటుంది. కానిస్టేబుల్సుకి ఆ విషయం తెలిసే వుండాలి. వాళ్ళిద్దరి మధ్యనుండేకదా ఆమె నడుచుకుంటూ వచ్చింది.

జయంతి తన శరీరం మీది దుస్తులు సవరించుకుని బెడ్ దిగింది. కొత్త స్టాఫ్‌నర్సు వెంట బయలుదేరింది.

కానిస్టేబుల్సు స్టాఫ్‌నర్సును చూశారు. ఆమె నవ్వింది. వాళ్ళిద్దరూ మొహాలు చూసుకున్నారు.

"మీలో ఒకరు రండి! ఒక్కరిని వెంటపెట్టుకుని ఈమెను ఎక్స్‌రే రూంకి తీసుకువెళ్ళమని ఇన్స్‌పెక్టరు కుమార్ ఫోన్ చేశారు!" అందామె.

ఒక కానిస్టేబులు వారివెంట బయలుదేరాడు.

ముగ్గురూ చెక్కమెట్లు దిగారు. నడవాలో అడుగు పెట్టారు. స్టాఫ్‌నర్సు కానిస్టేబులు భుజం మీద చేయి

వేసింది.

కానిస్టేబులు పరవశంగా చూశాడు.

"ప్లీజ్! ఈ పక్క వార్డులో డాక్టర్ నరసింహం వున్నారేమో కనుక్కొని వస్తారా?" అంది కొత్త స్టాఫ్ నర్సు.

కానిస్టేబులు తలూపి ప్రక్క వార్డులోకి వెళ్ళాడు. సిస్టర్‌ను ప్రశ్నించాడు.

"డాక్టర్ నరసింహమా? ఆయన వుండేది మేడమీది వార్డులోనే." అంది సిస్టర్.

కానిస్టేబులు వార్డుబయటికి వచ్చాడు. చకచక నడుచు కుంటూ ఒక చివరగా వున్న ఎక్స్‌రే రూంని సమీపించాడు. కొత్త స్టాఫ్‌నర్సు గానీ, జయంతి గానీ కనిపించలేదు. రూంలో దర్యాప్తు చేశాడు.

"జయంతా? ఎక్స్‌రేయా? ఈరోజు ఎక్స్‌రేలు తీయడంలేదు. ప్లాంట్ పాడయింది!" అన్నాడు ఎక్స్‌రేలు తీసే ఉద్యోగి.

# 8

డిటెక్టివ్ శిరీష్ కుర్చీలో వెనక్కి వాలాడు.

బల్లకి అవతల కుర్చీలో కూర్చున్నాడు కుమార్. అతడు ఆలోచనలతో పగిలిపోతోన్న తలను తన రెండు చేతులతో పట్టుకున్నాడు.

శిరీష్ చెయ్యిచాపి బల్లమీది గ్రూప్ ఫోటోను అందు కున్నాడు. ఫోటో పైభాగంలో కాలేజి పేరు వుంది. చాంతాడంత పొడవైన పేరు. పెద్దాపురం. 1975-1976 థర్డు బి. ఎ. క్లాస్ అని వుంది.

"పీటర్, రంగారావులు క్లాసుమేట్స్ అయినంత మాత్రాన పీటర్‌కి రంగారావుని చంపవలసిన అవసరం

ఏం వచ్చింది?" అడిగాడు కుమార్.

"కాలేజీ దినాలనాటి పాత కక్షలయివుండాలి!" అన్నాడు శిరీష్.

"అయితే ఈ నాలుగు సంవత్సరాలపాటు పీటర్ ఏం చేస్తున్నట్టు?" కుమార్ గ్రూప్ ఫోటోను అందుకున్నాడు. ఫోటోను పరీక్షగా చూశాడు.

పీటర్ నిలబడిన వరసలో మొదటి వరుసలో ఒక చివరగా నిలబడివున్నాడు. ఫోటో అడుగుభాగంలో ఫోటోలో వున్నవారి పేర్లు ముద్రించడంవలన పీటర్‌ను గుర్తించటం చాలా సులువయింది. రంగారావు పై వరుసలో మధ్యలో వున్నాడు.

"పీటర్ ఫోటోకి కాపీలుతీయించి అన్ని పోలీసు స్టేషన్లకు పంపించావా కుమార్?" అన్నాడు శిరీష్ పీటర్ భారీ ఆకారాన్ని చూస్తూ.

"ఫోటోలే కాదు—అతడి వేలిముద్రలు కూడా?"

"వేలిముద్రలు పీటర్ వేనని గ్యారంటీ ఏమిటి?"

"అదేమిటి? జయంతి తనను రేప్ చేసింది పీటర్ అని రాసి యిచ్చిందికదా?"

"అయితే అతడి వేలిముద్రలు కత్తిమీద దొరకాలి కదా?"

కుమార్ పకపక నవ్వాడు. "వేలిముద్రలు ఫోటోల మాదిరిగా అచ్చుపడి వుంటాయా అవి. రాపిడిలో చెరిగి వుండాలి!"

శిరీష్ నవ్వి, "కాని జయంతి చెప్పిన మాటలు—అయ్‌మీన్ రాసియిచ్చిన కథనంలో ఒక విషయం వుంది. రంగారావు శవాన్ని ఆమె మంచంవద్ద నేలమీద

పడుకో బెట్టినప్పుడు జయంతి తన కళ్లారా చూసింది. శవం గుండెల్లో గుచ్చుకొని వున్న కత్తిని అటూ ఇటూ కదిపాడు పీటర్. అతడి చేతులకు ఎలాంటి అచ్ఛాదనా లేదు. వ్రేలిముద్రలు ఏమాత్రం లేకుండా తుడిచిపెట్టి నట్టుగా వుంది కత్తి" అన్నాడు.

"శవాన్ని విక్రమార్కుడిలాగా మోసుకువెళ్లాడు పీటర్. భుజం మీద రాపిడివల్లనో బట్టల తాకిడివల్లనో వ్రేలిముద్రలు తుడిచినట్టుగా అయిపోతాయి."

"సింహాచలం స్పృహతప్పాడు. అతడు త్రాగిన అల్కహాలులో మత్తుమందు కలిసివుంది. అతడు అల్కహాలు త్రాగిన సీసామీద అతడి వేలిముద్రలు లేవు. అంటే అల్కహాలు కలిపిన వ్యక్తి తన వేలిముద్రలతోబాటు అతడి వేలిముద్రలుకూడా చెరిపేశాడన్నమాట!"

"పీటర్ ప్రవర్తన విడ్డూరంగా వుంది."

"వ్రేలిముద్రలు చెరిపిన వ్యక్తి పీటర్ కావడం అసాధ్యం?"

"అదేమిటి?"

"అవును. పీటర్ కి వ్రేలిముద్రలు చెరిపే అలవాటు లేదు. అతడు చేసిన పనులన్నీ వెలుగులో బాహాటంగా చేసి తప్పుకున్నాడు."

"ఈ కేసులో మరోవ్యక్తివున్నట్టు నువు యింతవరకూ అనుమానించుకుంటున్నావన్నమాట!"

"అవును కుమార్! కేసు రానురాను క్లిష్టమవుతోంది?"

"యెలా?"

"సింహాచలం స్పృహతప్పాక లెవెల్ క్రాసింగ్ గేటును ఎవరు మూశారు?"

"పీటర్."

"ఆల్ రైట్ పీటర్ అనుకుందాం! ఆ రాత్రిమొత్తం రెండు గూడ్సు ట్రెయిన్లూ, మూడు ఎక్స్‌ప్రెస్ రైళ్ళూ లెవెల్ క్రాసింగ్ గేటును దాటాయి. గేటులోంచి పోయే రహదారి రద్దీ అయిన రహదారి! గేటుకి అవతలా యివతలా వున్న చెక్‌పోస్టులలో ఆ రాత్రి చాలా వాహనాలు వెళ్ళినట్టు చెప్తున్నారు."

"రైట్.... చెప్పు!"

"మనం ఆ వాహనాల డ్రయివర్ల సహకారం అర్థించాం. ఆ రాత్రంతా యెవరో ఆ గేటును మూస్తూ తెరుస్తూ వున్నట్టు వాళ్ళు చెప్పారు."

"కరెక్ట్! అతడు పీటర్ అయివుండడు. పీటర్ ఆ సమయంలో జయంతితో వున్నాడు."

"అలా తెరుస్తోన్న వ్యక్తి భారిమనిషి కాడు. బవిరి గడ్డం లేదు!"

"............"

"మనలో యెవరో ఒకరు పెద్దాపురం వెళ్ళాలి!"

"అవును. అక్కడ పీటర్ గురించి తెలియవచ్చు. పాత కక్షలకు కారణాలు తెలియవచ్చును."

బల్లమీది టెలిఫోన్ గణగణలాడింది.

కుమార్ రిసీవరు యెత్తాడు.

"కుమార్‌జీ! నేను జనరల్ ఆస్పత్రి సూపరెంటును మాట్లాడుతున్నాను."

"యెస్. చెప్పండి."

"జయంతి మాయమయింది!"

"నాన్సెన్స్!"

"నిజమే సార్! ఎవరో నర్స్‌తో కలిసి ఎక్స్‌రేరూంకి

బయలు దేరింది. మధ్యలో మాయమయింది!"

"ఆ నర్స్ ఎవరు?"

"ఆమె మా నర్స్ కాదు! స్టాఫ్ నర్స్ వేషంలో వచ్చింది. భారీ ఎత్తుమనిషి!"

"మా కానిస్టేబుల్సు నిద్దరోతున్నారా?"

జనరల్ ఆసుపత్రి సూపరెన్టెంటు చాలా సేపు వివరించాడు. విషయం అర్థమయినట్టుగా నిట్టూర్చి కుమార్ రిసీవర్ ను క్రెడిల్ చేశాడు.

శిరీష్ లేచాడు. "పీటర్ విశాఖపట్నంలో నే వున్నాడా!" అన్నాడు.

"నీకు ఎలా తెలిసింది?"

"ఆ భారీ ఎత్తు వేషంలో వచ్చి స్టాఫ్ నర్సుగా వ్యవహరించింది పీటర్! సందేహం లేదు."

"ఎంతకు తెగించాడు?"

"నువు అతడి విషయం చూసుకో!"

కుమార్ నిట్టూర్చి, "మరల రాక్షస రతికి గురయితే ఆమె బతకదు!" అన్నాడు.

"లంచాలు భోంచేయడంలో వున్న ఆసక్తి పనులు చేయడంలో వుండదు! అయినా వాళ్ళను నమ్ముకోవడం మన తప్పు."

# 9

"నాలుగేళ్ళనాటి సంగతా! నాకేం గుర్తువుంటుంది?" కళ్ళద్దాలు తీసి బల్లమీద పెట్టాడు ప్రిన్సిపాలు.

శిరీష్ ఆయనను పరీక్షగా చూశాడు. ఆయన చెప్పింది సహజమే! ఏడాదికి వెయ్యిమంది స్టూడెంట్స్ బయటికి వెళ్తుంటారు. వెయ్యిమంది వస్తుంటారు. వీళ్ళలో రంగారావు, పీటర్ గుర్తుండటం ఎలా సాధ్యం?

ఏదయినా ప్రత్యేక సంఘటన జరిగివుంటే తప్ప!

"ప్రిన్సిపాల్ గారూ! ఒప్పుకుంటాను. కనీసం ఈ గ్రూప్ ఫోటోలో వున్న వ్యక్తులు ఎవరైనా ఈ వూళ్ళో వున్నారేమో చెప్పగలరా? ప్లీజ్ ...."

ప్రిన్సిపాల్ గంభీరంగా నవ్వాడు.

"మీ యింటరాగేషన్‌కి నేనే దొరికానా?" అంటూ ఆయన గ్రూప్ ఫోటోను అందుకున్నాడు. పరిశీలనగా చూశాడు.

"నాతోబాటు కూర్చున్న లెక్చరర్లను అడిగి...."

ప్రిన్సిపాలు మాట ఆగిపోయింది.

"అరరె....ఇతడు థర్డు బి. ఏ. చదివాడా?" ఆశ్చర్యంగా చూశాడు ఆయన. ఆయన వ్రేలు గ్రూప్ ఫోటో మీద ఆగింది. ఆ వ్రేలువద్ద టక్ చేసుకున్న యువకుడు నిలబడి వున్నాడు. అతడి కుడిచెయ్యి రంగారావు భుజం మీద వుంది.

"వెరీగుడ్! అతడిని గుర్తుపట్టారా?"

"నిన్న నేను రిక్షాఎక్కాను. రిక్షా పుల్లర్ యితడే!"

ప్రిన్సిపాల్ విచారంగా చూశాడు.

శిరీష్ పళ్ళు బిగించి, "ఈ దేశంలో ఇది సహజమైన పరిణామం! మీరు రిక్షా ఎక్కిన స్థలం గురించి చెప్పండి!" అన్నాడు.

"రాజరాజేశ్వరి టాకీసు వద్ద. అతడు అక్కడే పార్కింగ్ ప్లేస్‌లో వున్నాడు."

డిటెక్టివ్ శిరీష్ అతడి పేరుకోసం వెతికాడు.

లక్ష్మీపతి!

శిరీష్ ఆయనకు కృతజ్ఞతలు చెప్పకుని కాలేజి ఆవరణలోంచి బయటకు వచ్చాడు. రోడ్డుకి అటూ యిటూ

భవనాలూ, షాపులూ వెలిశాయి. నిర్జనమైన ఒకప్పటి రోడ్లు కళాశాల తెచ్చిపెట్టిన నాగరికతలో, హంగులో తళతళలాడుతున్నాయి.

శిరీష్ రోడ్డు మలుపు తిరిగి సినిమాహాలు రోడ్డుకి వచ్చాడు. రిక్షాలు ఆగి వున్నాయి. ఒక రిక్షాలో సీటు మీద వెల్లకిలా పడుకుని బీడీ తాగుతున్నాడు లక్ష్మీపతి.

రిక్షాను సమీపించాడు శిరీష్.

"మిస్టర్ లక్ష్మీపతీ!" పిలిచాడు శిరీష్.

లక్ష్మీపతి చటుక్కున రిక్షా దిగి నిలబడ్డాడు.

"ఎవరు మీరు? నా పేరు మీకు ఎలా తెలుసు?" అడిగాడు లక్ష్మీపతి.

"రంగారావు. మీ క్లాసు మేటు—డిగ్రీలో."

లక్ష్మీపతికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

శిరీష్ అతడిని పరీక్షగా చూశాడు. కాలేజి దినాల్లో టక్ చేయనిదే బయటకు రానివాడు కాబోలు ప్రస్తుతం చిరిగిపోయిన నీలం చొక్కాను మాసిపోయిన పాంటు లోకి దోపాడు. మెడలో టైకి బదులుగా ఎర్రటి జేబు రుమాలు కట్టుకున్నాడు. రంగారావు పేరె త్తడంవలన గత స్మృతులు అతడిలో కలకబారినట్టు అర్థం చేసుకున్నాడు శిరీష్.

"రండి హోటల్‌లో కూర్చుందాం". శిరీష్ పది రూపాయలనోటు అందించాడు. "మరోలా అర్థం చేసుకో వద్దు. మీకు రిక్షా బాడుగ నష్టంకారాదు" అన్నాడు.

లక్ష్మీపతి నోటు అందుకున్నాడు. ఇద్దరూ హోటలులో ప్రవేశించారు. 'ఫామిలీ' అన్న గదిలో కూర్చున్నారు.

సర్వర్ వచ్చాడు. శిరీష్ అతడికి టిఫిన్ చెప్పి పంపించేశాడు.

"రంగారావును ఎవరో హత్యచేశారు!" అన్నాడు శిరీష్.

లక్ష్మీపతి బ్రిమ్మెరపోయాడు.

"పీటర్ చేసినట్లు కొన్ని ఆధారాలున్నాయి."

"పీటర్ .... వాడు నరరూప రాక్షసుడు!" పళ్ళు పట పటలాడించాడు లక్ష్మీపతి.

శిరీష్ ఓపికగా సమయం కోసం కాచుకున్నాడు.

లక్ష్మీపతికి ఆవేశం కట్టలు తెంచుకుంది.

## 10

రంగారావు సైకిలుకు స్టాండు వేశాడు. తాళంపెట్టి కారేజిమీదున్న పుస్తకాలు తీసుకుని క్లాస్ రూంవైపు నడిచాడు. రూంలో అడుగుపెట్టగానే చప్పట్లు విని పించాయి.

పీటర్ లయగా క్లాప్స్ కొడుతున్నాడు. రంగారావు వేస్తోన్న స్టెప్స్‌కి అనుగుణంగా అవి మ్రోగుతున్నాయి. స్టూడెంట్సు నవ్వుతున్నారు. రంగారావు తెల్లబోయి అంతలోనే తేరుకుని వాళ్ళతో శ్రుతి కలిపాడు.

"మజ్నూ ఆగయారే!" ఎవరో కేకేసుకున్నారు.

రంగారావు ఉలిక్కిపడ్డాడు. తాను జయంతిని ప్రేమిస్తోన్న విషయం వీళ్ళకు ఎలా తెలిసింది? కేవలం జోక్‌గా అంటున్నారా?

"మజ్నూ ఏమిటి—?" అడిగాడు రంగారావు.

"సోమరాజు టాకీసులో లైలామజ్నూ ఉదయం ఆటలు—పయనమయ్యే ప్రియతమా...." రాగయుక్తంగా ఆలాపించసాగాడు పీటర్.

క్లాసు మరల నవ్వులతో మారుమ్రోగిపోయింది.

లెక్చరర్ రావడంతో క్లాసు సద్దుమణిగింది.

ఫస్టు అవర్ కాగానే రంగారావుగారూ అంటూ పదేళ్ళ కుర్రాడు వచ్చాడు. రంగారావు క్లాసులోంచి బయటకు నడిచాడు. కుర్రాడు అతడికి కవరు అందించి పారిపోయాడు. రంగారావు తెల్లబోయి కవరు అందుకున్నాడు. కవరుమీది చేతిరాతను సులువుగా గుర్తుపట్టాడు. జయంతి రాసిన అక్షరాలవి. మార్చిరాసింది.

చటుక్కున కవరు తెరిచాడు. కవరులో చిన్నసైజు కాగితం వుంది. కాగితం మీద కంగారుగా రాసినట్లు పెన్సిలు రాత వుంది. రంగారావు చదువుకున్నాడు.

"సాయంకాలం అయిదు గంటలకు పాండవుల

మెట్టవద్ద మెట్లక్రింద నీ కోసం కాచుకుంటాను."

—జయంతి."

రంగారావుకి గుండె ఝల్లుమంది. జయంతికీ తనకీ వుత్తర ప్రత్యుత్తరాలు కొత్తకాదు. అయినా ఆమె ఎప్పుడు వుత్తరం రాసినా తనకి గుండె ఝల్లుమంటూనే వుంటుంది.

రంగారావు కవరునూ, ఉత్తరాన్ని జేబులో పెట్టుకున్నాడు.

*　　　*　　　*

జయంతి మెల్లగా నడచుకుంటూ రాజుగారి కోటవద్ద ఆగింది.

కోటకి వున్న చారిత్రక ప్రాధాన్యతకి రుజువుగా చాలవరకూ కరిగిపోయిన మట్టిగోడలూ, వాటికి మధ్యగా ఎత్తయిన కోట సింహద్వారమూ ఇంకా వున్నాయి.

జయంతి సింహద్వారంవైపు చూస్తోంది. ఆ తలుపులువద్ద వుండమని తాను రంగారావుకు ఉత్తరం రాసింది. నాలుగున్నరకి అక్కడ వుండమన్నది. అయితే రంగారావు

నాలుగు గంటలకే తన కోసం కాచుకుని వుండాలి. అతడి మనసు తనకు బాగా తెలుసు.

జయంతి అటూ ఇటూ చూసింది. తనని ఎవరూ చూడటంలేదు. అయినా ఈ ప్రాంతంలో తాను ఎవరికీ తెలియదు. తలుపుల వద్దకు నడిచి ఆగింది జయంతి. శతాబ్దాలనాటి వాతావరణ పరిస్థితులకు తలుపులు పెట్లి పోయి పొరలుగా విడిపోయాయి.

జయంతి వాచీ చూసుకుంది. సాయంత్రం అయి దయింది.

జయంతి లోపలకు తొంగిచూచింది. కోట గుమ్మం లోపల చెదలపుట్టలు మేడలువేశాయి. వాటికి కాస్త యివతలగా విశాలమైన ఊడలు పెంచుకొన్న వటవృక్షం. దూరంగా పెంకుటి బంగళాలు. మధ్యలో ఎకరాలకొలది భూమి. అడ్డూ అపూ లేకుండా పెరిగిన చిట్టిపొదలు. వాటికి మధ్యలో పెద్ద సిమెంట్ దీపాలు. రోడ్డుమీద జనం నడుస్తున్నారు. వాహనాల హోరు వినిపిస్తోంది.

మర్రిచెట్టు ప్రక్కన ఎవరో కదిలినట్టయింది.

'రంగారావు!' జయంతి గుండె ఎక్స్ప్రెస్ రైలు ఇంజన్లా కొట్టుకుంది. చకచక ఊడల మధ్యకు పరుగెత్తింది. జయంతి అకస్మాత్తుగా ఆగింది. అతడు రంగారావు కాదు. భారీ ఎత్తు మనిషి! పీటర్!

జయంతి వెనక్కి తిరగబోయింది. అప్పటికే పీటర్ ఆమెను సమీపించాడు. అతడి చెయ్యి ఆమె నోటిని బలంగా అదుముతోంది. రెండో చేత్తో ఆమె ముక్కు మీద జేబు రుమాలు అదిమాడు.

తియ్యటి వాసన! పీల్చకూడదనుకుంటూనే జయంతి గుండెలనిండా తియ్యటి గాలిని పీల్చుకున్నది. క్షణాల్లో

జయంతి అతడి చేతులలో వాలిపోయింది. ఆమెను నేల మీద పడుకోబెట్టాడు పీటర్.

పీటర్ ఆమెమీద పడ్డాడు.

* * *

జయంతి కళ్ళు తెరిచింది. చుట్టూ చూచింది. తాను బెడ్ మీద పడుకున్నది. ఒళ్ళంతా సూదులతో పొడుస్తోన్నట్టు నరకయాతనగా వుంది. ముఖ్యంగా జీర్ణాశయం దిగువ భాగం శూలాలతో గుచ్చుతోన్నట్టుగా కండరాలు కోస్తోన్నట్టుగా ఒకటే బాధ!

రంగారావు ఆమెమీదకు వాలాడు.

"జయా!" అన్నాడు. అతడి కళ్ళు ఎర్రగా వున్నాయి. కళ్ళలో తడి!

ఆమె చెయ్యి కదపబోయింది.

"చెయ్యి కదపక జయా! గ్లూకోజ్ ఎక్కుతోంది!" రంగారావు గొంతు బొంగురుగా వుంది.

"నాకు ఏం జరిగింది? ఇక్కడికి ఎలా వచ్చాను."

"నిన్న రాత్రి ఏడు గంటలకు కోటముందు రోడ్డుమీద స్పృహ తప్పి పడివున్నావు. నిన్ను యెవరో దారుణంగా చెరిచారు" రంగారావు కళ్ళు వర్షించాయి.

జయంతి పెదిమలు బిగుసుకున్నాయి.

"పీటర్! దుర్మార్గుడు!" గొణుక్కున్నది.

ప్రక్కగా యెవరో వచ్చి నిలబడ్డారు. డాక్టర్!

"ఆపరేషన్‌కి ఏర్పాట్లు జరిగాయి. కాని...." ఆగిపోయాడు డాక్టర్!

ఏమిటన్నట్టు చూశాడు రంగారావు.

జయంతి నిర్లిప్తంగా వింటోంది.

"యూట్రెస్ బాగా దెబ్బతిన్నది. ఈ ఆపరేషన్‌కి

ఒప్పుకుంటే పిల్లలు పుట్టరు."

"ఒప్పుకోకపోతే!"

"సెప్టిక్ అయ్యే ప్రమాదం వుంది! ప్రాణాలకు మోసం!"

"డాక్టర్ ...." రంగారావు గొల్లుమన్నాడు. "డాక్టర్! ఆమె బతకాలి!" డాక్టర్ తలూపాడు.

## 11

"జయంతికి ఆపరేషన్ సక్సెసయింది. పీటర్ కి అయిదు సంవత్సరాల కఠినశిక్ష వేశారు." ఆగాడు లక్ష్మీపతి.

శిరీష్ నిట్టూర్చాడు.

ఇద్దరూ మౌనంగా టిఫిన్ తినసాగారు. సర్వరు కాఫీ కెచ్చి పెట్టాడు.

"పీటర్ ని రాజమండ్రి సెంట్రల్ జెయిలుకి పంపించారా?" అడిగాడు శిరీష్.

"అవును."

"జయంతి తరపున యెవరూ లేరా?"

"ఆమె అనాథశరణాలయంలో వుండి కాలేజిలో ఇంటర్ చదివేది!"

"పీటర్ కి ఆమెమీద కక్ష యెందుకు?"

"కక్ష కాదు—పిచ్చి ప్రేమ."

"అలా అని వాఙ్మూలంలో చెప్పాడా?"

లక్ష్మీపతి తలూపాడు.

"చాలా థాంక్స్ లక్ష్మీపతిగారూ! చాల ఉపయోగకరమైన సమాచారం యిచ్చారు."

"రంగారావు చాలా మంచివాడు."

"అవును. అతడిని కిరాతకంగా వెంటాడాడు పీటర్.

ఆల్ రైట్! నేను రాజయ్య ఇంటికి వెళ్తాను."

"మీకు ఈ ఊరు తెలుసా?"

"1968 వరకూ యిక్కడే వుండేవాడిని. వీర్రాజు హైస్కూలులో చదువుకున్నాను—1968 బేచ్—యెస్. యెస్. యెల్. సి."

"చాలా సంతోషం సార్!"

శిరీష్ అతడిని భుజంతట్టి, "లేద్దామా?" అన్నాడు.

# 12

ఇన్స్పెక్టర్ కుమార్ జీపు దిగాడు. లెవల్ క్రాసింగ్ గేటు దాటి స్టేషన్ ప్లాట్ ఫాంమీద అడుగు పెట్టాడు. రేకుషెడ్డు బయట అసిస్టెంట్ స్టేషన్ మాష్టర్ ఎవరితోనో మాట్లాడుతూ కనిపించాడు.

ఇన్స్పెక్టర్ కుమార్‌ను చూడగానే విష్ చేశాడు. కొత్తగా యీ పదవిలోకి వచ్చిన అసిస్టెంట్ స్టేషన్ మాష్టర్ గోపాలం.

"ఈయన యిక్కడి క్లర్క్. సెలవు అయిపోగానే జాయినయ్యారు" అన్నాడు గోపాలం.

ఇన్స్పెక్టర్‌ను విష్ చేశాడు క్లర్క్.

"మీ పేరు?" అడిగాడు ఇన్స్పెక్టర్ కుమార్.

"కనకారావు."

"మీరు ఎప్పటినించీ ఈ స్టేషన్‌లో సర్వీస్‌లో వున్నారు?"

"మూడు సంవత్సరాలనుండీ. నా అపాయింట్‌మెంట్ యిక్కడే జరిగింది!"

"ఈ మధ్యకాలంలో యిక్కడ లెవల్ క్రాసింగ్ వద్ద యాక్సిడెంటయిందట—ఆ విషయం తెలుసుకుందామని వచ్చాను."

కనకారావు విచిత్రంగా చూశాడు.

"యాక్సిడెంట్ విషయం మీకు ఎవరు చెప్పారు?" అడిగాడు కనకారావు.

"దర్యాప్తులో తేలింది. లెవెల్ క్రాసింగ్ వద్ద వుండే సింహాచలానికి త్రాగి పడుకోవడం అలవాటేనట కదా!"

"అవును సార్! మూడు వారాల క్రితం యాక్సిడెంటయింది. గేటు మూసిలేదు. పెళ్ళికి వెళ్తోన్న ఎడ్ల బండిని పాసింజర్ ట్రయిన్ ఢీకొట్టింది."

"ఎంతమంది మరణించారు?"

"మరణించింది ఒక్కరే. ఎడ్లు చచ్చిపోయాయి! అందరికీ గాయాలు మాత్రం తగిలాయి!"

"పెళ్ళివారి కంప్లయింటులో నలభై తులాల బంగారం పోయినట్టు వుంది!"

"అవును సార్! నగల పెట్టె పోయినట్టు పెళ్ళివాళ్ళు గోలెత్తిపోయారు. ఆ రోజు సింహాచలం సెలవుపెట్టి మరి ఒకరిని తన స్థానంలో వుంచి వెళ్ళాడు. ఆ కొత్త వాడిని అధికారులు ఉద్యోగంలోంచి తొలగించారు."

"నగల పెట్టె ఏమయివుంటుంది?"

"అదే ఆశ్చర్యం సార్! రైలుపట్టాలమీద ఎక్కడా పెట్టె దొరకలేదు. వాళ్ళ బంధువులలోనే ఎవరో ఒకరు ఆ పెట్టెను అపహరించి వుండాలి సార్!"

"మీరు సెలవు పెట్టి ఎక్కడికి వెళ్ళారు?"

"మా తండ్రిగారికి పక్షవాతం తగిలింది సార్! దగ్గర వుండి ఆయనను చూసుకోవలసి వచ్చింది!"

"ఎక్కడయినా కూర్చుండి మాట్లాడుకుందాం. రండి సార్!" అన్నాడు గోపాలం.

"మా క్వార్టర్‌లో కూర్చుందాం రండి సార్!" అన్నాడు కనకారావు.

"నేను కనకారావుగారి క్వార్టర్‌లో కూర్చుంటాను. డిటెక్టివ్ శిరీష్ వస్తే అక్కడికి పంపించండి" కుమార్ దారితీశాడు. కనకారావు అతడిని వెంబడించాడు.

"మీకు యింకా పెళ్ళి కాలేదా?" అడిగాడు కుమార్.

"అయింది సార్. డెలివరీకి పంపించాను" కనకారావు క్వార్టర్ తాళం తెరచి, "లోపలికి రండి సార్!" అన్నాడు.

కుమార్ క్వార్టరులో ప్రవేశించాడు. బొగ్గు పొగతో మసిబారిన గోడలు వికృతంగా వున్నాయి.

"రాక్షసి బొగ్గుతో బాయిలర్ పెడతారా మీ యింట్లో" అడిగాడు కుమార్.

"అవును సార్! ఆ బొగ్గు చవక!"

"చవకకాదు....ఫ్రీగా వస్తుంది!" కోపంగా చూశాడు కుమార్. కనకారావు రెండు కుర్చీలు వాల్చాడు. ఇద్దరూ కూర్చున్నారు.

"కాఫీ పెడతాను సార్! ఒక్క నిమిషం!" లేచాడు కనకారావు. వంటింట్లోకి నడిచాడు.

కుమార్ చటుక్కున లేచి గదిలోవున్న టేబులువద్దకు నడిచాడు. టేబులు ప్రక్కగా వున్న మూల గాజు అద్దం పగిలిన ముక్కలు కనిపించాయి. టేబులు క్రింద ఫోటో ఫ్రేమువుంది. కుమార్ గోడవైపు చూశాడు. గోడలకి ఫామిలీ ఫోటోలూ, కాలెండర్లూ తగిలించివున్నాయి.

కుమార్ చూపు గోడమీద నిలబడిపోయింది. గోడకి చిన్న సైజులో కనకారావు బస్టు ఫోటో తగిలించివుంది.

దానిచుట్టూ దీర్ఘ చతురస్రాకారంలో తెల్లటి మరక!

గుమ్మం దగ్గర చప్పుడయింది. కుమార్ తలత్రిప్పి చూశాడు.

డిటెక్టివ్ శిరీష్ లోపలికివస్తూ కనిపించాడు. కుమార్ విష్ చేశాడు.

"పీటర్, మూడు వారాల క్రితం రాజమండ్రి సెంట్రల్ జెయిలునుంచి విడుదల అయ్యాడు. ప్రవర్తన మార్చుకున్నట్టు నటించి, ఏడాది ముందే జెయిలులోంచి బయట పడ్డాడు" అన్నాడు శిరీష్.

"రాజమండ్రి కూడా వెళ్ళివచ్చావా?"

శిరీష్ తలూపాడు.

కనకారావు తొంగిచూచి మరల లోపలకు వెళ్ళాడు.

శిరీష్ అతడిని చూచి నుదురు చిట్లించాడు.

కుమార్ కళ్ళతో సైగ చేశాడు. శిరీష్ గోడవైపూ టేబులు ప్రక్కగా గది మూలవైపూ చూచి వూరుకున్నాడు.

ట్రేతో కాఫీ కప్పులు తెచ్చి ఇద్దరికీ చెరొకటీ యిచ్చి తనో కప్పు తీసుకున్నాడు కనకారావు.

"రంగారావు హత్య జరిగి ఈనాటికి మూడు రోజులయింది. ఈ మూడు రోజులుగా ఈ ప్రాంతంలో మీకు మరల పీటర్ కనిపించాడా?" అడిగాడు కుమార్.

"లేదు సార్! నేను రంగారావు మరణించిన మర్నాటి ఉదయం అంటే మే తొమ్మిదో తారీఖునాడు డ్యూటీలో జాయినయాను. పైగా అతగాడు ఎలా ఉంటాడో కూడా నాకు తెలియదు సార్!" అన్నాడు కనకారావు.

"రాత్రిపూట మీకు భయంగా ఉంటుందా?"

"ఎందుకు సార్ భయం? రంగారావుకులాగా నాకు

పాత కక్షలున్న వాళ్లు ఎవరూ లేరు."

"మనం వెళ్దామా?" లేచాడు డిటెక్టివ్ శిరీష్.

ఇద్దరూ కనకారావు వద్ద సెలవు పుచ్చుకుని బయలు దేరారు.

గోపాలానికి చెప్పి కుమార్ జీపు స్టార్టు చేశాడు. జీపు బయలుదేరింది. శిరీష్ తను పెద్దాపురంలో తెలుసు కున్న విషయాలు చెప్పి, "రాజమండ్రి సెంట్రల్ జెయిలులో పీటర్ కి ఉత్తరాలు వచ్చేవి. విశాఖపట్నం నుండి వాత్తేరు వెళ్ళే ఆర్.ఎం.ఎస్.లో పోస్టు అయేవి" అన్నాడు.

"అంటే ఎక్కడా పోస్టు ఆఫీసులో ముద్రపడేవి కావన్నమాట!"

"అవును."

"చెప్పు."

"పీటర్ బయలుదేరేముందు ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం అందేలోపుగానే అతడు గోదావరి ఎక్స్ప్రెస్ పట్టుకున్నాడట!"

"ఐ.సీ....ఏదీ ఆ వుత్తరం?"

డిటెక్టివ్ శిరీష్ తన పాంటు జేబులోంచి కవరు తీశాడు.

"పీటర్ గురించిన గుర్తులు సెంట్రల్ జెయిలుకి వెళ్ళడం వలన అక్కడి ఉద్యోగులు నాకు మరింత సహాక రించారు" అంటూ శిరీష్ కవరులోంచి చిన్న కాగితం తీశాడు. చదవసాగాడు.

పీటర్!

ఒకసారి ఇక్కడికిరా, వివరంగా మాట్లాడు

టుందాం. మనం కొనబోయే సైట్ చూడటం మంచిది! నేను సెలవు పెడతాను.

—మిత్రుడు.

"సైటు ఏమిటి?" అడిగాడు కుమార్.

"కేసుకు ఒక స్వరూపం ఏర్పడుతోంది. అన్నట్లు నువు కనకారావు మీద పని పెట్టుకున్నావేం?"

"రంగారావు మరణించిననాడు ఉదయం మనం అతడి క్వార్టర్ వెతికాం. గుర్తుందా?"

"అవును రంగారావు తన రక్తంతో రాసిన అక్షరాల ప్రకారం గ్రూప్ ఫోటోకోసం వెతికాం."

"అప్పటికే అతడి క్వార్టరును ఎవరో వెతికారని నువ్వు అనుమానపడ్డావు."

"అంతేకాదు—వెతికినవాడు చేతికి గ్లవ్స్ వేసుకుని ఉండాలి!"

"పీటర్ కాదు. అయితే ఎవరు. అతడికి క్వార్టరును వెతకవలసిన పని ఏమిటి? అని నేను ఆరా తీశాను. డివిజినల్ సూపరెన్టెంటు లెవెల్ క్రాసింగ్ గేటువద్ద ఇటీవల జరిగిన యాక్సిడెంటు గురించి చెబుతూ బంగారు నగలపెట్టె పోయినట్టు చెప్పారు. ఆ పెట్టె పెళ్ళి బృందానికి సంబంధించిన వారిది."

"వెరీగుడ్....కొస అందుతోంది. చెప్పు."

"పీటర్‌కి సహాయపడిన వారెవరో ఆ పెట్టె తన స్వంతం చేసుకోవాలని ఆశించివుంటారు."

"అంటే ఆ బంగారు నగలపెట్టె రంగారావుకి దొరికివుండాలి!"

"వెరీగుడ్. పీటర్‌కి జయంతిని ఎరవేసి అతడు ఆ

నగల పెట్టెను ప్రతిఫలంగా తీసుకోవాలనుకున్నాడు."

"పీటర్ జాడ తెలిసిందా?"

"లేదు. అన్ని బస్ స్టాపులలో, రైలు స్టేషన్‌లో పోలీస్ నిఘా ఉంచాను."

"కనకారావు మీద నీకు అనుమానం ఎలా వచ్చింది?"

"వాచ్‌మాన్ సింహాచలం యాక్సిడెంట్ జరిగిననాటి రాత్రి స్టేషన్‌లో లేదు. అతడు తిరిగి డ్యూటీలో చేరే టప్పటికి రంగారావూ కనకారావూ తగాదాపడు తున్నారట. సింహాచలం రావడం చూచి వాళ్ళు తగాదా ఆపేవారట! సింహాచలం ఒకసారి చాటునుండి విన్నాడట. బంగారు నగలపెట్టె ప్రసక్తి వచ్చిందట! అతడు తనకు యెందుకు వచ్చిన విషయం అని వూరుకున్నాడట."

"కనకారావుకు నగలపెట్టె ఇంకా దొరికి ఉండదు."

"యెలా చెప్పగలవు?"

"జయంతి యింకా దొరకలేదు కదా, ఇందాక మీ పోలీస్ స్టేషన్‌కి వెళ్ళే సార్జంటు చెప్పాడు."

"అంటే ఆ నగలపెట్టె ఆచూకీ కోసమే ఆమెను పీటర్ యెత్తుకు పోయాడంటావా?"

"అవును."

"రంగారావును హత్యచేసిన నాటి రాత్రే ఆమెనుండి పెట్టె రహస్యం లాగి ఉండవచ్చు కదా!"

"పీటర్‌కి నాలుగు కఠిన సంవత్సరాల శిక్ష తర్వాత జయంతి ఒంటిగా దొరికింది! పైగా అతడికి సహకరించిన వ్యక్తి, పెట్టె దొరకకపోతుందా అన్న అతి విశ్వాసం ప్రదర్శించి వుంటాడు!"

శిరీష్ ఆలోచనలో పడ్డాడు. జేబులోంచి కాగితం తీసి తదేకంగా చూస్తూ కూర్చున్నాడు.

# 13

సాయంకాలమవుతోంది.

డిటెక్టివ్ శిరిష్ ఓపికగా టాక్సీలో కూర్చున్నాడు. టాక్సీని రప్పించి నాలుగు గంటలయింది. టాక్సీ మొహం విశాఖపట్నంవైపు వుంది. శిరీష్ వెనక్కి చూడసాగాడు. దూరంనుండి ఏదో సైకిలు వస్తోంది.

శిరీష్ కళ్ళు మెరిశాయి.

కనకారావు సైకిలు త్రొక్కుకుంటూ వస్తున్నాడు.

తాను ఆశించినట్టుగాగాక డ్యూటీ ముగిశాక తాపీగా బయలుదేరాడు. శిరీష్ అతడినే దీక్షగా చూడసాగాడు.

కనకారావు ఇటూ యిటూ చూసుకుంటూ త్రొక్కుతో వస్తున్నాడు. అతడి సైకిలు టాక్సీని దాటింది. సైకిలును కనుచూపుమేర వరకూ వెళ్ళనిచ్చి డ్రైవర్‌ను సైగ చేశాడు శిరీష్.

శిరీష్ కూర్చున్న టాక్సీ బయలుదేరింది.

సైకిలు ప్రిన్స్ ప్రిన్సెస్ లాడ్జి ముందు ఆగింది. కనకారావు చుట్టూ చూసుకుంటూ లాడ్జి ఆవరణలోనికి సైకిలును నడిపించాడు, పార్కింగ్ ప్లేసులో సైకిలుకు స్టాండు వేశాడు.

కౌంటర్ ముందునుండి నడిచివెళ్ళి మెట్లు యెక్కాడు. 14వ నెంబర్ గదిముందు ఆగాడు. మునివ్రేళ్ళతో తలుపు తట్టాడు.

వరండా నిర్జనంగా వుంది.

తలుపు తెరుచుకుంది.

కనకారావు చప్పున లోపలికి గెంతాడు.

"లాభంలేదు కనకారావూ! జయంతికి బంగారం విషయం తెలియదు" అన్నాడు పీటర్, తలుపు దగ్గరగా

చేర వేసి.

అతడు నడుముకు అ స్తవ్యస్తంగా లుంగీ చుట్టు కున్నాడు.

"పీటర్! నీ వరస నాకు నచ్చలేదు. దాన్ని బతక నివ్వవా?" అడిగాడు కనకారావు.

పీటర్ చాచి లెంపకాయ కొట్టాడు.

"వాడు చచ్చినప్పటినుండి జయంతి నా పెళ్ళాం. అమర్యాదకరంగా మాట్లాడక!"

కనకారావుకు పెదిమ చిట్లించింది. రక్తం ఉప్పగా నాలుకకు తగిలింది.

"పీటర్! నీ యెత్తు నాకు తెలుసు!"

"ఏం తెలుసు?"

"జయంతిని సొంతం చేసుకుని, ఆ నగల పెట్టెను నీ సొంతం చేసుకోవాలని పథకంవేశావు" కనకారావు లోపలికి నడిచాడు.

అతని భుజం పట్టుకు ఆపాడు పీటర్.

"నిజం చెప్పాను. నమ్మకపోతే—మానుకో!"

"నేనూ పోలీసులకు నిజం చెప్పవలసివ స్తుంది!"

"నువ్వు బతికివుంటే?"

"ఆఁ!"

"నేను తెగించినవాడిని! వెలుగులో హత్యచేశాను. అందరికంటా పడ్డాను. అయినప్పటికీ నన్ను యిప్పటివరకూ ఎవడూ పట్టుకోలేకపోయాడు. నిన్ను చంపినా అంతే!"

కనకారావు భయంగా చూశాడు.

"పోనివ్వు. ఆ నగలపెట్టెలో సగం నగలు యివ్వు. చాలు!" అన్నాడు కనకారావు.

ఇద్దరూ జయంతి పడుకున్న బెడ్ ని సమీపించారు.

జయంతి మొహం పీక్కుపోయింది. జుత్తు రేగివుంది.

"జయా! నగలపెట్టె కోసం వచ్చాడు కనకారావు. ఎక్కడుందో రాయి!" పీటర్ ఆమెకు కాగితం కలం అందించాడు.

ఆమె ఏడుస్తోంది.

పీటర్ ఆమెను జుత్తు పట్టుకున్నాడు.

"త్వరగా చెప్పు జయంతీ! మనకోసం పోలీసులు కాలుకాలిన పిల్లుల్లాగా తిరుగుతున్నారు" అరిచాడు కనకారావు.

తలుపులు ఢ ఢాలున తెరచుకున్నాయి.

పోలీసులు లోపలకు వచ్చారు.

కనకారావునూ, పీటర్నూ భుజాల క్రింద చేతులువేసి పట్టుకున్నారు.

శిరీష్, కుమార్ గదిలోకి ప్రవేశించారు.

"చూడు జయంతీ! కనకారావు అనాధశరణాలయంలో నీతోబాటు పెరిగాడు కదూ!" అడిగాడు కుమార్.

జయంతి తలూపింది.

"పీటర్కీ నీకూ మధ్య జరిగిన అఘాయిత్యం గురించి కనకారావుకు తెలుసు. అందుకే అతడు పీటర్కు సహాకరించాలనుకున్నాడు. పీటర్కి అతడు స్నేహితుడు."

జయంతి కళ్ళు విప్పుకు వింటోంది.

పోలీసులు పీటర్కీ, కనకారావుకీ కలిపి సంకెళ్ళు వేశారు.

"సార్! వీడు—ఈ పీటర్ నగలపెట్టె అపహరించి.... నిజం సార్!" కనకారావు పిచ్చిగా మాట్లాడసాగాడు. మో చేతితో ఇన్స్పెక్టర్ కుమార్ అతడి డొక్కలో

ఖమ్మాడు.

కనకారావు కెవ్వుమన్నాడు.

"నగలపెట్టె మాకు దొరికింది! లెవెల్ క్రాసింగ్ కాబిన్‌లో పెద్ద చందువాపెట్టె అడుగున పెట్టాడు రంగారావు. అది భద్రంగా ఉన్నట్టు చూసుకోవడానికే అతడు రాత్రివేళ తరచు గేటు తణిఖీకి వెళ్ళేవాడు" అన్నాడు డిటెక్టివ్ శిరీష్.

కనకారావూ, పీటరూ మొహాలు చూసుకున్నారు.

— :ఐపోయింది: —

# పరశురాముడు

## వాణిశ్రీ

"మనం ఇంకా ఎన్నిరోజులు ఈ హోటల్లో వుండాలి?" విసుగ్గా అంది మాలతి.

"ఏం ఇక్కడ బాగాలేదా?" అన్నాడు మోహన్.

"ఎంతో హాయిగా ఉంది. గదిలోనే అన్ని సౌకర్యాలూ ఉన్నాయ్. బెల్ నొక్కితే కాఫీ, ఫలహారం, భోజనం రెక్కలు కట్టుకుని వాల్తాయి!"

"మరింకేం?"

"డబ్బు మంచినీళ్ళలా ఖర్చయిపోవడం లేదూ! ఇలా కొన్నాళ్ళు గడిస్తే మన గతి ఏమిటి?"

"మాలతీ! అనవసరమైన ఆలోచనలు పెట్టుకుని మనసు పాడుచేసుకోకు. ఇలా సుఖంగా గడిపే రోజులు మనకు మళ్ళీ రావు."

"సుఖం చూసుకుంటే మరి మన భవిష్యత్తు?"

"ఎలా రాసివుంటే అలా జరుగుతుంది."

"బాగుందండీ మీ వేదాంతం. మీ అత్తయ్య ఎవరో

ఈ ఊళ్ళో ఉందన్నారుగా? మీకు ఏదైనా ఉద్యోగం దొరికేదాకా వాళ్ళింట్లో ఉందాం! ఖర్చు తగ్గుతుంది కదా!" అంది మాలతి.

"నీకు మరీ జాగ్రత్త ఎక్కువ. సరే! నేను రాత్రి ఎనిమిదింటికి ఒక శేఠ్ గారిని కలవాల్సిన పని వుంది. వాళ్ళ ఫ్యాక్టరీలో ఉద్యోగం వస్తుందని నాకు నమ్మకం ఉంది. ఈ లోపల అత్తయ్యను ఇక్కడకు పంపిస్తాను. నువ్వు వాళ్ళింటికి వెళ్ళు. నేను సరాసరి అక్కడికే వస్తాను. రేపు హోటల్ గది ఖాళీచేద్దాం! ఓ.కే" అన్నాడు మోహన్.

"మీ అత్తయ్యను ఇక్కడికి పంపించడం బాగుంటుందా? నేనూ మీతో వస్తాను. నన్ను అక్కడ వదిలి మీరు వెళ్ళొచ్చును కదా!" అంది మాలతి.

"ఇప్పుడే ఏడు దాటింది. ఎనిమిదింటికి రమ్మని ఆ శేఠ్ చెప్పాడు. చెప్పిన టైమ్‌కి వెళ్ళకపోతే నాకు ఉద్యోగం ఇస్తాడా? నువ్వు లేనిపోని అనుమానాలు పెట్టుకోకు. నేను అత్తయ్యకు ఫోన్ చేసి చెప్తాను. కారులో వచ్చి నిన్ను తీసుకెళ్తుంది. ఓ.కే" అన్నాడు మోహన్.

"మీ అత్తయ్య వాళ్ళకి ఫోను, కారు ఉన్నాయా?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది మాలతి.

"వూం....మరేమనుకున్నావు....?" అంటూ మోహన్ ఆమెను దగ్గరకు తీసుకుని కౌగలించుకున్నాడు.

మాలతిని ముద్దుపెట్టుకుని వదిలి "కీస్ అత్తయ్యకి ఇవ్వు.... నేను వెళ్ళొస్తాను" అన్నాడు మోహన్.

మాలతి తల వూపింది.

మోహన్ తలుపు దగ్గరకు లాగి వెళ్ళిపోయాడు.

మాలతి బెడ్ మీద వాలింది.

మధురమైన వూహాలు మనసులో మెదిలాయి. బంగారు భవిష్యత్తు వూహించుకుంటూ కళ్ళుమూసుకుంది.

## 2

రాత్రి పది కావొచ్చింది.

హోటల్లో సందడి సద్దు మణిగింది.

మాలతి హోటల్ గదిలో కాలుకాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతోంది. కడుపులో ఎలుకలు పరిగెత్తు తున్నాయ్! ఆకలి దంచుతోంది. బాయ్ రెండు మూడు సార్లు వచ్చి అడిగివెళ్ళాడు "భోజనం తెమ్మంటారా?" అని. ఆమె సందిగ్ధావస్థలోపడింది. "భోజనం చెయ్యాలా వద్దా?" అని.

మోహన్ అత్తయ్య వచ్చి తనను వాళ్ళింటికి తీసుకెళ్తుందని చెప్పి వెళ్ళాడు. పది కావచ్చినా ఆమె ఇంకా రాలేదు. మోహన్ ఆమెకు ఫోన్ చేసి చెప్పాడా? లేదా? ఒక వేళ ఆమె ఇంట్లో లేదేమో? పోనీ మోహన్ అయినా రావచ్చుగదా? ఎందుకు రాలేదు.

మోహన్ అత్తయ్య కోసం ఆమె రెండు గంటల నుంచి నిరీక్షిస్తోంది! క్షణం....క్షణం....నిరీక్షణ!....పరమ బోర్!

మాలతికి మోహన్ మీద కోపం ముంచుకొచ్చింది.

తలుపు టక్....టక్ మని శబ్దం చేసింది.

ఎవరో తలుపు తడుతున్నారు.

మాలతి 'హమ్మయ్య' అనుకుంది. ఆమె ముఖంలోకి కళ వచ్చింది. మోహన్ వచ్చివుంటాడు. లేదా, అతని అత్తయ్య వచ్చివుంటుంది.

బోల్టు తీసి తలుపు తెరిచి నివ్వెరపోయి నిల్చుంది

పోయింది.

అతను నల్లగా, పొడుగ్గా ఉన్నాడు. రాగిరంగు జుట్టు భుజాలమీద పడుతోంది. మీసాలు గూడా రాగి రంగులో ఉన్నాయి. పిల్లి కళ్ళలో క్రూరత్వం కనిపిస్తోంది. గ్లాస్కో లాల్చీ, పైజామా వేసుకుని ఉన్నాడు.

"మీరేనా మాలతి గారంటే?" అన్నాడు ఆమెను ఎగాదిగా చూస్తూ.

"ఆఁ.... నేనే!....ఎవరు నువ్వు?" అంది మాలతి.

"మోహన్ బాబుగారి అత్తయ్య క్రింద కారులో ఉన్నారు. మిమ్మల్ని రమ్మన్నారు" అన్నాడు.

ఆమెకు సంతోషం కలిగింది. ఆమె కోసమేగదా రెండు గంటలనుంచి నిరీక్షిస్తోంది. ఇప్పటికైనా వచ్చింది. అంతే చాలన్నట్లు ఆమె గబగబా కిటికీ తలుపులు మూసింది. గదికి తాళంవేసి, హేండ్ బ్యాగ్ తీసుకుని అతనివెంట బయల్దేరింది.

అతను రోడ్డు ప్రక్కన నిల్చున్న ఆకుపచ్చ రంగు అంబాసిడర్ కారు దగ్గరికి మాలతిని తీసుకెళ్ళాడు. బ్యాక్ డోర్ తెరిచాడు. లోపల మోహన్ అత్తయ్య కూర్చుని వుందని ఆమె గ్రహించింది.

"నమస్తే!" అంది మాలతి.

ఆమె ప్రతి నమస్కారం చెయ్యలేదు.

"రా....రా....!" అంది నవ్వుతూ.

ఆమె నోరు ఎర్రగా కనిపించింది పెద్ద పులి నోరులా. పళ్ళు గారబట్టి అసహ్యంగా ఉన్నాయి. ఆమెకు దాదాపు ఏభై ఏళ్ళుండవచ్చు. మనిషి నల్లగా తారుడబ్బాలా వుంది. అంగుళం మందాన మేకప్ మాత్రం కొట్టుకుంది. ఆమె కళ్ళు గూడా ఎర్రగా డేంజర్ లైట్లలా వెలుగు

తున్నాయి. లావుపాటి శరీరానికి పల్చటి నైలెక్స్ చీర కట్టుకుంది. ఆమె చవకబారు మనిషిలా కనిపించింది మాలతికి.

ఒక్క క్షణం అలాగే నిలబడి పోయింది. మోహన్ అత్త ఇలా వుందేమిటి? అనే అనుమానం కలిగింది.

"రా....నిలబడి పోయావేంటి?" అంది ఆమె మొరటుగా.

మాలతి కారులో కూర్చుంది.

అతను డోర్ వేశాడు.

డ్రైవర్ మాలతిని తినేటట్లు చూస్తుంటే ఆమెకు కంపరం ఎత్తుతోంది.

అతను ఫ్రంట్ సీట్లో కూర్చుని డోర్ వేసి "ఏందిరా వెర్రినాకొడకా అట్టా ఎగాదిగా చూస్తావేంటి! పోనియ్!" అన్నాడు.

డ్రైవర్ తేరుకుని కారు స్టార్టు చేశాడు.

"ఏంటి నీ పేరు?" నవ్వుతూ అంది.

మాలతికి కంపరం యెత్తుతోంది ఆమెను చూస్తుంటే. ఆమె ప్రవర్తన చిరాకు కలిగిస్తోంది.

"మాలతి."

"నా పేరు దుర్గమ్మ. మీ ఆయన నా అల్లుడు" అంది పకపకా నవ్వుతూ.

డ్రైవర్, అతని ప్రక్కన కూర్చున్న పొడుగాటివాడు గుసగుసలాడుకుంటూ, అప్పుడప్పుడూ వెనక్కి తిరిగి తనని చూసి నవ్వుకోవడం చూసి మాలతికి వళ్ళు మండుకు పోతోంది.

యజమానురాలు ఉండగానే డ్రైవరు నౌకరు అంత విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నారేమిటి? ఈవిడ అంటే

వాళ్ళకి గౌరవం ఉన్నట్లులేదు.

"ఏంటమ్మాయ్! ఏదైనా చెప్పు? మోహనూ నువ్వూ తిరపతిలో పెళ్ళి చేసుకున్నారంటగా! ఆడు చెప్పాడులే!"

"అవునండీ!" అంది మాలతి.

"మంచి అందగాడినే పట్టావ్!" అంది దుర్గమ్మ వెకిలిగా నవ్వుతూ.

'ఛీ....ఇదేం మనిషి? బొత్తిగా సభ్యతలేకుండా మాట్లాడుతుందేం?' అనుకుంది మాలతి.

మాలతి తలవంచుకుని ఆలోచిస్తూ సీటులో వున్న కాగితం ప్యాకెట్ వంక చూసింది. మాలతి దానివంక తదేకంగా చూడ్డం గమనించి దుర్గమ్మ "తింటావా? ద్రాక్షకాయలు" అంటూ ప్యాకెట్ విప్పింది.

"వద్దు...." అంది మాలతి అయిష్టంగా.

"ఫర్వాలేదులే తిను" అంటూ ఒక ద్రాక్ష గుత్తి పేపరులో పెట్టి ఇచ్చింది దుర్గమ్మ.

మాలతికి తిన బుద్ధి కాలేదు. ద్రాక్ష గుత్తి ప్రక్కన పెట్టి పేపరుముక్క చేతిలోకి తీసుకుని, మసక కాంతిలో చదువుతూ కూర్చుంది. అది యెప్పటిదో పాత పేపరు. అందులో బాక్సు కట్టిన ఒక వార్త ఆమెకు ఆసక్తి కలిగించింది.

'ఢిల్లీ నగరంలో ఇద్దరు యువతులను ఉద్యోగం ఇప్పిస్తామని మోసంచేసి వాళ్ళని తీసుకొచ్చి వ్యభిచార గృహానికి అమ్మివేశారు. ఇంత చేస్తే వాళ్ళు ఆ యువతులకు బంధువులే. చివరకు పోలీసులు వాళ్ళకి విముక్తి కలిగించారు. కాబట్టి ఈ రోజుల్లో బంధువుల్ని కూడా నమ్మకూడదన్న మాట!' అంటూ రాశాడు న్యూస్

విలేఖరి.

మాలతి మనసులో ఒక మెరుపు మెరిసింది. దుర్గమ్మని, ఆమె బంటునీ, డ్రైవర్‌నీ మార్చి, మార్చి చూసింది. తను మోహాన్ని గుడ్డిగా నమ్మి వచ్చింది. ఒకవేళ అతను తనను మోసం చెయ్యలేదుగదా! తనను ఈ దుర్గమ్మకు అమ్మివేశాడా కొంపతీసి. దుర్గమ్మ సంసార స్త్రీలాలేదు.

ఏం చేయాలి ఇప్పుడు? తను సాలెగూటిలోకి పోవడం లేదు గదా!

మాలతి భయంతో వణికిపోయింది.

కారు వేగంగా పోతోంది మెయిన్ రోడ్డుమీద.

తను కేకలు పెడితే?

లాభంలేదు. ఈ దుర్గమ్మ తన నోరు నొక్కేస్తుంది.

తను తప్పుకోవడం ఎలా?

"అరె.... రె....!" అంది మాలతి గట్టిగా.

"ఏంటి?" అంది దుర్గమ్మ.

"నా నెక్లెస్!" నాలిక కరుచుకుంది మాలతి.

"ఏమైంది? పోయిందా?"

"లేదు. సూట్ కేసులో మర్చిపోయాను. కారు హోటల్ దగ్గరకి త్రిప్పండి."

దుర్గమ్మ కళ్లు మెరిశాయి.

"సూరీ! బండితిప్పరా!" అంది.

కారు వెనక్కి త్రిప్పి హోటల్ దగ్గరికి పోనిచ్చాడు డ్రైవర్.

మాలతి కారు దిగి హోటల్లోకి పరిగెత్తుతున్నట్లుగా వెళ్ళింది.

దుర్గమ్మ సైగ అర్థంచేసుకుని ఆమె బంటు కోటయ్య మాలతిని అనుసరించాడు.

తనను నల్లటి పొడుగాటి వాడు వెంబడించినట్లు గ్రహించింది మాలతి. ఆమె అనుమానం నిజమైంది. మోహన్ తనని మోసంచేశాడు. దుర్గమ్మ దగ్గర డబ్బు తీసుకుని తనను అమ్మివేశాడు. మాలతి శరవేగంతో మేడ మెట్లు ఎక్కింది. ఆమె వుంటున్న గది మూడో అంతస్థులో వుంది.

మాలతి రొప్పుతుంటూ తాళంతీసి లోపలకు ప్రవేశించే లోపల కోటయ్యా రానేవచ్చాడు. మాలతి వెంట గదిలోకి వచ్చేశాడు.

"బైటనుంచో!" అంది మాలతి దబాయిస్తూ.

కోటయ్య మాట్లాడలేదు. వికటంగా నవ్వాడు.

"ఏమిటి అట్లా నవ్వుతావు?"

"తొందరగా నడువు" అన్నాడు.

"ఎక్కడికి?"

"మీ అత్తగారింటికి!" అని నవ్వాడు.

"నేను రానిప్పుడు. ఆయన వచ్చాక వస్తాను."

"ఆయన ఇక రాడు."

"ఎందుకు రాడు?"

"నిన్ను మాకు అమ్మేశాడు."

మాలతికి కళ్ళు తిరిగినట్లయింది.

ఆమె మనసులో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి. వీడు తనను బలవంతంగానైనా ఎత్తుకుని వెళ్తాడు అనుకుంది. వాడికి చిక్కకూడదు. ఏంచెయ్యాలి?

ఆమె కళ్ళకు కిటికీలోంచి డ్రైనేజి గొట్టం కనిపిస్తోంది. మాలతి ధైర్యం తెచ్చుకుంది. కిటికీ తీసి గొట్టాన్ని పట్టుకుంది. ఒక్క నిమిషం వుంటే గొట్టం ద్వారా క్రిందకు జారివుండేది.

కాని కోటయ్య వూరుకోలేదు. ఆమె చెయ్యి అందు కున్నాడు. ఆమె ఒకచేత్తో గొట్టాన్ని పట్టుకుంది. కోటయ్యని విడిపించుకోవడానికి పెనుగులాడింది.

పెనుగులాటలో ఆమె జారిపోయింది. దభీమని మూడో అంతస్తునుంచి పడిపోయింది మాలతి.

కోటయ్య క్రిందకు పరుగుతీశాడు.

మాలతి మేడపైనుంచి క్రిందపడటం చూసిన దుర్గమ్మ కోటయ్య రాకుండానే కారులో వెళ్ళిపోయింది.

రక్తపు మడుగులోపడి కొట్టుకుంటున్న మాలతిచుట్టూ జనం చేరారు.

తను మేడ దిగేసరికి అక్కడ కారు లేకపోవడం చూసి కోటయ్య నెమ్మదిగా హోటల్‌లోంచి జారు కున్నాడు.

## 3

రాత్రి పన్నెండింటికి పోలీస్ వ్యాన్ హోటల్ సురేఖ ముందు ఆగింది.

ఇన్స్‌పెక్టర్ కృష్ణమూర్తి వ్యాన్ దిగాడు.

హోటల్ మేనేజర్ ఎదురు వచ్చి విష్ చేశాడు.

"ఆమెకు ఎలా వుంది సార్?" అన్నాడు.

ఇన్స్‌పెక్టర్ పెదవి విరిచి "దారిలోనే పోయింది. డెడ్‌బాడీ పోస్టుమార్టమ్ చెయ్యడానికి హాస్పిటల్లోనే వదిలి వచ్చాను" అన్నాడు.

"పాపం...." అన్నాడు మేనేజర్.

"యఫ్. ఐ. ఆర్. పంపించాలి. పదండి మీరు స్టేట్ మెంట్ ఇద్దురుగాని" అన్నాడు.

ఇద్దరూ ఆఫీసు రూమ్‌లోకి వెళ్ళారు.

విజిటర్స్ రిజిష్టర్ తెచ్చి ఇన్స్‌పెక్టర్ ముందు

వుంచాడు మేనేజర్.

"వారంనుంచి ఉంటున్నారన్నమాట" అన్నాడు ఇన్స్పెక్టర్.

తల వూపాడు మేనేజర్.

"అయితే మోహన్ అనే అతను ఇప్పటి వరకూ రాలేదు గదా!"

"అవును సార్!"

"అతన్ని ఇంతకుముందు ఎప్పుడైనా చూశారా?"

"లేదు సార్!"

"ఇంకేం చెప్తారు ఈ సంఘటన గురించి?"

"నాకు ఏమీ అర్థం కావడంలేదు సార్! ఈ సంఘటన జరిగిన తర్వాత నల్లగా పొడుగ్గా వున్న వాడొకడు హడావుడిగా పోతూ వుండడం మా బాయ్ చూశానని చెప్పాడు."

"అంటే ఎవరో ఆమెను పైనుంచి నెట్టివేశారని మీరు అనుకుంటున్నారా?"

"అవును. లేకపోతే ఆమె అక్కడ్నుంచి క్రింద పడాల్సిన పని ఏమిటి?"

"ఆత్మహత్య కాగూడదా?"

మేనేజర్ ఆలోచనలో పడ్డాడు.

"నేను అలా అనుకోవడంలేదు."

"ఏం? ఎందుకని?"

"జనరల్‌గా ఆడవాళ్ళు అలా చెయ్యరు. ఉరిపెట్టుకోవడమో, కిరసనాయిలు వంటిమీద పోసుకుని కాల్చుకోవడమో చేస్తుంటారు."

"వూఁ...."

"వాళ్ళిద్దరూ క్రొత్తగా పెళ్ళయిన వాళ్ళలా కని

పించారు. పెద్దవాళ్ళకి ఇష్టంలేకుండా చేసుకునివుండొచ్చు. కుర్రాడి తరఫు వాళ్ళు ఆమెపై పగపట్టి ఈ ఘాతుకానికి తలపడ్డారేమో?"

"కావచ్చు."

"ఆ మోహాన్ని గూడా బలవంతంగా ఇంటికి తీసికెళ్ళిపోయారేమో?"

"ఈ సంఘటన మీరు చూశారా? ఐమీన్ మీరు అప్పుడు అక్కడున్నారా అని...." అన్నాడు ఇన్స్పెక్టర్.

"నేను ఇక్కడే ఉన్నాను. మా బాయ్ ఒకడు వచ్చి చెప్పాక వెళ్ళాను. అదీగాక అది బిల్డింగ్ వెనుక ప్రక్క కావటాన ఎవరూ చూళ్లేదు."

"ఐ....సీ....నల్లగా పొడుగ్గా ఉన్న వాడిని మీ బాయ్ చూశాడన్నారు గదా!"

"అవును."

"మరి అతన్ని మీ రిసెప్షనిస్టు చూశ్ళేదా?"

"ఏమో సార్! నేను అతన్ని అడగలేదు."

"ఉన్నాడా అతను."

"ఉన్నాడు" అని బెల్ నొక్కాడు మేనేజర్.

బాయ్ వచ్చాక రిసెప్షన్ కుమార్‌ని పిలిపించాడు మేనేజర్. తెల్లటి దుస్తుల్లో టక్ చేసుకుని కళ్ళద్దాలు పెట్టుకున్న యువకుడు లోపలకు వచ్చి విష్ చేశాడు.

"మీరేనా రిసెప్షన్‌లో వుంది."

తల వూపాడు కుమార్.

"మాలతి మేడపైనుంచి పడ్డ తర్వాత పొడుగ్గా నల్లగా వున్న వాడొకడు హడావుడిగా బైటకు వెళ్ళి

పోయాడని మీ బాయ్ చెప్పాడు. అతన్ని మీరు చూశ్శేదా?"

"మాలతి మొదట అతనితో పాటే కారులో ఎక్కడికో వెళ్ళింది. పదినిమిషాల తర్వాత కారులో వచ్చి దిగింది. మాలతి పైకి వెళ్ళిన తర్వాత అతనూ పైకి వెళ్ళాడు. కాసేపటికి ఇది జరిగింది."

"హ్రూం .... తర్వాత. అతను వెళ్ళిపోవడం మీరు చూశ్శేదా?"

"లేదు. ఆమె క్రిందపడడం ఒక బాయ్ చూసి పెద్దగా కేక పెట్టాడు. నేనా కేక విని హడావుడిగా వెళ్ళిపోయాను."

"అతను ఎలా ఉంటాడు?"

"నల్లగా, పొడుగ్గా ఉన్నాడు. లాల్చీ, పైజామా వేసుకున్నాడు. అతని జుట్టు రాగి రంగులోవుంది. అతనివి పిల్లికళ్ళు" అన్నాడు కుమార్.

"ఆ కారులో ఇంకెవరైనా ఉన్నారా?"

"కారు బ్యాక్ సైడ్‌లో నిలబడి ఉంది. లోపల ఎవరో ఉన్నట్లే ఉన్నారు. తలమాత్రం చూశాను."

"కారు ఏ రంగులో ఉంది?"

"ఆకుపచ్చ రంగులో ఉంది."

"నెంబరు గుర్తుందా?"

"యమ్. వై. యస్. నూటపదకొండు."

"బాగా గుర్తుపెట్టుకున్నారే!"

"ఆ కారు రెండుసార్లు రావడంతో గుర్తుంది" అన్నాడు కుమార్.

"ఆ తర్వాత కారు ఎప్పుడు వెళ్ళిపోయిందో మీరు గమనించారా?"

"బాయ్ కేక వినిపించగానే నేను కౌంటర్ వదిలి వెళ్ళిపోయాను. ఆ కారు ఎప్పుడు వెళ్ళిపోయిందో నేను చూళ్ళేదు" అన్నాడు కుమార్.

ఇన్స్పెక్టర్ మేడపైకి వెళ్ళి రూమ్ నెంబర్ నూట పదమూడు తాళం తీయించాడు.

మాలతి భర్త తాలూకు ఒక లుంగీ బనీను, కట్ డ్రాయర్ మాత్రం స్టాండ్ మీద ఉన్నాయి. సూట్ కేసు తీసేవుంది. అందులో ఒక జత బట్టలు మాత్రమే ఉన్నాయి. వాటిమీద టైలర్ లేబుల్స్ లేనేలేవు. మాలతి చీరలు, బ్లౌజులు వగైరా ఉన్నాయి.

సూట్ కేస్ అడుగున ఒక కార్డు కనిపించింది. అది అమలాపురంలో పోస్టు చేసింది. ఫ్రమ్ అడ్రస్ లేదు. అమలాపురం అని మాత్రమే వుంది. వెంకట్రామయ్యగారికి అని సంబోధించి ఉత్తరం రాశాడు రాజశేఖరం అనే ఆయన. మే నెలలో ముహూర్తం నిశ్చయించి తెలియ పరచమని అందులో సారాంశం. టూ అడ్రస్ వెంకట్రామయ్యది. కేరాఫ్ సీతారామస్వామి, ప్లీడర్, రాజమండ్రి.

ఆ పోస్టుకార్డు డైరీలో పెట్టుకున్నాడు. అక్కడున్న బాయ్ని ప్రశ్నించాడు. పనికి వచ్చే సమాచారం వేరే ఏదీ రాలేదు. ఆ పూట మాలతి భోజనం చెయ్యలేదని మాత్రం చెప్పాడు బాయ్.

రూమ్కి సీలు వేయించి మళ్ళీ వస్తానని అక్కడ్నుంచి బయల్దేరి వెళ్ళాడు ఇన్స్పెక్టర్.

## 4

మార్చురీలో ఉన్న మాలతి శవాన్ని చూసి బావురు మన్నాడు వెంకట్రామయ్య.

వెంకట్రామయ్య తేరుకున్నాక మాలతి గురించి చెప్పాడు.

మాలతి వెంకట్రామయ్య మూడో కూతురు. ఇద్దరికి పెళ్ళిళ్ళు చేశాడు. అతనికి సుందర్రావు అని ఒక్కడే కొడుకు. మాలతి పెళ్ళి రాజశేఖర్ అనే టీచర్‌తో నిశ్చయమైంది. కాని అతనికిది రెండో పెళ్ళి. నలభై ఏళ్ళుంటాయి అతనికి. ఇద్దరు పిల్లలు. అంగకంటే మంచి సంబంధం తీసుకురాలేక మాలతిని రాజశేఖరానికిచ్చి పెళ్ళిచెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

మాలతికి ఈ సంబంధం ఇష్టంలేదు. పదిహేనురోజుల క్రితం తను ప్రేమించిన మనిషితో వెళ్ళిపోతున్నాననీ, తనకోసం అనవసరంగా వెతకవద్దనీ ఉత్తరం రాసి వెళ్ళిపోయింది మాలతి.

ఇప్పుడు పోలీసులు మెసేజ్ ఇచ్చేవరకూ తనకు మాలతి సమాచారం తెలియలేదు. మోహన్ అనే వాడెవడో తనెప్పుడూ చూళ్ళేదు.

"మాలతి ఇంట్లోనుంచి వెళ్ళిపోయినప్పుడు ఆమె వంటిమీద నగలు ఏమైనా ఉన్నాయా?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"మెళ్ళో ఒంటిపేట గొలుసు. రెండు జతల గాజులు. చెవులకు దుద్దులు ఉన్నాయి."

"ఆమె మెడలో ఉన్న మంగళసూత్రం గూడా రోల్డుగోల్డుదే. బంగారు గాజులు, గొలుసు లేనేలేవు. చెవులకు దుద్దులు మాత్రం ఉన్నాయి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మోహన్ అనే అతను మీ అమ్మాయిని వారంరోజుల్నుంచి హోటల్లో వుంచాడు. తను భార్యతో వచ్చానని విజిటర్స్ రిజిష్టర్లో రాశాడు. తను విశాఖపట్నం నుంచి

వచ్చానని ఏదో అడ్రస్ ఇచ్చాడు. ఆ అడ్రస్‌లో అతను లేడని మాకు సమాచారం వచ్చింది. బహుశా అది తప్పుడు అడ్రస్ కావచ్చు ననుకుంటున్నారు" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

వెంకట్రామయ్య విచారంగా కూర్చున్నాడు.

"వాడెవడో నా తల్లిని మోసం చేశాడు" అన్నాడు వెంకట్రామయ్య ఏడుస్తూ.

ఇనస్పెక్టర్ అతన్ని ఓదార్చి శవాన్ని రాజమండ్రి తీసుకువెళ్ళే ఏర్పాటు చేశాడు.

## 5

"హలో...." అన్నాడు ఇనస్పెక్టర్ కృష్ణమూర్తి రిసీవర్ ఎత్తి.

"సార్! నేను శ్రీఫార్టీవన్‌ని మాట్లాడుతున్నాను."

"చెప్పు!"

"సార్! నూట పదకొండో నెంబరు కారు దొరికింది."

"ఎక్కడ?"

"హమీద్ షెడ్‌లో వుంది సార్!"

"ఎక్కడ ఆ షెడ్?"

"శ్రీదేవి టాకీస్ ప్రక్కసందులో సార్!"

"నువ్వు శ్రీదేవి దగ్గర వుండు. నేను ఇప్పుడే వస్తున్నాను" అని రిసీవర్ క్రెడిల్ చేసి బయలుదేరాడు.

శ్రీదేవి దగ్గర కానిస్టేబుల్ ఇన్స్‌పెక్టర్ కోసం ఎదురు చూస్తూ వున్నాడు. పోలీస్ జీవ్ రాగానే వచ్చి సెల్యూట్ చేశాడు.

షెడ్ దగ్గరికి వెళ్ళేసరికి హమీద్ "సలాం సాబ్!" అన్నాడు జీవ్ దగ్గరికి వచ్చి.

ఇనస్పెక్టర్ జీవ్ దిగి షెడ్‌లోకి వెళ్ళాడు. కానిస్టేబుల్

చెప్పింది నిజమే. ఆకుపచ్చ రంగు అంబాసిడర్ కారు అక్కడ వుంది. యమ్.యస్.వై. నూటపదకొండు దాని నెంబర్.

"ఈ కారు ఎవరిది?"

"డాక్టర్ బసవరాజుగారిది సాబ్!"

"రిపేరు కొచ్చిందా?"

"హలా సాబ్!"

"ఎన్నాళ్ళ నుంచి నీ దగ్గర వుంది?"

"వారం నుంచి సాబ్!"

"ఏమిటీ వారం నుంచా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు ఇనస్పెక్టర్.

"హలా సాబ్!" అన్నాడు హమీదు.

"సరిగా చెప్పు."

హమీదు పుస్తకం తెచ్చి చూపించాడు. డాక్టర్ బసవరాజుగారు రీబోర్ చెయ్యమని తన షెడ్ కి పంపించిన రికారు అది.

"అయితే మూడు రోజుల క్రితం అంటే పదిహేడు రాత్రి ఈ బండి వూళ్ళో తిరిగింది. ఎవరు డ్రైవ్ చేశారు?"

హమీదు ఆశ్చర్యపడ్డాడు.

"ఆ రోజు నేను వూళ్ళో లేను సాబ్! నాకు తెలియకుండా ఎవరూ బండి తీసికెళ్ళరు" అన్నాడు.

"ఎవరో తీసికెళ్ళారు. ఆ రోజు రాత్రి పదిగంటల ప్రాంతంలో హోటల్ సురేఖ దగ్గరుంటే ఈ బండిని చూసిన వాళ్ళున్నారు. ఆ రోజు హోటల్ మూడో అంతస్తు నుంచి క్రిందపడి చనిపోయిన మాలతి అనే అమ్మాయి ఈ బండిలోనే అక్కడికి వచ్చింది" అన్నాడు ఇనస్పెక్టర్.

హమీద్ బిగుసుకుపోయాడు.

"సాబ్! నిజమేనా?"

"నిజమే!"

హమీద్ షెడ్‌లోకి వెళ్ళి "జహాంగీర్! ..." అని కేక పెట్టాడు.

"అయా!...." అంటూ ఒక కుర్రవాడు వచ్చాడు.

ఆ రోజు బండిని తీసికెళ్ళింది ఎవరు? అని వుర్దూలో అడిగాడు జహాంగీర్‌ని. జహాంగీర్ ముందు లేదన్నాడు. హమీద్ చెంపమీద గట్టిగా రెండిచ్చుకునేసరికి నిజం చెప్పాడు. జహాంగీర్ హమీద్ కొడుకే. ఇరవై ఏళ్ళుంటాయి అతనికి. ఆ రోజు రాత్రి తొమ్మిదింటికి సూరిగాడు బండి తీసికెళ్ళాడని జహాంగీర్ చెప్పాడు.

హమీదు ఇనస్పెక్టర్ చెప్పింది నిజమేననీ, తను వూళ్ళో లేనప్పుడు సూరిగాడనే కుర్రమెకానిక్ ఆ బండి తీసికెళ్ళి వూళ్ళో త్రిప్పాడని చెప్పాడు.

అప్పటికి చీకటి పడింది.

"ఎక్కడుంటాడు సూరిగాడు?"

"ఇంతకు ముందే వెళ్ళాడు."

"అయితే ఇల్లు తెలుసా?"

"కుర్రాళ్ళకి తెలుస్తుంది సార్! ఇప్పుడు యెవరూ లేరు."

"రేపు వస్తాడా?"

"ఆఁ....వస్తాడు."

"రేపు ఆ కుర్రాడు రాగానే నా దగ్గరకు తీసుకు రావాలి" అన్నాడు ఇనస్పెక్టర్.

"అచ్చా సాబ్!" అంటూ సలాం చేశాడు హమీదు.

# 6

కాకీ బట్టలు. బట్టలమీద ఆయిల్ మరకలు. చూసే వాళ్ళకి అతను మోటారు కార్ల మెకానిక్ అని తెల్సి పోతుంది. నెత్తిమీద వెంట్రుకలు అరంగుళం మందాన వున్నాయి. నెల క్రితమే ఏ తిరుపతో వెళ్ళి గుండు కొట్టించుకుని వచ్చి వుంటాడు.

"నీ పేరేనా నూరి అంటే."

"అవును సార్!" అన్నాడు నూరి.

మనిషి యెందుకో భయపడుతూ వున్నాడు.

"హోటల్ సురేఖ మేడపై నుంచి క్రిందపడి చచ్చి పోయిన అమ్మాయి నీకు తెలుసా?" ప్రశ్నించాడు ఇనస్పెక్టర్ కృష్ణమూర్తి.

"నాకు తెలీదు సార్!"

ఇనస్పెక్టర్ దగ్గరికొచ్చి లాగి గూబ అదిరేటట్టు కొట్టాడు.

"సరిగా చెప్పు!....నిజం చెప్పు! అబద్ధం చెప్పావంటే నిన్ను ఆ కేసులో ఇరికించి పదేళ్ళు జైలుశిక్ష వేయిస్తాను" కోపంతో అన్నాడు ఇనస్పెక్టర్.

హమీదు దూరంగా నిల్చున్నాడు విచిత్రంగా చూస్తూ.

నూరి బెదిరిపోయినట్లున్నాడు.

"సార్!....నన్ను కొట్టకండి. అంతా చెప్తాను" అన్నాడు ఇనస్పెక్టర్ కాళ్ళు పట్టుకుని.

"లే....ముందు. జరిగింది జరిగినట్లు చెప్పు! ఏం జరిగిందో నాకు బాగా తెల్సు. అబద్ధం చెప్పావా? మక్కెలిరుగుతాయి!...." అంటూ నూరిని బాగా బెదరేటట్లు కేకలు పెట్టాడు.

"బండి తీసికెళ్ళింది నిజమే సార్!" అంటూ నూరి హామీదు వంక బెదురుగా చూశాడు.

హామీదు ముందు అదంతా చెప్పడానికి సిగ్గుపడుతున్నాడని ఇనస్పెక్టర్‌కి అర్థమైంది. హామీదుని వెళ్ళిపొమ్మని సైగచేశాడు.

"హూఁ.... ఇప్పుడు చెప్పు" అన్నాడు.

"హామీదు సాబ్ ఆ రోజు వూరికెళ్ళాడు సార్. ఏడింటికల్లా షెడ్‌కి తాళంవేసేసి జహాంగీరు నేనూ దుర్గమ్మ కంపెనీకి వెళ్ళాం సార్!"

"జహాంగీరు యెవరు?"

"మా యజమాని కొడుకు."

"తర్వాత."

"దుర్గమ్మకి అర్జెంటుగా కారు కావాల్సి వచ్చింది. ఎక్కడా టాక్సీ దొరకలేదు. మేం వెళ్ళేసరికి అర్జెంటుగా ఏదైనా కారు కావాలనీ అరగంటలో తిరిగి రావచ్చనీ కారు తెస్తే ఆ రాత్రికి ఇద్దరు పిల్లల్ని డబ్బు తీసుకోకుండా పంపుతానని ఆశ పెట్టింది."

"దుర్గమ్మ నీకు బాగా తెలుసా?"

"తెలుసు సార్!"

"హూఁ.... కానీ."

"జహాంగీరు అంబాసిడర్ కారు వుందని దుర్గమ్మకి చెప్పాడు. దుర్గమ్మ కారు తీసుకురమ్మని నన్ను బ్రతిమలాడింది. ఇక కాదనలేక నేను షెడ్‌కి వచ్చి కారు తీసుకెళ్ళాను. దుర్గమ్మ, కోటయ్య కార్లో ఎక్కారు. సురేఖ హోటల్ దగ్గరికి వెళ్ళమన్నారు. దార్లో పెట్రోలు అయిపోయి బండి ఆగిపోయింది. దుర్గమ్మ బండిదిగి ద్రాక్షపళ్ళు కొంది. నేను డబ్బా తీసుకెళ్ళి ఐదు లీటర్ల పెట్రోలు

పోయించుకొచ్చాను."

"డబ్బు ఎవరిచ్చారు?"

"దుర్గమ్మే ఇచ్చింది."

"తర్వాత."

"కారు సురేఖ హోటల్‌కి తీసుకెళ్ళాను. దుర్గమ్మ కోటయ్యను నూట పదమూడు నెంబరు గదికి వెళ్ళి మోహన్ అత్తయ్య రమ్మంటుందని చెప్పింది."

"ఊఁ...."

"కోటయ్య మాలతిని పిల్చుకుని వచ్చాడు. కారు దుర్గమ్మ ఇంటికి పోనివ్వమని అంది. సగం దూరం వచ్చాక ఆ అమ్మాయి హోటల్ గదిలో నెక్లెస్ మర్చిపోయానని బండి వెనక్కి పోనివ్వమంది. బండి వెనక్కి త్రిప్పి హోటల్ దగ్గరికి తీసుకెళ్ళాను. ఆ అమ్మాయి బండి దిగి హడావుడిగా హోటల్లోకి వెళ్ళింది. దుర్గమ్మ కోటయ్యను కూడా వెంట వెళ్ళమని సైగ చేసింది.

కోటయ్య ఎంతసేపటికీ రాలేదు. తర్వాత ఎవరో అమ్మాయి పైనుంచి క్రింద పడిపోయిందని అంతా గోలగా హోటల్ వెనక్కి వెళ్తుంటే దుర్గమ్మ భయపడిపోయి కారు పోనివ్వమని తొందర చేసింది. కోటయ్య రాడా అంటే, వాడు తర్వాత వస్తాడులే అంది. నేను దుర్గమ్మను దించేసి కారు షెడ్‌లో పెట్టేశాను."

"తర్వాత నువ్వు దుర్గమ్మ ఇంటికి వెళ్ళావా?"

"వెళ్ళాను"

"అక్కడికి కోటయ్య వచ్చాడా?"

"వచ్చాడు."

"వచ్చి ఏం చెప్పాడు?"

"మాలతి రానని మొండికెత్తిందట. తను బలవంతం

చేసేసరికి డ్రైనేజి గొట్టం నుంచి దిగాలని కిటికీలోనుంచి అవతలకి దిగిందట. తను పట్టుకున్నాడట. ఆమె గింజుకుని పట్టుతప్పి పడిపోయిందట. తను భయపడి పారిపోయి వచ్చాడట. కారు ఎక్కడా కన్పించకపోయేసరికి రిక్షాలో వచ్చానని చెప్పాడు."

"తర్వాత?"

"కోటయ్య దుర్గమ్మమీద పోట్లాడాడు."

"ఎందుకు?"

"తనని వదిలి వచ్చేసినందుకు."

"బాగా పోట్లాడుకున్నారా?"

"ఆఁ....కోటయ్య వచ్చేటప్పుడే సారాయి తాగి వచ్చాడు. దుర్గమ్మ స్వార్థపరురాలనీ, తనను పోలీసులు పట్టుకుని వుంటే చచ్చివుండేవాడిననీ నానా మాటలూ అన్నాడు. అప్పుడప్పుడూ బూతులు తిట్టాడు. దుర్గమ్మ వాడికి నచ్చజెప్పింది."

"ఇప్పుడు చెప్పిందంతా కాగితంమీద రాసివ్వు" అన్నాడు ఇనస్పెక్టర్, తెల్లకాగితం, కలం ముందుకు నెట్టి.

## 7

దుర్గమ్మ ఇంటిమీద రైడ్ జరిగింది. కోటయ్య దొరకలేదు. దుర్గమ్మని అరెస్టుచేసి లాకప్‌లో పడేశారు.

మోహన్ అనేవాడు తన దగ్గర రెండువేలు తీసుకుని మాలతిని అమ్మాడని దుర్గమ్మ ఒప్పుకుంది. మాలతి హోటల్లోవుందనీ, తన మేనత్తనని చెప్పి ఇంటికి తీసుకొచ్చి వృత్తిలోకి దించుకోమని తనకి సలహా ఇచ్చాడనీ, ఆ ప్రయత్నంలోనే మాలతి నిజం గ్రహించి వెనక్కి వెళ్ళిపోయిందనీ ఆమె మేడపైనుంచి పడిపోయి చనిపోవడానికి తన ప్రమేయం ఏమీలేదనీ చెప్పుకొచ్చింది దుర్గమ్మ.

మాలతిని మోసంచేసి పెళ్ళిచేసుకుని వ్యభిచార గృహానికి అమ్మేసిన నేరానికి మోహన్ మీద, కొన్న నేరానికి దుర్గమ్మ మీద, దుర్గమ్మకి సహకరించి మాలతి మరణానికి కారకుడైన కోటయ్య మీద కేసు పెట్టారు పోలీసులు.

మోహన్, కోటయ్యలు పరారీలో ఉన్నారు. దుర్గమ్మ మాత్రం కేసులో ఇరుక్కుని కటకటాలు లెక్కపెడుతూ కూర్చుంది.

దుర్గమ్మకి ఒక్కడే కొడుకు. అతని పేరు చంద్రం. అతను వేరే ఉంటున్నాడు. తల్లికీ అతనికీ సంబంధం లేదు. తల్లికోసం ఎప్పుడూ రాడు కూడా. చంద్రం చదువుకున్నాడు. మున్సిపాల్టీలో ఉద్యోగం చేస్తున్నాడు.

తన తల్లిని అరెస్టుచేసి జైల్లో వేశారనే సంగతి పేపర్లో చూశాడు. చూసికూడా తెలియనట్లు ఊరుకున్నాడు.

తను జైల్లో ఉన్నట్లు తన కొడుక్కి తెలియదని దుర్గమ్మ అనుకుంది. ఈ సంగతి కొడుక్కి తెలియ జెయ్యమని ఇన్స్పెక్టర్ని బ్రతిమాలింది. ఇన్స్పెక్టర్ చంద్రానికి ఫోన్ చేసి చెప్పాడు.

చంద్రం వచ్చి తల్లిని చూశాడు. అతను ఏమీ మాట్లాడలేదు. అతను సంఘంలో గౌరవంగా జీవిస్తున్నాడు. ఆమె చీడపురుగులా బ్రతుకుతోంది. ఆమె తన తల్లి అని చెప్పుకోవడానికే సిగ్గుగావుంది అతనికి. దుర్గమ్మ కొడుకుని చూసి ఏడ్చింది, తనను జైల్లోంచి వదిలించమని.

చంద్రం బెయిల్ మీద తల్లిని విడిపించాడు.

మోహన్, కోటయ్యల గురించి అన్ని పోలీస్

స్టేషన్‌లకి మెసేజ్ పంపించారు.

వాళ్ళకోసం సి.ఐ.డి.లు గాలిస్తున్నారు.

# 8

పదిహేను రోజులు గడిచిపోయాయి. ముద్దాయిలు దొరకలేదు.

ఈలోగా స్థానిక వారపత్రిక 'పిడుగు' ఈ కేసు గురించి పెద్ద వ్యాసం ప్రచురించింది. పట్టణంలో స్వేఛ్ఛా వ్యభిచారం, అమాయక యువతులను బలవంతంగా వ్యభిచార వృత్తిలోకి దించుతున్న ముఠా, సంఘ వ్యతిరేఖ శక్తులతో పోలీసుల కుమ్మక్కు అనే హెడ్డింగ్‌లతో వ్యాసం పడిన 'పిడుగు' సంచిక హాట్ కేక్‌లా అమ్ముడుపోయింది.

టౌన్‌లో ఎక్కడ విన్నా ఈ కథే.

నిందితుల్ని వెంటనే పట్టుకుని అరెస్టు చెయ్యమని ఐ. జీ. నుంచి యస్పీకి టెలిగ్రాం వచ్చింది. యస్పీ డియస్పీని పర్సనల్‌గా ఈ వ్యవహారం చూడమన్నాడు. డియస్పీ ఇన్స్‌పెక్టర్ కృష్ణమూర్తి శీలాన్ని శంకించి నానామాటలూ అన్నాడు.

ఇన్స్‌పెక్టర్ కృష్ణమూర్తి ముఖం కందగడ్డలా పెట్టుకుని స్టేషన్‌లో కూర్చున్నాడు.

మోహన్ టౌన్‌లో ఉండివుండడు. కాని కోటయ్య గాడు ఊళ్ళోనే ఉండివుంటాడు. కనీసం వాడినైనా పట్టుకుని అరెస్టుచేసి అధికారులకు తృప్తి కలిగించాలని అనుకున్నాడు.

సి.ఐ.డి. ఇన్స్‌పెక్టర్ వినయ్‌ని దుర్గమ్మ ఇంటికి మారువేషంలో వెళ్ళి కోటయ్య ఆచూకీ తియ్యమని కోరాడు.

వినయ్ పైజామా లాల్చీ వేసుకుని తనొక విటుడినని దుర్గమ్మ నమ్మేటట్లు మేకప్ చేసుకున్నాడు.

తలుపు కొట్టేక చాలా సేపటికి తీశాడొక కుర్రాడు.

"సార్! బిజినెస్ లేదు. పోలీసులు తిరుగుతున్నారు" అన్నాడు.

వినయ్ వాడిని ఒక్క తోపుతోసి లోపలకెళ్ళాడు విసురుగా. కుర్రాడు నివ్వెరబోయి నిల్చున్నాడు.

"దుర్గమ్మా!....దుర్గమ్మా! ఏయ్...." అంటూ హడావుడిగా లోపలకు ప్రవేశించాడు.

నిద్రపోతున్నదల్లా ఉలిక్కిపడి లేచింది. గదుల్లోవున్న ఆడపిల్లలు బిక్కు బిక్కుమంటూ లేచి కూర్చున్నారు.

"ఎవరు బాబూ!" అంటూ హాల్లోకి వచ్చింది దుర్గమ్మ.

"నేనే గుర్తులేనా?" అన్నాడు నవ్వుతూ.

దుర్గమ్మ అతన్ని గుర్తుపట్టడానికి వృధా ప్రయాస పడింది. ఎందరో వస్తుంటారు, పోతుంటారు. ఎందర్నని గుర్తు పెట్టుకుంటుంది. అందులో ఆమె ఎప్పుడూ వినయ్‌ని చూశ్శేదు కూడా! ఇంకేలా గుర్తొస్తాడు. గుర్తు లేదనడం వ్యాపార లక్షణంకాదు.

"గుర్తులేకేం? బాగున్నావా బాబూ!" అంది పెదవులకు బలవంతంగా నవ్వు పులుముకుంటూ.

"నిన్ననే మిలట్రీ నుంచి వచ్చాను" అన్నాడు.

"అలాగా బాబూ!" అంది దుర్గమ్మ ఆప్యాయంగా.

"నెలరోజులుంటాను. రోజూ వస్తుంటానులే. ఇక్కడ గిరిజని ఒక పిల్ల ఉండాలే వుందా?"

"లేదు బాబూ! అది వెళ్ళిపోయింది."

"మరి మంచిపిల్ల ఎవరున్నారు?"

దుర్గమ్మ సమాధానం చెప్పలేదు.

"ఏంటి మాట్లాడవేం?"

"ఏం లేదు. ఈమధ్య బిజినెస్ ఆపుజేశాను."

"ఏం?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఒక ఎదవ సచ్చినోడి మూలకంగా గుల్లయి పోయాను" అంటూ మాలతి మరణం గురించి చెప్పుకొచ్చింది. తను అందులో డబ్బు పోగొట్టుకుంది, పోలీసు కేసులో ఇరుక్కుంది. పైగా లక్షణంగా సాగే వ్యాపారం ఆపుజేయాల్సి వచ్చింది. పోలీసోళ్ళు రోజూ ఇంటిచుట్టూ తిరుగుతున్నారు. దుర్గమ్మకి అదంతా చెప్తుంటే నిజంగానే ఏడుపు ముంచుకొచ్చింది. వెక్కి వెక్కి ఏడ్చింది. ఇందులో నుంచి ఎట్లా బైటపడాలో తెలీకుండా వుంది బాబూ అంది కళ్ళు తుడుచుకుంటూ.

"నీకు ఆ పిల్లని అమ్మినోడిని పట్టిస్తే కేసు వాడిమీదకి పోతుందిగదా?" అన్నాడు.

"ఎక్కడున్నాడో ఆ వెధవ? పోలీసులకే దొరకడం లేదు. ఇక నాకెక్కడ దొరుకుతాడు?" అంటూ వాడిని బండ బూతులు తిట్టింది.

"పోనీ ఆ పిల్లని మేడమీద పట్టుకున్న వాడినైనా పట్టివ్వరాదా? నీమీద కేసుపోతుంది" సలహా ఇస్తున్నట్లు అన్నాడు వినయ్.

"వాడు దురమార్గుడు బాబూ! నేను పట్టిచ్చానని తెలిస్తే నన్ను కత్తితో పొడిచి చంపుతాడు. వాడి సంగతి నీకు తెలీదు. తాగుబోతు నా కొడుకు" భయంగా అంది దుర్గమ్మ.

వినయ్ నవ్వాడు.

"ఏంటో ఆశ్చర్యంగావుంది దుర్గమ్మా! ఈ వ్యాపారం చేస్తున్నావు. నువ్వొక గుండా నా కొడుక్కి భయపడ్డా

వేంటి? ఎట్లాగో వాడిని ఇరికించేసి నువ్వు తప్పుకోక. నువ్వు జైల్లోపడితే నాబోటివాడిగతి ఏమిటి?" అన్నాడు.

దుర్గమ్మ ఆలోచనలో పడింది.

"నువ్వేం భయపడమాక దుర్గమ్మా! మా మేనమామ హరిశ్చంద్రుడు తెలుసా?"

"ఆయనెవరు బాబూ?" అంది దుర్గమ్మ.

"హరిశ్చంద్రుడే తెలీదా? ఓర్నీ!" ఆశ్చర్యం నటించి "మినిష్టరు హరిశ్చంద్రుడిని తెలీనిదాన్ని నిన్నే చూస్తున్నా!" అన్నాడు.

"ఏంటీ మినీష్టరా!"

"ఆయన మా మేనమావే! నేనాయనకి చెప్పి నిన్ను వదిలిస్తాలే! ఆయన తల్చుకుంటే మర్డర్ కేసులైనాసరే ఉట్టినే ఎగిరి సముద్రంలో పడిపోవాల్సిందే!" గర్వంగా మీసాలు తిప్పాడు వినయ్.

దుర్గమ్మ ఏడుపు ముఖంలోకి కళ వచ్చింది.

"లోపలకిరా బాబూ! ఇక్కడే కూర్చుండిపోయా వేంటి?" అంటూ లోపలకు దారితీసింది.

వినయ్ దుర్గమ్మవెంట లోపలకు వెళ్ళాడు ఆ గదిలోకి. ఆ గదిలో ఫోం బెడ్ మీద దుప్పటి దులిపివేసి "కూర్చో బాబూ! నీ పేరేంటో మర్చిపోయాను" అంది.

"నర్సయ్య. మిలట్రీ నరసయ్య అంటార్లే" అన్నాడు బెడ్ మీద కూర్చుని.

దుర్గమ్మ ఫ్యాన్ ఆన్ చేసింది.

గుమ్మంవరకూ వెళ్ళి కుర్రాడిని పిలిచి అతన్ని మర్యాద చెయ్యడానికి ఆర్డర్ ఇచ్చింది.

"కోటయ్యని మామూలుగా ఇక్కడికి రమ్మనిపిలువు. వాడికి ముందే చెప్పు పోలీసులొస్తారనీ, పట్టుకెళ్తారనీ.

భయపడద్దొద్దని నచ్చజెప్పు. బెయిల్ మీద వాడిని విడిపిస్తానని నమ్మించు. చెప్పినట్లే విడిపిద్దాం. ఆనక కోర్టులో తప్పంతా ఆడిమీద పడేటట్టు చేద్దాం. వాడే జైలుకు పోతాడు. ఏమంటావు?" అన్నాడు.

దుర్గమ్మకి ఈ ఆలోచన నచ్చినట్లుంది.

"అట్టాగే చేద్దాం బాబూ!" అంది.

"కోటయ్యని ఎక్కడ దాచిపెట్టావ్?"

దుర్గమ్మ అతన్ని ఒక్క క్షణం అనుమానంగా చూసింది.

అతను కిటికీలోంచి బైటకు చూస్తున్నట్లు నటించాడు.

"ఈ ఊళ్ళోనే దాక్కున్నాడు. రేపు కాదుగాని ఎల్లుండి ఆడిని పిలిపిస్తా!" అంది దుర్గమ్మ.

"పిలిపించు. పోలీసోళ్ళు పట్టుకెళ్ళాక నాకు చెప్పు. నేను వదిలిస్తా!"

"నువ్వెక్కడ ఉంటావు బాబూ!"

"కొంపతీసి నువ్వు వస్తావా ఏం?"

"కాదు. కబురు చెయ్యడానికి."

"వద్దు .... వద్దు .... నేను రోజూ వస్తుంటాగా!" అన్నాడు నవ్వి.

కుర్రాడొచ్చి టీపాయ్‌మీద క్వార్టర్ బాటిల్ విస్కీ పెట్టాడు. బజ్జీల పొట్లాం విప్పాడు.

"ఏంటిది?" అన్నాడు.

"ఏదోలే బాబూ!" అంది దుర్గమ్మ.

"నాకిదేం సరిపోద్ది. ఫుల్ బాటిల్ తెప్పిస్తే అదొక మాదిరి.... అయినా ఇప్పుడు పుచ్చుకోను. భోజనం చేసే వచ్చాను. నాకు కావలసింది ఇది కాదు" అన్నాడు

నవ్వుతూ.

"మరింకేం కావాలి నర్సయ్య బాబూ?" అప్యాయంగా అడిగింది దుర్గమ్మ.

"అందమైన పిల్ల కావాలి. మందు తాగే పిల్లయితే నాకు పరమ సంతోషం" అన్నాడు.

"దానికేం! నాకు ఉపకారం చేస్తున్న వాడివి. నీకా మాత్రం మర్యాదా చెయ్యలేనా?" అంటూ వెళ్ళిపోయింది దుర్గమ్మ నవ్వుకుంటూ.

అతను ఆమె వెళ్ళిపోగానే బెడ్ మీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు.

కాసేపటికి గాజులు గలగలమన్నాయి.

వినయ్ కళ్ళు తెరిచి చూశాడు.

బ్రౌన్ కలర్ డ్రెస్‌లో దట్టంగా మేకప్ చేసుకున్న యువతి, ఆమెట్లున్న ప్లేటు టీపాయ్ మీద పెట్టి తలుపు మూసి బోల్టు పెట్టింది.

నవ్వుతూ వచ్చి నిల్చుంది.

'రా' అంటూ రెక్క పట్టుకుని లాగాడు.

ఆమె మంచం మీద చతికిలపడి వడిలో వాలి పోయింది వగలుపోతూ.

"నీ పేరేమిటి?"

"నీలమ్మ."

"వెరీగుడ్. బాగుంది" అంటూ బాటిల్ తెరిచి గ్లాసులో పోసి నీళ్ళుపోసి అందించాడు.

"మీరు?" అంది.

"నేను భోంచేశాను."

"మరి నాకెందుకు?"

"తాగిన ఆడదంటే నాకు ఇష్టం" నవ్వాడు.

నీలమ్మ గలగల నవ్వింది. పావు గంటకి బాటిల్ పూర్తి చేసింది నీలమ్మ. కాసేపటికి ఆమెకు చెమటపట్టింది. మత్తుగా చూస్తున్నాయి కళ్ళు.

వినయ్ మరొక బాటిల్ జేబులోంచి తీసి ఓపెన్ చేసి గ్లాసులోకి వంచాడు విస్కీ.

"ఇంకానా?....చాలు...." అంది నీలమ్మ.

"తాగు....బాగా తాగు....తాగిన తర్వాత నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా? .... ఓహ్! సినిమా యాక్ట్రెస్లా నిగనిగలాడి పోతున్నావ్!" అన్నాడు.

నీలమ్మ వుబ్బిపోసాగింది. పోసినకొద్దీ తాగి ఇష్టం వచ్చినట్లు వాగింది. అప్పుడే అడిగాడు "కోటయ్య ఎక్కడున్నాడని."నాకు తెలీదుకాని చిట్టెమ్మకి తెలుసు అంది. చిట్టెమ్మ వాడికి రోజూ అన్నం తీసికెళ్ళి పెడుతున్నదనే నిజం చెప్పింది నీలమ్మ.

తను తెచ్చిన బాటిల్ ఖాళీ అయ్యాక జేబులో పెట్టేసుకున్నాడు. కాసేపటికి నీలమ్మకి మందు ఎక్కువై వాంతి చేసుకుంది. "ఏయ్! దుర్గమ్మా!" అంటూ బోల్ట్ తీసుకుని పరుగెత్తాడు వినయ్.

# 9

తెల్లవారుజామున ఆగకుండా ఫోన్ మ్రోగసాగింది. కృష్ణమూర్తికి మెలకువ వచ్చి బెడ్ మీద పడుకునే రిసీవర్ యెత్తి 'హలో' అన్నాడు.

"సార్! నేను ఫోర్టూవన్ సార్!"

"ఎక్కడ్నుంచి?"

"స్టేషన్ నుంచి సార్!"

"ఏమిటి?" విసుగ్గా అన్నాడు.

"ఒక గంట క్రితం దుర్గమ్మ ఇంట్లోనుంచి పాడుగాటి

పిల్లి కళ్ళ వాడు పారిపోతుంటే చూశాం సార్!"

ఇనస్పెక్టర్ కి నిద్రమత్తు వదిలిపోయింది. లేచి కూర్చు న్నాడు.

"మరి పట్టుకోలేక పోయారా?"

"పరిగెత్తాం సార్! కాని దొరకలేదు. తప్పించుకుని పారిపోయాడు."

"ఏడ్చారు. వాడు పారిపోతుంటే వెర్రి ముఖాలేసు కుని చూస్తూ నిల్చుని ఇప్పుడేదో ఘనకార్యం చేసినట్లు చెప్తున్నారా?"

"లేదు సార్! చాలాదూరం వెంటపడ్డాం సార్!"

"చాల్లే నోర్మూయ్యండి. అసలు మీరు అక్కడేందు కున్నారు?"

"పెట్రోలింగ్ తిరుగుతున్నాం సార్!"

"సరే! ఇప్పుడెందుకు ఫోన్ చేసినట్లు?"

"ఆ పిల్లి కళ్ళ వాడు కనిపిస్తే వెంటనే చెప్పమన్నారుగా సార్!"

"వెంటనే అంటే గంట తర్వాతా?"

"అక్కడ్నుంచి స్టేషన్ కొచ్చేసరికి గంట పట్టింది సార్!"

ఇనస్పెక్టర్ ఫోన్ పెట్టేసి పడుకున్నాడు.

అయితే ఆ కోటయ్యని పిలిపిస్తానని చెప్పినట్లు చేసిం దన్నమాట దుర్గమ్మ. మరి వాడు వచ్చి ఎందుకు పారిపోయి నట్లు?

నిద్రా భంగమైన తర్వాత ఇనస్పెక్టర్ కి ఇక నిద్రపట్ట లేదు. పడుకునే ఆలోచించసాగాడు. ఎంత ఆలోచించినా కోటయ్య ఎందుకు పారిపోయాడు అనే విషయం అంతు పట్టలేదు.

ఇంతలో తెల్లవారింది.

తూర్పు ఎర్రబడింది.

ఫోన్ రింగయింది.

"ఇనస్పెక్టర్ కృష్ణమూర్తి స్పీకింగ్!" అన్నాడు.

"సార్! యస్.ఐ. స్వామిని మాట్లాడుతున్నాను."

"ఏమిటి ప్రొద్దున్నే."

"సార్! దుర్గమ్మ సూసైడ్ చేసుకుందట."

"వాట్?"

"యస్సార్!"

"మైగాడ్!" అన్నాడు.

"నన్ను అక్కడికి వెళ్ళమంటారా? ఇక్కడ మీకోసం వెయిట్ చెయ్యనా?"

"దుర్గమ్మ ఇంటిదగ్గరే వుండు. ఎవర్నీ ఏమీ ముట్టుకో నివ్వకు. బీ కేర్‌ఫుల్."

"యస్సార్!"

ఇనస్పెక్టర్ ఫోన్ పెట్టేశాడు.

## 10

"గుడ్ మార్నింగ్ మిష్టర్ వినయ్!"

"గుడ్ మార్నింగ్! ఎవరూ?"

"నేను కృష్ణమూర్తిని."

"వాట్ సార్?"

"దుర్గమ్మ చచ్చిపోయింది."

"ఈజిట్?"

"యస్."

"ఎలా?"

"సూసైడ్ అని అంటున్నారు. ఒక కుర్రవాడొచ్చి రిపోర్టు చేశాడట అలా అని. కాని నేనిది హత్య ఏమో

నని సస్పెక్టు చేస్తున్నాను.

"ఎలాగ?"

"తెల్లవారుజామున కోటయ్య ఆ ఇంట్లోనుంచి పారి పోతుంటే మనవాళ్ళు చూశారు పెట్రోలింగ్ చేస్తూ. కాని వాడు దొరకలేదు. వాడే మర్డర్ చేసి పారిపోయా డేమోనని నా అనుమానం."

"అలా కూడా కావచ్చు. కాని కోటయ్య దుర్గమ్మని యెందుకు మర్డర్ చేసివుంటాడు?"

"మన ప్లాన్ దుర్గమ్మ వాడికి చెప్పి వుంటుంది. కాని అది వాడికి అరమై వుండదు. పోలీసులు పట్టుకోవడం ఏమిటి? మళ్ళీ వదలటం ఏమిటి? అని అనుమానించి వుండొచ్చు. తనను దుర్గమ్మ జైలుకి పంపడానికి ప్లాన్ వేస్తున్నదేమోనని సందేహించి కోపంవచ్చి దుర్గమ్మని మట్టు పెట్టి వుండొచ్చు."

"నేను మరొకలా ఆలోచిస్తున్నాను."

"నేను దుర్గమ్మతో మాట్లాడినదంతా వాడికి తెలిసి పోయి ఈ దుర్మార్గం చేసి వుండొచ్చు."

"ఎలా తెలుసుంది వాడికి?"

"అవకాశం వుంది. చిట్టెమ్మనే బ్రోతల్ ఒకతె వాడికి పెట్. అది ఇన్ఫర్మేషన్ చేర వేసి వుంటుంది. ముందు ఆ ఇంట్లో వున్న చిట్టిని పట్టుకోండి. దానికి తెలుసు కోటయ్య యెక్కడ వున్నాడో!"

"గుడ్! నేను అక్కడికే పోతున్నాను. వెంటనే నువ్వొస్తే ఏదైనా క్లూ చిక్కుతుంది."

"ఇప్పుడే వస్తున్నాను" అన్నాడు వినయ్ ఫోన్ పెట్టేస్తూ.

# 11

ఇనస్పెక్టర్ దుర్గమ్మ వుండే ఇంటికి వెళ్ళేసరికి ఆ సందులో జనం చేరి వున్నారు.

యస్.ఐ. స్వామి సెల్యూట్ చేసి కృష్ణమూర్తిని దుర్గమ్మ శవం వున్న గదిలోకి తీసికెళ్ళాడు.

దూలానికి వ్రేలాడుతోంది శవం. అది పెంకుటిల్లు. ఆ దూలానికి తాడు కట్టడం ఆడవాళ్ళకి సాధ్యమయ్యే పని కాదు.

నీలిరంగు నైలాన్ తాడు లావుపాటిది కంఠానికి వురి పెట్టబడి వుంది. కాళ్ళక్రింద టీపాయ్ వుంది.

కాసేపటికి వినయ్ వచ్చాడు.

"నాట్ సూసైడ్" అన్నాడు నెమ్మదిగా.

వేలిముద్రల నిపుణుడు వేలిముద్రల కోసం వెతుకుతున్నాడు.

గదిలో ఏదైనా క్లూ దొరుకుతుందేమోనని గాలించారు. ఒకమూల నీళ్ళు పోవడానికి పెట్టిన కన్నం దగ్గర ఎర్ర రంగు పెన్ దొరికింది. వేలిముద్రలకోసం దాన్ని భద్రపరిచారు.

శవాన్ని పోస్టుమార్టం కోసం పంపారు.

నలుగురు అమ్మాయిలు, ఒక కుర్రాడు వున్నారు. వాళ్ళని ప్రశ్నిస్తే మాకేం తెలియదన్నారు. వాళ్ళు రెండో ఆట సినిమాకని వెళ్లారట. తిరిగి వచ్చేసరికి రెండు గంటలు దాటి వుంటుంది. ప్రహరీ గోడ గది తీసే వుంటుందట. తనకు నిద్రాభంగమవుతుందని దుర్గమ్మే అలా చెప్పిందట. తెల్లవారి లేచి చూసేడట ఆ కుర్రాడు. తలుపు నెట్టేసరికి దుర్గమ్మ శవం కన్పించిందట.

"గమ్మత్తుగా వుందే!" అన్నాడు కృష్ణమూర్తి.

"ఇది వాడి పనే! కోటయ్యగాడిని పట్టుకుంటే తేలి పోతుంది" అన్నాడు వినయ్.

అంతలోకి దుర్గమ్మ కొడుకు చంద్రం వచ్చాడు అక్కడికి.

"సారీ మిస్టర్ చంద్రం" అన్నాడు ఇనస్పెక్టర్.

చంద్రం కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

"ఇలా జరుగుతుందని నాకు ఎప్పుడో తెలుసు సార్! ఇది మా నెయ్యమని ఎన్నోసార్లు బ్రతిమాలాను. కాని ఒప్పుకుంది కాదు. అందుకే నేను ఇక్కడకు రావడం కూడా మానుకున్నాను. అంతా ఖర్మ!" అన్నాడు విచారంగా.

# 12

"నాకేం తెలీదయ్యా!" అన్నాడు కోటయ్య ఏడుపు ముఖం పెట్టి.

"నువ్వు తెల్లవారుజామున ఆ ఇంట్లోంచి యెందుకు పారిపోయావో చెప్పు మరి."

"దుర్గమ్మ శవాన్ని చూసి భయంవేసి పారిపోయా నయ్యా!" అన్నాడు కోటయ్య.

"దుర్గమ్మ శవాన్ని ఎందుకు చూశావు ఆ టైమ్‌లో."

"దుర్గమ్మకి తెల్లవారుజామునే నిద్రలేచే అలవాటుం దయ్యా! అందుకే లేచిందేమో చూశాను."

"దుర్గమ్మ ఇంటికి ఎప్పుడు వెళ్ళావు?"

"రాత్రి పదింటికి దుర్గమ్మ ఇంటికి బయల్దేరాను. దారిలో మా వాళ్ళంతా ఎదురై సినిమాకెళ్తున్నామని చెప్పారు. నన్నుగూడా రమ్మని బ్రతిమాలారు. సినిమా అయ్యాక వాళ్ళతోపాటే ఆ ఇంటికి వచ్చాను. తలుపు తీసే వుంది. ఎవరి గదుల్లో వాళ్ళు పడుకున్నారు. చిట్టీ నేనూ ఒక గదిలో పడుకున్నాం."

"బాగుంది. అసలు నువ్వు యెక్కడో దాక్కున్నావు గదా! మరి దుర్గమ్మ ఇంటికి యెందుకు వచ్చావు?"

"రమ్మని కబురుచేస్తే వచ్చానయ్యా!" అన్నాడు.

"ఎవరితో కబురు చేసింది?"

"చిట్టితో."

"ఏమని. వట్టినే రమ్మందా? ఇంకేమన్నా కబుర్లు చెప్పిందా?"

"పోలీసులు పట్టుకున్నా వదిలేసే ఏర్పాటు చేశాను. రమ్మనీ, భయం ఏమీ లేదనీ కబురు పెట్టిందయ్యా!"

"అంతేనా? చిట్టి ఇంకేవీ చెప్పలేదా?"

"దుర్గమ్మ అంతే చెప్పిందంట."

"అయితే నువ్వు దుర్గమ్మని చంపలేదంటావు?"

"లేదయ్యా! దేవుడి సాక్షిగా నిజం చెప్తున్నాను."

"వీణ్ని లాకప్‌లో పడేయండి. అంత తేలిగ్గా చెప్తాడా?" అన్నాడు ఇనస్పెక్టర్.

ఇద్దరు కానిస్టేబుళ్ళు కోటయ్యని లాక్కెళ్ళి లాకప్‌లో పడేశారు.

"నాకేం తెలీదయ్యా!" అంటూ ఏడుస్తున్నాడు కోటయ్య.

## 13

అర్ధరాత్రి పన్నెండు గంటలకు దుర్గమ్మ ప్రాణం పోయింది. గొంతుపిసికి చంపారు. తర్వాత మెడకి తాడు కట్టి ఆత్మహత్య చేసుకుందని నమ్మించడానికి ప్రయత్నం చేశారు.

పోస్టుమార్టమ్‌లో తేలిన అంశాలు అవి.

ఎర్రరంగు పెన్నుమీద వేలిముద్రలు దొరికాయి. దుర్గమ్మ గొంతుమీద వేలిముద్రలు లేవు. టవలుతో తుడిచి

నట్లుంది. ఆ ఎర్ర పెన్ను ఎవరిదో ఆ ఇంట్లో ఎవరూ గుర్తు పట్టలేక పోయారు. కోటయ్య వేలిముద్రలు ఆ పెన్నుమీద వాటితో టాలీ కాలేదు.

వీళ్ళంతా సినిమాకు వెళ్ళిన సమయంలో ఎవరో కొత్త వ్యక్తి దుర్గమ్మను కలిశాడు. ఏదో బలమైన కారణంవల్ల అతను దుర్గమ్మను చంపాడు.

ఎవరా కొత్త వ్యక్తి?

మాలతిని దుర్గమ్మకు అమ్మిన మోహన్ అనే యువకుడై వుంటాడా?

మోహన్ కోసం పోలీసుల అన్వేషణ తీవ్రం చేశారు.

ఫింగర్ ప్రింట్స్ బ్యూరోకు వేలిముద్రలు పంపారు. పాత నేరస్థుల జాబితా వెతకసాగారు.

వేలిముద్రలు పాత నేరస్థుడివి కావని బ్యూరోనుంచి సమాచారం వచ్చింది.

అధికారులు వత్తిడి చేసినకొద్దీ కేసు మరింత జటిలమై పోయి ముందుకు సాగడం లేదు.

మాలతి, కోటయ్యవల్లే చనిపోయిందని కేసు పెట్టి కోర్టు చుట్టూ తిప్పుతున్నారు పోలీసులు.

దుర్గమ్మ మర్డర్ కేసు పోలీసుల్ని తికమక పెట్టసాగింది. దుర్గమ్మ ఇంట్లో వున్న బ్రోతల్స్‌ని యెక్కడికీ పోనివ్వకుండా వాళ్ళని యెవరెవరు కలుసుకుంటున్నారో నిఘా వేశారు. ప్రయోజనం కన్పించడంలేదు.

దుర్గమ్మని కోటయ్య చంపలేదేమోననిగూడా అనిపిస్తోంది. కోటయ్య ఇంత తెలివిగా దుర్గమ్మని చంపలేడు. మెడమీద వేలిముద్రలు పడతాయని అతనికి తెలిసేటంత తెలివైనవాడు కాడు. ఎవరో బాగా చదువుకున్నవాడే ఈ హత్య చేశాడు.

# 14

కె. చంద్రం, మున్సిపల్ ఆఫీస్ అనే నేమ్ ప్లేట్ చూసి ఆగిపోయాడు అతను.

అదొక సింగిల్ రూమ్. రోడ్డుకి ఆనుకునే వుంది. తలుపు వారగా వేసివుంది.

అతను రూమ్ ముందు నిల్చున్నాడు.

నెమ్మదిగా వేళ్ళతో తట్టాడు.

"ఎవరూ?"

"మే ఐ కమిన్ ప్లీజ్!"

"యస్."

తలుపు తెరుచుకుంది.

చంద్రం లుంగీతో వున్నాడు.

సినిమా పత్రిక తాలూకు చదువుకుంటున్నాడు.

గది కాస్త విశాలంగానే వుంది. సింగిల్ కాట్. గాద్రెజ్ బీరువా. నిలువెత్తు అద్దం. దండెంమీద మాసిన బట్టలు. అతను గది పరికించి చూస్తున్నాడు.

"లోపలకు రండి" అంటూ కుర్చీ ఫోల్డు విప్పాడు.

అతను తాపీగా కూర్చుని "నేను విజయలక్ష్మి బ్రదర్ని" అన్నాడు.

చంద్రం ముఖం వికసించింది.

"మీ పేరు రాంప్రసాద్ గదూ! గ్లాడ్ టూ మీట్ యూ!" అంటూ షేక్ హేండ్ ఇచ్చాడు చంద్రం.

అతను నవ్వి వూరుకున్నాడు.

"మిలట్రీలో పని చేస్తున్నారటగా!"

"అవును."

"ఎప్పుడొచ్చారు?"

"ఈ రోజే. మీ గురించి సిస్టర్ చెప్పింది. మాట్లాడి

పోదామని వచ్చాను. ఇంత అర్జంట్‌గా యెందుకొచ్చావంటే రేపు మా అంకుల్ ఇంటికి వెళ్తున్నాను. సెటిల్ అయితే మా మావయ్యగారి అమ్మాయితో ఈ నెలవల్లో పెళ్ళి జరుగుతుంది" అతను కొంచెం సిగ్గుపడినట్లు అభినయించాడు.

"మీకింకా పెళ్ళికాలేదా?"

"లేదు. మిలట్రీవాణ్ని గదా! శరీరం కాస్త లావు. నాకింకా థర్టీ నిండలేదు" అన్నాడు.

"ఇంకా యెన్కువ వున్నట్లు అనిపిస్తారు."

"అవును....!"

"ఏమిటి విశేషాలు చెప్పండి?"

"మీరే చెప్పాలి. మీ గురించి సిస్టర్ చెప్పింది. కాని మీ మదర్ బ్రోతల్ బిజినెస్ చేస్తారట గదా! మా ఫాదర్, మదర్ అంత సుముఖంగా లేరు. అంత ఏమిటి లెండి? మిమ్మల్ని అల్లుడిగా చేసుకోవడానికి ఒప్పుకోవడం లేదు" అన్నాడు అతను.

చంద్రం ముఖం నల్లబడిపోయింది.

"అదేమిటి? మీ వాళ్ళు ఇష్టపడుతున్నారని మీ సిస్టర్ చెప్తుందే?" ఆశ్చర్యంగా అన్నాడు చంద్రం.

"మా సిస్టర్ మీగురించి చెప్పినప్పుడు వాళ్ళు అంతా తెలుసుకుని నాకు లెటర్ రాశారు. మీకు ఇష్టం లేక పోయినా అమ్మాయితో ఆ సంగతి చెప్పొద్దని నేను సలహా ఇచ్చాననుకోండి. అందుకే అయిష్టంగా చెప్పి వుండరు."

చంద్రం ముఖం వాల్చుకుని కూర్చున్నాడు.

"వ్యభిచార వృత్తి చేసే కుటుంబంలోకి యెవరు మాత్రం పిల్లను ఇస్తారు లెండి" అన్నాడు.

"మా అమ్మకూ నాకూ సంబంధం లేదు. అదీ కాక ఆమె చనిపోయిందిగూడా! నేను గౌరవంగా వుద్యోగం చేసుకుంటున్నాను" సీరియస్ గా అన్నాడు చంద్రం.

"డోంట్ మిస్సండర్ స్టాండ్ మీ! లోకం పోకడ చెప్పాను. అఫ్ కోర్స్ అందులో మీ తప్పు ఏముంది లెండి. నాకంత పట్టింపులేవీ లేవు. ప్రోగ్రెసివ్ థాట్స్ వున్నాయి నాకు."

"థాంక్స్" అన్నాడు చంద్రం.

"బై దిబై మా సిస్టర్ తో మీకు ఎలా పరిచయం కలిగింది?"

"మీ సిస్టర్ చెప్పలేదా?"

"ఆడపిల్లని అవన్నీ యెందుకు అడగాలని వూరుకున్నాను."

"మీ సిస్టర్ టీచర్ గా పని చేస్తున్న కాన్వెంట్ స్కూల్ దగ్గర్లో ఒక రూమ్ లో వుంటుండే వాడిని. మా బాస్ పిల్లల్ని అడ్మిట్ చెయ్యడానికి వెళ్ళినప్పుడు పరిచయం కలిగింది. ఆ తర్వాత అది డెవలప్ అయింది" అన్నాడు చంద్రం.

"మా సిస్టరు మీ అమ్మగారి వృత్తి గురించి ఎప్పుడూ తన అభిప్రాయం చెప్పలేదా?"

"చెప్పింది. ఆవిడను మాన్పించాలని నేనూ ప్రయత్నించాను. కాని ఆమె అలా అలవాటు పడిపోయింది. ఎనీ హౌ షీ కమిటెడ్ సూసైడ్" అన్నాడు చంద్రం.

ఆ తర్వాత కాసేపు మాట్లాడుకున్నారు. రాంప్రసాద్ తన జేబులో పెన్ తీసి అతనికి అందించి అడ్రస్ రాసివ్వమనీ లెటర్స్ రాస్తుంటాననీ చెప్పాడు.

చంద్రం పెన్ అందుకుని తెల్లకాగితం మీద తన

ఆఫీసు అడ్రెస్ రాసి ఇచ్చాడు.

రామ్‌ప్రసాద్ పెన్, కాగితం అందుకుని వెళ్ళొస్తానని చెప్పి సెలవు తీసుకున్నాడు.

## 15

చంద్రం ఆఫీసుకు వెళ్ళగానే విజయలక్ష్మితో మాట్లాడాలని కాన్వెంట్ కి ఫోన్ చేశాడు.

"గుడ్ మార్నింగ్ విజయా!"

"గుడ్ మార్నింగ్ చంద్రం!"

"ఏమిటి సంగతి?"

"రాత్రి మీ బ్రదర్ నన్ను కలిశాడు."

"మా బ్రదర్ యెవరు?"

"మిలటరీలో పని చేస్తున్నాడని చెప్పావు చూడు! రాంప్రసాద్!"

"ఏమిటి నువ్వనేది?"

"రాంప్రసాద్! మీ అన్నయ్య నన్ను కలిశాడంటున్నాను. ఎందుకట్లా ఆశ్చర్యపోతావు?"

"ఏడ్చినట్లుంది. మా అన్నయ్య అసలు పూర్ణించి రానిదే నిన్నెట్లా కలిశాడు? గమ్మత్తుగా వుందే! వేళాకోళం చేస్తున్నావా ఏమిటి?"

"నో....నిజమే!"

"అంతా అబద్ధం."

"లేదు విజయా! లావుగా వున్నాడు. మీసాలుగూడా వున్నాయి. మిలట్రీ వాడిలాగే కన్పించాడు."

"అతను మా అన్నయ్యా మాత్రం కాదు! ఎవరో నిన్ను బోల్తా కొట్టించాడు. డబ్బులేమైనా అడిగాడా ఏం? అతనెవరో మోసగాడై వుంటాడు."

"లేదు, నన్ను డబ్బులేమీ అడగలేదు. అలా బజారు

కళ్ళి టీ తీసుకుందామని అడిగినా వద్దన్నాడు. లెటర్స్ రాస్తుంటానని అడ్రస్ తీసుకున్నాడు" చంద్రానికి అంతా ఆశ్చర్యంగా వుంది.

"గుడ్ మార్నింగ్ మిస్టర్ పరశురామ్!"

చంద్రం ఫోన్ పెట్టేసి "నా పేరు చంద్రం సార్!" అన్నాడు ఇనస్పెక్టర్ కృష్ణమూర్తితో.

"అఫ్‌కోర్స్! కాని తల్లిని చంపిన పరశురాముడు నువ్వూ ఒకే కోవకి చెందుతారని నేనలా పిలుచాను."

"సార్!.... సార్!"

"రాత్రి నిన్ను కలుసుకున్న వాడు మా వాడే. సి.ఐ.డి. ఇనస్పెక్టర్. నీ వేలిముద్రల కోసం నీ ప్రేయసి అన్నగా నాటకం ఆడాడు. మీ అమ్మని తెలివిగా చంపావు. కాని నీ పెన్ అక్కడ మర్చిపోయావు. అఫ్‌కోర్స్ హంతకుడు ఏదొక పొరపాటు చెయ్యడం సహజం అనుకో. ఆ పెన్ మీద నీ వేలిముద్రలు దొరికాయి. రాత్రి నీ వేలిముద్రలు మళ్ళీ పెన్ మీదనే సంపాదించాం. ఖచ్చితంగా సరిపోయాయి. నౌ యూ అర్ అండర్ అరెస్ట్!" ఇనస్పెక్టర్ కృష్ణమూర్తి కంఠం కంచులా మ్రోగింది.

చంద్రం కాళ్ళక్రింద భూమి కదిలింది.

పోలీసు కానిస్టేబుళ్ళు అతని చేతులకు బేడీలు తగిలించారు.

——: ఐపోయింది :——

# అడుగో హంతకుడు!

## టెంపోరావ్

శమంత టైమ్ చూసింది. ఏడు దాటింది. హాల్లో ఫ్లోర సెంట్ లైట్లు వెలుగుతున్నాయి. ఒక ఫాన్ తిరుగుతోంది. పెద్ద సోఫాలో ఆమె కూర్చుని వుంది. ఎదురుగా నిలబడి వుంది వంటామె మంగమ్మ.

"అన్నీ టేబుల్ మీద పెట్టానమ్మా. వెళ్ళొస్తాను" అంది మంగమ్మ.

"రేపు అక్కయ్య వస్తుంది. ఎనిమిదింటికల్లా ఇడ్లీ, చట్నీ, సాంబార్ అన్నీ తయారుగా వుండాలి" అంది శమంత.

"అలాగే నమ్మా" అని మంగమ్మ కదిలింది.

హాల్లో నుంచి ఆమె బయటకు వెళ్ళింది. మంగమ్మ వెళ్ళిపోగానే ఆమె తలుపులుమూసి గడియలు బిగించింది. క్షణకాలం అక్కడ నిలబడి ఆమె కిందకు చూసింది. మేడమెట్లు దిగుతూన్న వంటామె రూపం అద్దాల తలుపు ల్లోంచి ఆమెకు కనిపిస్తోంది. ఎవరైనా ఆ మెట్లెక్కి పైకి

రావాలి. అద్దాల్లోంచి వాళ్ళను చూసి తలుపుతీస్తూ వుండొచ్చు. వెనకవైపు మేడమెట్లున్నాయి. పనివాళ్ళు మాత్రం ఆ మెట్లను ఉపయోగిస్తూ వుంటారు.

శమంత హాల్లోకొచ్చి టేబుల్ మీదున్న డయనోరా టి.వి. ని ఆన్ చేసింది. వెళ్ళి సోఫాలో కూర్చుంది. టి.వి. స్క్రీన్ వైపు ఉత్సాహంగా చూస్తోంది. అనేక ఫోటోలతో సరోజినీ నాయుడు జీవితచరిత్రను చిత్రిస్తున్నారు. పెద్ద పెద్ద పదవులను సరోజినీ నాయుడు అలంకరించింది. మహాత్మాగాంధీతో ఆమె రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కి లండన్ వెళ్ళింది. కొన్నేళ్ళపాటు కాంగ్రెస్ ప్రెసిడెంట్ గా వుంది. ఇండియాకి స్వాతంత్ర్యము వచ్చాక ఆమె గవర్నరయింది. ఎన్నో ఘనకార్యాలు సాధించిన సరోజినీ నాయుడు చివరికి అస్వస్థురాలై మృత్యువుకు తలొంచింది. ఇదంతా టి.వి. లో చూస్తూంటే శమంత హృదయంలో ఉద్రేకం రేకెత్తింది. ప్రతీ ప్రాణీ ఆఖరికి చావుకి తప్పదు!

యువతీ యువకులు పాడుతున్నారు. టెలిఫోన్ మ్రోగింది. ఆమె రిసీవరెత్తి, "హలో, శమంత!" అంది.

"నేను శమంతా" అందో పురుష కంఠం అటువైపు నుంచి.

ఆమె కిలకిల నవ్వింది.

"మైడియర్, నీ కాల్ కోసం ఎదురు చూస్తున్నాను."

"ఎప్పుడు రాను?"

ఆమె క్షణకాలం మౌనంగా వుండిపోయింది.

"పన్నెండు తర్వాత."

"నీకోసం పన్నెండు దాకా మేలుకుని వుండాలి."

"మైడియర్. ఉయ్ కాంట్ హెల్పిట్. మనిష

ప్రకారం కలుసుకోడం సాధ్యంకాదు. అది నీకు తెలుసు. రేపు అక్కయ్య ఇక్కడకొస్తుంది. ఆ సమయంలో మాత్రం నువ్వు యిటువైపు రాకు. ఆమెను గురించి నీకు బాగా తెలుసుగా!"

"ఓల్డు హేగ్!" అన్నాడతను నవ్వుతూ.

"సరిగ్గా పన్నెండింటికి వెనుక తలుపులు తెరిచి వుంచుతాను. నువ్వు లోపలకొచ్చి తలుపులు మూయొచ్చు."

"బైబై డార్లింగ్ అన్‌టిల్ ట్వెల్వోక్లాక్!"

ఆమె రిసీవర్ని పెట్టేసి సోఫాలో వెనక్కు వాలింది. ఆమెకు గతం గుర్తుకొస్తోంది. ఆమె భర్త పెద్ద వుద్యోగం చేసి, ప్లేన్ యాక్సిడెంట్‌లో మరణించాడు. అప్పటికి ఆమె వయస్సు నలభై సంవత్సరాలు. పెద్దకొడుకు అమెరికా వెళ్ళాడు. చిన్న కొడుకు చదువుకుంటున్నాడు. భర్త బతికి వున్నప్పుడు రెండు కార్లు వుండేవి. అతడు పోయాక ఒక్క కారును మాత్రం ఆమె వుంచుకొంది. ఎన్నడూ ఆమెకు డబ్బులోటు తెలియదు.

పెద్దకొడుకు అమెరికన్ యువతిని పెళ్ళాడి స్టేట్స్‌లో స్థిరపడిపోయాడు. అతడి పెళ్ళికి ఆమె అమెరికా వెళ్ళి తిరిగి వచ్చింది. రెండో కొడుకు పెద్దవాడయ్యాడు. ఆమె అనుమతి లేకుండా ఒక మళయాళీ యువతిని పెళ్ళాడాడు. దానితో ఆమెకు కోపం వచ్చింది. రెండో కొడుకు వుద్యోగం చేసుకుంటూ వేరే కాపురం పెట్టాడు. ఒంటరిగా జీవిస్తున్న తల్లిని అప్పుడప్పుడు వచ్చి చూస్తూ వుంటాడు. అతడి భార్య ఎన్నడూ శ్రీమంత యింటికి రాలేదు. ఆమె తనింటికి రావడం ఆమె కిష్టంలేదు.

టెలిఫోన్ మ్రోగింది. ఆమె రిసీవర్ని యెత్తింది.

"హలో!" అంది.

"నేనే, సుబ్బలక్ష్మిని" అందో కంఠం అటువైపు నుంచి.

"పొద్దుటే వస్తున్నావుగా? రేపిక్కడే లంచ్!" అంది శమంత.

"డ్రయివర్ ఏడింటికొస్తాడు. రాగానే బయల్దేర తాను."

"బావగారు యెలా వున్నారు?"

"అదే సితి, బెడ్ రిడన్! ఎన్ని మందులిచ్చినా సింక్ లో పడేసినట్టే!"

"డెబ్బయి ఏళ్ళ మనిషికి మందులు వుపయోగపడవు, అక్కా!"

"ఏం చేస్తున్నావు?"

"వంటది వెళ్ళిపోయింది. కూర్చుని టీవి చూస్తున్నాను."

"గుడ్ నైట్, వస్తాను రేపు" అంది సుబ్బలక్ష్మి.

ఆమె రిసీవర్ని పెట్టేసి టైమ్ చూసింది. ఎనిమిదైంది. టి.వి.లో అరవ న్యూస్ చెప్తున్నారు. ఆమె లేచింది. బయటకు వెళ్ళింది. డాబామీద పిట్టగోడ పక్కనే నిలబడి కిందకు చూసింది.

నౌఖరు రామయ్య తోటలో పచార్లు చేస్తున్నాడు. రామయ్య మెట్ల గదిలోనో, లేక బయట వరండామీదో పడుకుంటాడు. డాబామీదున్న ఆమె వైపు అతడు పైకి చూశాడు.

"నేను భోజనం చేసి పడుకుంటాను. ఎవర్నీ పైకి రానివ్వకు!" అందామె.

"అలాగేనమ్మా" అన్నాడతను.

ఆమె హాల్లోకివచ్చి తలుపు మూసి గడియలు బిగించింది. డైనింగ్ టేబుల్ దగ్గర కెళ్ళి కుర్చీలో కూర్చుంది.

కంచం, కూల్ వాటర్, వండిన పదార్థాలు అక్కడ సిద్ధంగా వున్నాయి; ఆమె తింటూ టివి చూడసాగింది.

భోజనం ముగించి ఆమె పడగ్గదిలోకి వెళ్ళింది. దుస్తులు తీసేసి పల్చటి సిల్కు మేక్సీ వేసుకుంది. ఆమె చెవులకున్న డైమండ్ కమ్మలు మెరుస్తున్నాయి.

మెళ్ళో పదికాసుల చంద్రహారం వుంది. అమెరికాలో కొన్న చేతిగడియారం మెరుస్తోంది. ఆమె 11-55కి అలారం పెట్టింది. అద్దంముందు నిలబడి తన రూపాన్ని పరీక్షించుకుంది.

తన వయస్సు యిప్పుడు యాభై రెండేళ్ళు. అయినా తనింకా ముసలిదానిలా కనపడ్డంలేదు. ముప్ఫయి ఐదేళ్ళ ప్రియుడు తన కోసం పరితపిస్తున్నాడు. తను ముసలి దానిలా కనపడివుంటే అతడామె చెంతకు వచ్చేవాడు కాదు. ప్రతిరోజూ తనుచేసే వ్యాయామం, బీచ్ వాకింగ్ బలాన్నిచ్చే భోజనం తన సహజ సౌందర్యాన్ని యింకా నిలబెట్టింది. లోలోపల ఆనందిస్తూ, ఆమె పరుపు మీద వాలింది.

టైమ్ తొమ్మిది దాటింది. జీరోవాట్ లాంప్ మసగ్గా వెల్గుతోంది. శమంత కాసేపట్లో నిద్రలోకి జారిపోయింది.

## 2

11-55కి రిస్టువాచ్ అలారం కొట్టింది. గాఢనిద్ర లోంచి ఆమె లేచింది. క్షణకాలం మౌనంగా కూర్చుని మెల్లిగా మంచం దిగి హాల్లోకి వెళ్ళింది. వెనుక తలుపు దగ్గరకు చప్పుడు చెయ్యకుండా నడిచింది. అక్కడ చీకటిగా వుంది. సెకండ్లు గడుస్తున్నాయి. తలుపు దగ్గరగా ఆమె నిలబడింది.

ఏ క్షణంలోనయినా అతడు రావచ్చు!

ఎవరో మెల్లిగా మెట్లెక్కుతున్నారు.ఆమె గడియలు తీసి తలుపులను తెరిచింది. అతడి రూపం నీడలా బయట నిలబడివుంది. తటాలున అతడు లోపలకొచ్చాడు. తలుపులు మూసి గడియవేశాడు. అమాంతంగా అతని చేతులు ఆమెను చుట్టేశాయి.

"ఇక్కడ కాదు. పడగ్గదిలోకి పద" అందామె తగ్గు స్వరంలో.

ఇద్దరూ పడగ్గదిలోకెళ్ళారు. జీరోవాట్ బల్బు వెలుగుతోంది. పరుపుమీద ఆమె వెల్లకిలా పడుకుంది. పక్కనే కూర్చుని అతడామె చెయ్యిని పట్టుకున్నాడు.

"నువ్వు వస్తూంటే ఎవ్వరూ చూడలేదుగా?" అడిగిందామె.

అతడు చిలిపిగా నవ్వాడు.

"డోన్ట్ వర్రీ శమంతా! గత పదేళ్ళుగా ఎవ్వరూ చూడకుండా జాగ్రత్తపడ్డం నాకు అలవాటేగా!"

అతడు నవ్వుతూ ఆమెమీదకు ఒరిగాడు. లిప్ స్టిక్ తో ఎర్రబడిన ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"మళ్ళా నువ్వు అమెరికా వెళ్ళాలా?"

"వచ్చే నెలలో వెళ్తాను. నెలలోపల తిరిగొచ్చేస్తాను. పెద్దకొడుకు ప్లేన్ టికెట్ పంపిస్తున్నాడు."

"నువ్వు లేకుండా యిక్కడ జీవించడం ఎడారి బతుకులా వుంటుంది."

ఆమె నవ్వుతూ అతని మెడను నిమిరింది.

"యూ ఆర్ ఎంగ్ ఫెలో. నాకంటే పదిహేడేళ్ళు చిన్నవాడవు. మన సంబంధం ఎంతకాలం ఉంటుందో నాకే తెలీదు" అందామె.

"ప్లీజ్ డోన్ట్ సే దట్! నువ్వంటే నాకు చాలా

ప్రేమ. నేనందుకే పెళ్ళిచేసుకోకుండా ఉండిపోయాను."

ఆమె సంతోషంగా కిందకు దిగింది. గోడవారగా వున్న టేబుల్ వైపు వెళ్ళింది. గ్లాసులో కొంత విస్కీ పోసి కూల్ సోడా కలిపింది.

అతడు దగ్గరగా వెళ్ళి ఆమె యిచ్చిన గ్లాసు అందుకున్నాడు "ఛియర్స్!" అని తాగడం ప్రారంభించాడు.

ఆమె మంచం మీద కూర్చుంది. పక్కనే కూర్చుని అతను తాగుతున్నాడు. నవ్వుతూ అతడివైపు చూసింది.

"కొంచెంగా స్కాచ్ సేవిస్తే మంచిదే. డోస్ ఎక్కువయితే నిద్రపోతావు" అందామె నవ్వుతూ.

"శమంతా, నువ్వూ తీసుకో."

"నో ప్లీజ్, అమెరికాలో ఎందరో నాకు డ్రింక్స్ ఆఫర్ చేశారు. కాని నేను తీసుకోలేదు."

"తాగితే కాని రుచి తెలియదు."

"రుచుంటేగా తెలియడానికి!"

అతడు గ్లాసు ఖాళీచేశాడు. గబగబా వెళ్ళి గ్లాసులో మళ్ళా స్కాచ్ విస్కీ పోసుకున్నాడు. కూల్ సోడా కలిపాడు. తాగుతూ పరుపు మీద పడుకుని వున్న ఆమె వైపు నవ్వుతూ చూశాడు.

"కమాన్, యూ ఆర్ డ్రింకింగ్ టూ మచ్!" అందామె.

అతడు గడగడా తాగేసి గ్లాసును టేబుల్ మీనుంచి ఆమె దగ్గరకొచ్చాడు. నిషా ఎక్కుతోంది. ఆమె మీద అమాంతంగా వాలిపోయాడు. ఆమె కళ్ళల్లోకి చూస్తూ ఉండిపోయాడు.

"ఏమిటలా చూస్తున్నావు?"

"మై డియర్, నాకు నీ సహాయం కావాలి.

నిన్నెప్పుడూ నీ నేదీ అడగలేదు. నేను ఇరకాటంలో పడ్డాను."

"ఏం కావాలి?"

"ఏభై వేలు!"

ఆమె కళ్ళు చిట్లించింది.

"గుడ్ హెవెన్స్! నా యింట్లో డబ్బుల చెట్టుందా? భర్త మరణించి పన్నెండేళ్ళు అయింది. తిండికి లోటు లేకుండా ఎలాగో జీవితాన్ని సాగిస్తున్నాను."

"నీ దగ్గర బ్లాక్ మనీ కావల్సినంతవుంది. అందులోంచి నేనడిగింది యిస్తే నీకే కొరతా రాదు. తరవాత నేనెప్పుడో అదంతా తిరిగిచ్చేస్తాను."

"ప్లీజ్ డబ్బును గురించి మనం పోట్లాడొద్దు. నువ్వంటే నాకెంతో ప్రేమ. నా దగ్గర డబ్బుంటే నీకు తప్పక యిచ్చేదాన్ని. ప్రస్తుతం లేదు. నన్ను చూసి నా దగ్గర లక్షలున్నాయని చుట్టుపక్కలవాళ్ళు అనుకుంటూ ఉంటారు. అదంతా నువ్వు నమ్మకు."

అతడు కిందకు దిగాడు. టేబుల్ దగ్గర కెళ్ళి గ్లాసులో విస్కీ పోసి సోడా కలిపాడు. అక్కడే నిలబడి తాగుతూ ఆమెవైపు చూశాడు.

ఆమె పరుపుమీద లేచి కూర్చుంది. అతడివైపు సూటిగా చూసింది.

"ప్లీజ్, యింక తాగొద్దు. ఎక్కువగా తాగి అల్లరి చేస్తే మన గుట్టు బయటపడుతుంది."

అతడు విచిత్రంగా నవ్వాడు. గ్లాసును ఖాళీచేసి ఆమె ముందు కెళ్ళాడు. ఇప్పుడతను మంచి నిషాలో ఉన్నాడు. ఆమె కిందకు దిగింది. అతడి భుజంమీద చెయ్యి వేసింది.

"నో మోర్ డ్రింకింగ్ ప్లీజ్!" అని ఎటాచ్ డ్

బాత్ రూమ్‌లోకి వెళ్ళింది. మెల్లిగా వెళ్ళి అతను గుమ్మంలో నిలబడ్డాడు. వెనుదిరిగి అతని వైపు చూసిందామె.

"ఏమిటలా వున్నావు?" అడిగిందామె.

తటాలున పేంట్ జేబులోంచి అతడు కత్తిని బయటకు తీశాడు. ఆమె ఉలిక్కిపడింది. బాత్ రూమ్‌లో లైటు వెలుగుతోంది. గుమ్మంలో అతడు యమదూతలా నిలబడి ఉన్నాడు. ఆమె బుర్ర శరవేగంగా ఆలోచిస్తోంది.

"ఏమిటీ ఘోరం? నిన్ను ఇంతగా ప్రేమించిన నాకు కత్తి చూపిస్తున్నావా? సిగ్గులేదూ?" అందామె కోపంగా.

అతడు కోపంగా ఆమెవైపు చూశాడు.

"ప్రేమ! ఏమిటి నీ ప్రేమ? నేను నీ దగ్గరకు వచ్చినప్పుడు ఇరవైఅయిదేళ్ళ యువకుడ్ని. నీ హస్తాల్లో నన్ను బంధించి, నీ బోన్లో యిరికించి నా సర్వాన్ని జుర్రుకు తాగి నీ కామాన్ని తీర్చుకుంటున్నావు. ఏభైవేలు యిమ్మని అడగ్గానే నీ ప్రేమెంతో నాకు వెంటనే తెలిసిపోయింది. ఇవాళతో మనిద్దరి బంధం శాశ్వతంగా తెగిపోయింది. ఇటుపైన ఏ యువకుడ్నీ వలేసి పట్టుకునే అవకాశం నీకు లేకుండా చేస్తాను."

"రాస్కెల్, అరుస్తాను. అందరూ పైకి వస్తారు. నువ్వు పట్టుబడిపోతావు!" అందామె.

"అరిచే అవకాశం నీకు రాదు" అని అతడామె నోరును ఎడంచేతో గట్టిగా నొక్కాడు. కుడిచేతిలోని కత్తి అమాంతంగా ఆమె వీపులోకి దిగింది. శమంత తటాలున కిందపడింది. ఆమె ఛాతీమీద మరో నాలుగు సార్లు పొడిచాడతను. ఆమె ధరించిన మాక్సీ రక్తమయ

మయింది. బాత్ రూమ్ గచ్చు నేల మీద రక్తం ప్రవ హిస్తోంది.

అతడు బేసిన్ దగ్గర కెళ్ళాడు. టాప్ తిప్పి కత్తినీ, చేతుల్నీ కడుక్కున్నాడు. తన గుడ్డల్ను పరీక్షించుకున్నాడు. గుమ్మం వైపు వెళ్ళాడు. అక్కడ నిలబడి రక్తం మడుగులో పడున్న శమంత వైపు చూశాడు.

పడగ్గదిలోకి చేరుకున్నాడు. జీరో వాట్ బల్బు కాంతిలో అతనంతా చూడగల్గాడు. తలగడ కిందున్న తాళంచెవుల గుత్తి తీసుకుని గాడ్రెజ్ బీరువాని తెరిచాడు. గదిలో దొరికిన ఒక బాగ్ లో నోట్లకట్టలను పడేసుకున్నాడు.

టైమ్ చూశాడు. బీరువాకి తాళంవేసి తాళంచెవుల గుత్తిని తలగడకింద పెట్టేశాడు. మెల్లిగా టేబుల్ దగ్గరకు వెళ్ళాడు. కొంచం విస్కీ గ్లాసులో పోసుకుని సోడా కలిపి గడగడా తాగేశాడు. గ్లాసును పాంట్ జేబులో దాచుకుని అతడు బయటకు నడిచాడు.

హాల్లోంచి వెనకవైపుకు వెళ్ళాడు. గడియలు తెరిచి, ఓ తలుపు తీసి, గడపదాటి బయట క్షణకాలం నిలబడి కిందకు చూశాడు. అంతా నిశ్శబ్దంగా వుంది. చుట్టూ చీకటి. అతడు మెల్లిగా మెట్లు దిగాడు. నేలమీద కాలు పెట్టి యిటూ అటూ చూసి చీకట్లోకి వెళ్ళిపోయాడు.

గోడవారగా నిలబడివున్న కూనయ్య తలను వెనక్కు తిప్పాడు. పిల్లిలా మెట్లు దిది చీకట్లోకి పారిపోతున్న ఆ వ్యక్తివైపు ఆశ్చర్యంగా చూశాడు.

కూనయ్య క్షణకాలం చీకట్లో మౌనంగా ఉండి పోయాడు. అతడు పైకి ఎందుకు వెళ్ళాడు? కూనయ్య ఆలోచిస్తూ మెట్ల ముందుకి వెళ్ళాడు. అతడి గుండె దడ

దడ కొట్టుకుంటోంది. మెల్లిగా మెట్లెక్కాడు. ఒక తలుపు తెరిచివుంది. అడుగులో అడుగు వేస్తూ కూనయ్య హాల్లోకి చేరుకున్నాడు. పక్కనున్న పడగ్గదిలోకి వెళ్లాడు. ఎటాచ్డ్ బాత్‌రూమ్ గుమ్మంలో నిలబడి నేలమీద పడున్న ఆమెను చూసి అరవబోయి నోరు నొక్కేసుకున్నాడు.

# 3

అప్పుడే వెలుగొస్తోంది. పనిమనిషి బెల్ నొక్కింది. ఆ ధ్వని విని రామయ్య లేచాడు. మెట్లగది గుమ్మంబయట వుంది ఎలక్ట్రిక్ బెల్.

గుమ్మం ముందు నడవలో పడుకున్న రామయ్య లేచి పనిమనిషివంక చూశాడు.

"అమ్మగారింకా నిద్దరోతుండారు" అన్నాడతను.

"ఇయాల ఆలస్యంగా కూడా వచ్చాను" అందామె.

"కాసేపు కూకో!" అన్నాడు రామయ్య.

"బెల్ మళ్ళా ఏసి చూడు!"

"బాబోయి!అమ్మకు కోపంవస్తే ఉద్యోగం వూడ్తుంది. నీ వయసులో ఉన్నదానికి 200 రూపాయలు ఎవ్వరూ యివ్వరు" అన్నాడతను.

అరగంటపాటు పని మనిషి ఇంటిచుట్టూ పచార్లు చేస్తూ కాలం గడిపింది. వెనక వైపున కూనయ్య ఆమెకు తటస్థపడ్డాడు.

"ఏం చెల్లీ యిక్కడ తిరుగుతున్నావు?"

"అమ్మగారు నిద్దరోతుండారు."

కూనయ్య సంచి పట్టుకుని గేటుదాటి బయటకు వెళ్ళిపోయాడు. అతడివైపు రామయ్య వింతగా చూశాడు. పనిమనిషి అతడి దగ్గరకు తిరిగివచ్చింది.

"బెల్ నొక్కయ్యా!"

రామయ్య బెల్ నొక్కాడు. డాబావైపు చూశాడు. బెల్ నొక్కగానే శమంత డాబామీద ప్రత్యక్షమయి వెనక తలుపులు తెరిచానని మామూలుగా చెప్పడం పరిపాటి.

రామయ్య కాసేపు ఆలోచించాడు.

"ఎనక తలుపులు తెరిచారేమో, చూద్దాం పద" అని అతడు వెనక్కి వెళ్ళాడు.

రామయ్య, వెనకనే పనిమనిషి మేడమెట్లు ఎక్కారు. ఒక తలుపు తెరిచి వుంది.

"చూశావా, తలుపు తెరిచి అమ్మ పడుకునివుంటుంది. నీ పని మాసుకో" అని రామయ్య కిందకు దిగాడు.

ముందు వైపుకు వెళ్ళి పచార్లు చేస్తున్నాడు.

పైనుంచి పనిమనిషి గావుకేక విని రామయ్య ఉలిక్కి పడ్డాడు. పిచ్చెత్తిన వాడిలా వెనక్కి పరుగెత్తి మేడ మెట్లెక్కి హాల్లోకి చేరుకున్నాడు. పడగ్గది గుమ్మంలో పని మనిషి నిలబడి వుంది. ఆమె మొహంలో భయం గోచరిస్తోంది.

"అమ్మగోరు! అమ్మగోరు బాత్ రూమ్‌లో పడున్నారు" అందామె.

రామయ్య పడగ్గదిలోకి వెళ్లాడు. బాత్ రూమ్ గుమ్మంలో నిలబడి లోపలకు చూశాడు. ఏడుస్తూ హాల్లోకి తిరిగొచ్చాడు.

"ఎంత గోరం!" అంది పనిమనిషి.

"ఇప్పుడేం చెయ్యాల?" అడిగాడు రామయ్య.

పనిమనిషి మాట్లాడలేదు.

"సుందరం బాబుకి చెప్పడం మంచిదేమో!"

"ఎల్లి చెప్పిరా."

"ఫోన్ చేసి చెపుతా" అని రామయ్య టెలిఫోన్ దగ్గరకు వెళ్ళాడు.

రిసీవర్ యెత్తి ఒక నంబరు తిప్పాడు. అటువైపు నుంచి ఒక స్త్రీ కంఠం వినపడింది. రామయ్య ఏడుస్తున్నాడు.

"ఎవరు నువ్వు, ఫోన్‌లో ఏడుస్తున్నావు?" అడిగిందా స్త్రీ.

"సుందరం బాబు కావాలమ్మా"

మరుక్షణంలో సుందరంబాబు అటువైపుకి వచ్చాడు.

"ఎవరు?"

"నేను బాబూ, రామయ్యని"

"రామయ్యా, ఎందుకలా ఏడుస్తున్నావు? ఏమైంది? అమ్మ కొట్టిందా?"

"లేదు బాబూ, అమ్మగారు బాత్‌రూమ్‌లో పడుండారు. అంతా రక్తం బాబూ."

"అమ్మ బతికుందా?"

"చచ్చిపోయినట్టుంది బాబూ."

"రామయ్యా, నేను వెంటనే వస్తున్నాను. నువ్వక్కడే వుండు. ఎవర్నీ పైకి వెళ్ళనీయకు" అని సుందరం రిసీవర్ని పెట్టేశాడు.

పక్కనున్న యువతిని రెండు చేతుల్తోటీ సుందరం పట్టుకున్నాడు.

"మాధవీ, అమ్మకేదో అయినట్టుంది. వెళ్ళి చూస్తే గాని ఏం జరిగిందో తెలీదు, వెళ్దాం పద."

"నేనెందుకండీ?"

"నువ్వాయింటి కోడలివి."

మాధవి పరిహాసంగా నవ్వింది.

"ఇంతవరకూ నేనా యింట్లో అడుగు పెట్టలేదు. ఇప్పుడు రాడం నా కిష్టం లేదు."

"చూడు మాధవీ, రామయ్య చెప్పిందాన్నిబట్టి అమ్మ చనిపోయిందని తెలుస్తోంది. అన్నయ్య అమెరికాలో వున్నాడు. ఈ పట్నంలో వున్నది నువ్వూ నేనే. అమ్మ పోతే ఆ యిల్లూ ఆస్తీ మనకే చెందుతాయి. మనం అక్కడ వెళ్ళి చూడాలి."

"అయితే పదండి వెళ్దాం" అంది మాధవి.

సుందరం స్కూటర్ని యింటి ముందుకు తీసుకెళ్ళి ఆపాడు. వీధి తలుపు మూసి తాళంవేసి వచ్చింది మాధవి. అతను స్కూటర్ని స్టార్టుచేసి కూచున్నాడు. వెనుక సీటు మీద మాధవి సర్దుకుంది. సుందరం స్కూటర్ని పోనిచ్చాడు.

ఇరవై నిముషాల్లో ఛామియర్స్ రోడ్డులో వున్న ఆ యింటి ముందు స్కూటర్ ఆగింది. రామయ్య ఏడుస్తూ సుందరం కెదురుగా వచ్చాడు.

"రండి బాబూ, వెనక మెట్లమ్మట వెళ్దాం."

సుందరం, మాధవి వెనుక మెట్లెక్కి పైకి వెళ్లారు. బాత్ రూమ్ గుమ్మంలో నిలబడి నేలమీద పడున్న తన తల్లివైపు సుందరం చూశాడు. "అమ్మా!" అని ఏడుస్తూ మాధవి భుజంమీద తల వాల్చేశాడు. ఆమె అతడిని మెల్లిగా తీసుకొచ్చి హాల్లో వున్న సోఫాలో కూర్చోబెట్టింది. అతనివైపు దీనంగా చూసింది. "ఈ సమయంలో మీరు ధైర్యంగా వుండాలి. మీ అమ్మను యెవరో ఘోరంగా హతమార్చారు. మీరు వెంటనే పోలీసు రిపోర్టు యివ్వాలి."

సుందరం భార్య చెయ్యిని పట్టుకున్నాడు.

"మాధవీ, ఆ రిపోర్టు ఏదో నువ్వే యియ్యి."

మాధవి టెలిఫోన్ దగ్గరకెళ్ళి రిసీవరెత్తి నంబరు తిప్పింది. అటువైపు నుంచి పురుష కంఠం వినపడింది.

"హలోవ్, నా పేరు మాధవి. మా అత్తగార్ని ఎవరో హత్యచేశారు. నా భర్త పేరు సుందరం. మే మిద్దరం యిక్కడే వున్నాం" అందామె.

"అడ్రసు చెప్పండి."

ఆమె అడ్రసు చెప్పింది.

"మేమొస్తున్నాం. ఎవర్నీ ఏదీ ముట్టుకోనివ్వకండి" హెచ్చరించాడు పోలీసాఫీసరు అటువైపు నుంచి.

## 4

డిటెక్టివ్ వాలి తాజ్ కోరమాండల్ హోటల్లో పడకకుర్చీలో పడుకుని దిన పత్రిక చూస్తున్నాడు. టెలిఫోన్ మ్రోగింది. గిరి రిసీవర్ని అందుకున్నాడు.

"మీకోసం సార్" అని గిరి రిసీవర్ని వాలి కిచ్చాడు.

"హలో, వాలి హియర్."

"వాలిగారూ. ఏదో హత్య జరిగినట్లు యిప్పుడే రిపోర్టు వచ్చింది. దయచేసి మీరు అక్కడికి వస్తే చాలా సంతోషిస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

"నాయర్ భాయ్, అడ్రెస్ చెప్పు" అన్నాడు వాలి.

ఇన్‌స్పెక్టర్ నాయర్ అడ్రెస్ చెప్పాడు.

"ఆల్ రైట్ వస్తున్నా" అని వాలి రిసీవర్ని పెట్టేశాడు.

వాలి పడక్కుర్చీలోంచి లేచాడు. అతని నోట్లో పొడు గాటి చుట్ట వెలుగుతోంది. తన బుగ్గమీసాల్ను ఓ సారి వేళ్ళతో నిమురుకుని అతడు గిరివంక నవ్వుతూ చూశాడు.

"గిరీ, గత మూడు రోజుల్నుంచీ మనం విశ్రాంతిగా కాలాన్ని గడిపేస్తున్నాం. ఇప్పుడు పని తగిలింది, వెళ్దాం పద!"

వాలి గదిలోంచి బయటకు నడిచాడు. తలుపుమూసి తాళంవేసి గిరి గబగబా వాలిని వెంబడించాడు. ఇద్దరూ లిఫ్ట్‌లో కిందకు దిగారు. కింద హాల్లోంచి ఠీవిగా నడుస్తూ వెళ్తున్న వాలికి హోటల్ మేనేజర్ నమస్కరించాడు.

కాంపౌండ్‌లో వున్న ఎక్స్.వై.జడ్. కారులో వాలి ముందుసీటు మీద కూర్చున్నాడు. గిరి కారుని పోనిచ్చాడు.

కారు శరవేగంగా ప్రయాణం చేస్తోంది. వాలి మౌనంగా కూర్చుని బయటకు చూస్తున్నాడు. చుట్టపొగ పీల్చి వదుల్తున్నాడు.

పది నిముషాల్లో గేటు దాటి ఒక కాంపౌండులో పోలీసుజీప్ వెనకనే గిరి కారు నాపాడు. వాలి, గిరీ కిందకు దిగారు. గేటు ప్రాంతంలో, కాంపౌండులో అనేకమంది ప్రజలు నిలబడి వున్నారు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ పరుగెడ్తూ వాలి ముందుకొచ్చాడు.

"వాలిగారూ, నమస్కారం సార్. మీరు వెంటనే వచ్చినందుకు చాలా ఆనందిస్తున్నాను."

"నాయర్ భాయ్, మనం యెక్కడికెళ్ళాలి?"

"పైకి వెళ్ళాలి. ముందు తలుపులు మూసి వున్నాయి. మీరు వచ్చి చూసిందాకా ఆ తలుపుల్ని తెరవొద్దన్నాను. మనం వెనక వైపు నుంచి వెళ్దాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

ఇన్‌స్పెక్టర్ నాయర్, వాలి, గిరి వెనకవైపుకి వెళ్ళి మెట్లెక్కి పైకి చేరుకున్నాడు. బాత్‌రూమ్‌లో లైటు

ఇంకా వెల్గుతోంది. వాలి నేలమీద పడున్న స్త్రీవైపు పరీక్షగా చూశాడు. శవం పక్కకి తిరిగి పడుంది. ఛాతీ మీద, వీపుమీద కత్తిపోట్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆమె ధరించిన మాక్సీ రక్తంతో ఎర్రబడింది. ఆమె పాదాలు, పిక్కలు పచ్చగా కనిపిస్తున్నాయి. ఆమె ఒంటిమీద నగలు లేవు. ఒళ్ళంతా బోడిగా వుంది. నుదురు మీద బొట్టులేదు. హత్యకు ఉపయోగించిన ఆయుధం గదిలో యెక్కడా లేదు.

చుట్టపాగ పీల్చి వదుల్తూ వాలి బాత్ రూమ్ నాలుగు వైపులా చూశాడు. ఒకవైపున కమోడ్ వుంది. రెండో వైపున సింక్, రెండు కుళాయిలు, గోడకద్దం కనిపిస్తున్నాయి. మరోవైపున వీనస్ ఎలక్ట్రిక్ హీటర్ పైన అమర్చబడి వుంది.

వాలి పక్కనున్న ఇన్స్పెక్టర్ వైపు తిరిగాడు.

"ఈమె పేరు?"

"శమంత సార్."

"అమ్మాయి విధవా?"

"యూ ఆర్ రైట్ సార్. ఆమె భర్త పన్నెండేళ్ళ క్రితం మరణించారు. పెద్దకొడుకు మోహన్ అమెరికాలో వుంటున్నాడు. రెండోకొడుకు సుందరం ఇదే పట్నంలో తన భార్యతో వేరే వుంటున్నాడు. ఈ మేడమీద శమంత ఒంటరిగా వుంటోంది. కిందభాగం అద్దెకిచ్చి ఆమె మేడ మీద వుంటోంది.

వాలి ఆలోచిస్తూ పడగ్గదిలో వెళ్ళాడు. రెండు గాద్రెజ్ బీరువాలు, ఒక టేబుల్ వగైరా వున్నాయి. ఫాన్ కింద డబుల్ కాట్ వుంది. గదిలో జీరో వాట్ బల్బు వెల్గుతోంది. ఫాన్ తిరుగుతోంది.

టేబుల్ మీద స్కాచ్ విస్కీ బాటిల్ని వాలి పరీక్షించాడు. అందులో సగంపైగా విస్కీ వుంది. పక్కనే ఒక సోడాబుడ్డి ఖాళీగా వుంది. మరో బుడ్డీలో కొద్దిగా సోడా వుంది.

వాలి వెనక్కి తిరిగాడు. గిరి వెనకనే వున్నాడు.

"గిరీ, సుందరం యెక్కడున్నాడు?"

"హాల్లో వున్నాడు" అన్నాడు గిరి.

వాలి బయటకు నడిచాడు. హాల్లోని పెద్ద సోఫాలో సుందరం, మాధవి పక్కపక్కనే కూర్చుని వున్నారు. సుందరం ఏడుస్తున్నాడు.

సుందరం ఎదురుగా ఆగాడు వాలి.

"అబ్బాయి, సుందరం నువ్వేనా?"

"నేనే సార్. ఈమె నా భార్య మాధవి."

వాలి అతడివైపు సూటిగా చూశాడు.

"ముసలి తల్లిని ఒంటరిగా వదిలి నువ్వు వేరే కాపురం పెట్టడం విచిత్రంగా వుంది!" అన్నాడు వాలి.

"బాగా డబ్బున్న కుటుంబాల్లో యిటువంటివి జరుగుతూ వుంటాయి సార్. నా భార్యంటే మా అమ్మకు యిష్టంలేదు. మాధవి నా కాలేజ్ మేట్ చెల్లెలు. ఆమెను ప్రేమించి పెళ్ళాడాను. అమ్మ ఈ పెళ్ళికి ఒప్పుకోలేదు. అన్నయ్య అమెరికా వెళ్ళి అక్కడో యువతిని పెళ్ళాడితే ఆమె ఏమీ అనలేదు. కాని నా పెళ్ళి విషయంలో ఆమె మొండిపట్టు పట్టింది. చివరకి యిల్లువదిలి వెళ్ళిపోయి ఆమెను పెళ్ళాడాను."

"నువ్వు ఏం చేస్తున్నావు?"

"బి.యి. పాసయ్యాను. ఒక ప్రయివేట్ యింజనీరింగ్

కంపెనీలో పనిచేస్తున్నాను. సంపన్న కుటుంబంలో పుట్టినా పెళ్ళయ్యాక మధ్యతరగతివాడిలా నేనో చిన్న ఫ్లాట్‌లో జీవిస్తున్నాను."

"అబ్బాయ్, మీ నాన్న ఏం చేసేవాడు?"

"ఆయన ఇండియన్ ఫారెస్టు సర్వీస్‌లో వుండేవారు. ఒక విమానం ఎక్సిడెంట్‌లో ఆయన మరణించారు."

"మీ అమ్మకి యెవరేనా శత్రువులున్నారా?"

"ఎవరుంటారు సార్? ఆమె సాధారణంగా పరాయి వాళ్ళతో కలిసి తిరిగే రకం కాదు. మొదట్నించీ ఆమె చాలా దర్జాగా పెరిగింది. ఆమెకున్న స్నేహితులు చాలా తక్కువమంది."

"నువ్వూ నీ భార్యా యిక్కడికొచ్చి ఆమెను అప్పుడప్పుడు చూస్తూ వుండేవారా?"

"నేను తరచు వచ్చి ఆమెను చూసి వెళ్ళిపోతూ వుండేవాడిని. అమ్మ బ్రతికుండగా నా భార్య యెప్పుడూ యిక్కడికి రాలేదు. ఇవేళే మొదటిసారిగా వచ్చింది!"

"మీ అమ్మ పోయాక ఈ ఆస్తంతా ఎవరికి కుంది?"

"అమెరికాలో వున్న అన్నా నేనూ పంచుకోవాలి."

వాలి అతనివైపు సూటిగా చూశాడు.

"మీ అమ్మ ఒంటిమీద బాగా నగలు ఉండేవను కుంటాను. ఇప్పుడవేవీ కనబడ్డంలేదు!"

"వాలిగారూ, శవాన్ని చూశాక నేనూ వాటిని గురించే ఆలోచించాను. అమ్మ చెవులకు డైమండ్ కమ్మలుండేవి. పది కాసుల చంద్రహారం ఆమె మెళ్ళో ఎప్పుడూ ఉండేది. కుడిచేతికి అరడజను గాజులుండేవి. ఎడంచేతికి అమెరికాలో కొన్న ఖరీదయిన ఆటోమాటిక్ వాచ్ వుండేది. అవన్నీ యిప్పుడులేవు. డబ్బుకోసం ఈ

హత్య జరిగిందేమో" అన్నాడు సుందరం.

"అబ్బాయ్, కింద భాగంలో ఎవరుంటున్నారు?"

"గత పదేళ్ళుగా కామరాజు అనే ఆయన ఉంటున్నారు? ఆయనిచ్చే అద్దె చాలా తక్కువ. పదేళ్ళ క్రితం అయిదువందలు అద్దె ఆయనిచ్చేవారు. ఇప్పుడూ అదే అద్దె మీద ఉంటున్నారు. ఈ పదేళ్ళల్లోనూ ఈ ప్రాంతంలో అద్దెలు బాగా పెరిగిపోయాయి. ఆయనుండే గ్రవుండ్ ఫ్లోర్‌కి ప్రస్తుతం అనేకమంది రెండువేలు యివ్వడానికి సిద్ధంగా వున్నారు. అమ్మతో ఈ విషయం నేనెన్నిసార్లో చెప్పాను. ఆమె కామరాజుతో మాట్లాడుతాననేది. కాని అద్దె మాత్రం అయిదువందల్లోనే ఉండిపోయింది."

"అబ్బాయ్, అయిదువందలు ఆఫీషియల్‌గా యిచ్చి అతను బ్లాక్‌లో వేరే యిచ్చేవాడేమో!"

"దాన్ని గురించి నేను చెప్పలేను సార్."

"మీ అమ్మ దగ్గర రొక్కంగా చాలా డబ్బుందా?"

"చాలా వుందని పెద్దమ్మ ఎన్నిసార్లో చెప్పేది."

అదే సమయంలో ఏడుస్తూ ఒక స్త్రీ వెనుకవైపు నుంచి హాల్లోకొచ్చింది. సుందరం పరుగెత్తుకెళ్ళి ఆమెను కౌగలించుకుని ఏడవసాగాడు. ఇద్దరూ గోడవారగా కూలబడిపోయి ఏడుస్తున్నారు. వాలి సమీపంలో నిలబడి వాళ్ళను గనునిస్తూ వుండిపోయాడు.

కొంతసేపయినాక వాలి మెల్లిగా వాళ్ళముందు కెళ్ళాడు. ఆమె వయిపు సూటిగా చూశాడు. ఆమె వయస్సు అరవయ్యేళ్ళుంటుంది.

"అమ్మాయ్, శమంత నీ చెల్లెలా?"

"అవును సార్. రాత్రికి రాత్రి దాని జీవితం ఇలా అడుగంటిపోతుంతని నేను కల్లో కూడా అనుకోలేదు.

నిన్న రాత్రి దాంతో ఫోన్‌లో మాట్లాడేను...."

"ఎన్నింటికి?"

"ఎనిమిది ప్రాంతంలో! ప్రొద్దుటే నన్నిక్కడికి రమ్మంది. ఇడ్లీ, చట్నీ, సాంబారు చేయించి ఉంచుతా నంది. చిన్నప్పట్నించీ మా యిద్దరికీ తిండంటే మహా యిష్టం."

"అమ్మాయ్, నువ్వోకసారి లోపలికి వెళ్ళి నీ చెల్లెలి శవాన్ని చూసిరా!"

ఆమె కళ్ళమ్మట నీళ్లు జలజల కారాయి.

"నేను హార్టు పేషెంటుని. అందుకే యిక్కడ కూర్చుండిపోయాను."

"నీ చెల్లెలు దగ్గర చాలా డబ్బుందా?"

"చాలా వుండాలి సార్. బ్యాంకుల్లో కనీసం ఏడెనిమిది లక్షలు ఉంటుంది. అనేక పెద్ద కంపెనీల్లో ఆమెకు షేర్లు ఉన్నాయి. యింట్లో రెండుమూడు లక్షలు ఎప్పుడూ రొక్కంగా ఉంటుందని ఆమె నాతో ఎన్ని సార్లో అంది. ఆమె దగ్గర లక్షపైన విలువచేసే నగలు ఉన్నాయి."

ఇన్స్పెక్టర్ నాయర్ అక్కడకొచ్చాడు. వాలి అతడివైపు తిరిగాడు.

"నాయర్ భాయ్, శమంత యింట్లో ఎన్నో నగ లుండాలి. రొక్కంగా చాలా డబ్బు ఉండాలిట. నీ సమక్షంలో శమంత కొడుకు సుందరం బీరువాలూ అవీ తెరిచి చూడ్డం మంచిది. ఎంతపోయిందో మనకు తెలుస్తుంది" అన్నాడు వాలి.

"అలాగే చేయిస్తాను సార్" అన్నాడు ఇన్స్పెక్టర్.

వాలి హాల్లోనుంచి ముందువైపుకు వెళ్ళాడు. గిరి

వెనకనే నడిచాడు. ముందు మెట్లపైనున్న తలుపులు బిగించబడి వున్నాయి.

"ఇటువైపు నుంచి ఎవ్వరూ పైకి రాలేదని మనం అనుకోవాలి" అన్నాడు వాలి.

"నౌఖరు రామయ్య మెట్ల గదిలోనో, లేక గదిముందు వరండాలోనో పడుకుంటాడట. ఎవరైనా యిటువైపొస్తే అతడు చూసేవాడు" అన్నాడు గిరి.

వాలి చుట్ట పీలుస్తూ క్షణకాలం ఆలోచిస్తూ ఉండి పోయాడు.

"గిరీ, యీ తలుపులను బట్టి మనం ఏదీ నిర్ణయించ లేము. ముందు మెట్లు ఎక్కివచ్చిన వ్యక్తి, యీ తలు పులకు గడియలు బిగించి వెనక తలుపులు తెర్చుకుని వెళ్ళిపోయి వుండొచ్చు! కాని యీ తలుపులు ఒక్క విషయాన్ని మనకు తెలియజేస్తున్నాయి. ముందు తలు పులూ, వెనక తలుపులూ మూసుకుని శమంత నిద్ర బోతుంది. ఎవరైనా పైకి ఎలా రాగలరు? తలుపులు పగలగొట్టి రావాలి. కాని అటువంటి సూచనలు ఎక్కడా లేవు. అయితే ఎలా వచ్చారు? ఆమె తలుపులు తెరిచి ఉండాలి!" అన్నాడు వాలి.

తార్కికంగా ఆలోచించి వాలి చెప్పినది విని గిరి ఆశ్చర్యపోయాడు.

"వాలిగారూ, ఎవరో హంతకుడు వస్తే ఆమె తలుపు ఎందుకు తెరుస్తుంది?" ప్రశ్నించాడు గిరి.

వాలి గంభీరంగా నవ్వాడు.

"గిరీ, హంతకుడు కూడా మనిషే! అది మర్చిపోకు! పులిని చూసి అందరూ భయపడ్తారు. పిల్లిని చూసి అంతగా భయపడరు. పులి పిల్లి రూపంలో యింట్లోకి

రావచ్చు. వచ్చాక దాని నిజరూపం తెలుస్తుంది. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభించదు!" అన్నాడు వాలి.

"అయితే ఆమెకు బాగా తెలిసిన వ్యక్తి ఎవరో వచ్చుండాలి! అతడు తలుపును తట్టితే ఎవరేనా చూసి వుండొచ్చు."

ఆలోచిస్తూ వాలి నడవలో పచార్లు చేస్తూ డాబా మీదకు వెళ్ళి నలువైపులా చూశాడు. వెనుదిరిగివస్తూ కిటికీలోంచి హాల్లోని టెలిఫోన్ వైపు చూశాడు.

"గిరీ, ఇది పోష్ లొకాలిటీ! ఇక్కడ ఎవ్వరూ తలుపులు తట్టి గట్టిగా అరవరు. ఇంటికొచ్చినవాళ్ళు యెలక్ట్రిక్ బెల్ నొక్కుతారు. కాని బెల్ నొక్కితే అనేకమంది వింటారు. కొందరు ఫోన్ చేసి, టైమ్ ప్రకారం వస్తారు. బెల్ నొక్కవలసిన అవుసరం అప్పుడు వుండదు. యెవరో ఫోన్‌లో మాట్లాడి వచ్చుండాలి. ఆమె తలుపు తెర్చివుండాలి!"

"చాలా దగ్గర మనిషి అయితేగాని ఆ సమయంలో ఆమె తలుపు తెరవదు!" అన్నాడు గిరి.

"దగ్గర వ్యక్తే! కొడుకు కావచ్చు!" అని వాలి కళ్ళు మూసుకుని తీవ్రంగా ఆలోచించాడు.

పల్చటి సిల్కు మేక్సీలో ఉన్న శవం అతడికి జ్ఞప్తి కొచ్చింది. మేక్సీ అడుగున మరేదుస్తులూ లేవు!

"కొడుకు కావచ్చు! ప్రియుడు కావచ్చు!" అన్నాడు వాలి.

గిరి ఫక్కున నవ్వాడు.

"ఆమెకు ప్రియుడున్నాడంటారా?"

"గిరీ, ప్రస్తుతం నేను ఆలోచిస్తున్నాను. ఆమె

పెదిమలమీద లిప్ స్టిక్ ఉంది. ఆమె పల్చటి మేక్సీలో ఉంది. పడగ్గదిలో స్కాచ్ విస్కీ బాటిల్, సోడా బుడ్లు ఉన్నాయి. ఆమెకు తాగే అలవాటు వుండొచ్చు! దాన్ని గురించి మనం కనుక్కోవాలి" అన్నాడు వాలి.

## 5

వాలి మెట్లమ్మట కిందకు దిగాడు. వెనక వైపున కారు షెడ్ ప్రక్కనే ఒక గది వుంది. ఆ గది తలుపుకు బయట తాళం వేసివుంది. అతడు షెడ్ లోకి చూశాడు. ఏ కారూ లేదు. ఖాళీగావుంది. నేలను వాలి పరీక్షించాడు. నేలమీది గుర్తులనుబట్టి యీ షెడ్ లో ఏ స్కూటరో ఉంచుతూ ఉండాలి.

వాలి మరి కొంతదూరం నడిచి ముందు మెట్లు దిగే చోటుకు వెళ్ళాడు. రామయ్య అక్కడ పచార్లు చేస్తున్నాడు. వాలి అతడివంక పరీక్షగా చూశాడు. బాగా ఏడ్చినట్లున్నాయి అతడి కళ్ళు.

"నువ్వేనా రామయ్య?" అడిగాడు వాలి.

"అవును సార్."

"ఆమె మరణించినందుకు నువ్వుచాలా ఏడ్చినట్లున్నావు. ఆమె పోతే నీ ఉద్యోగం పోతుందా?"

"కాదుసార్. పదేళ్ళపైగా ఇక్కడ పనిచేస్తున్నాను. కోపం వస్తే కొట్టేది. కాని మరుక్షణంలో దయచూపేది. ఆమెపోతే నా దగ్గరమనిషి యెవరో పోయినట్లు అనిపించింది."

"నిన్నరాత్రి అమ్మతో నువ్వు మాట్లాడేవా?"

"డాబామీదనుంచి అమ్మగారు నాతో మాట్లాడారు. భోజనం చేసి పడుకుంటానన్నారు. యెవర్నీ పైకి రానీయ వద్దన్నారు."

"రాత్రిళ్ళు ఆమెకోసం యెవరేనా వచ్చేవారా?"

"యెవ్వరూ రారు సార్. రాత్రిళ్ళు ఆమె పెందరాళే పడుకుని వెలుగురాొచ్చేలోపల లేచేవారు."

"పైన ఫోను మోగితే నీకు వినపడ్తుందా?"

"వినపడుతుంది సార్."

"క్రితం రాత్రి ఏడు తర్వాత ఫోన్ కాల్స్ వచ్చాయా?"

"రెండుసార్లు ఫోన్ మ్రోగడం నాకు వినపడింది, సార్."

వాలి చుట్టపాగ పీల్చి వదులుతూ ఆలోచించసాగాడు. అక్క సుబ్బలక్ష్మి ఫోన్ చేసి శమంతతో మాట్లాడింది. ఒక కాల్ సుబ్బలక్ష్మిదైతే రెండో కాల్ యెవరిది? హత్య చేసిన వ్యక్తి కాలా అది?

"నిన్నరాత్రి నువ్వు యెన్నింటికి పడుకున్నావు?"

"పదకొండింటికి సార్. అప్పటిదాకా నేనూ, కూనయ్యా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం."

"కూనయ్య యెవరు?"

"వాడు కిందవుండే కామరాజుగారి నౌఖరు."

"కామరాజు యింట్లో వున్నాడా?"

"ఆయన స్కూటర్ మీద ఆఫీసుకెళ్ళిపోయారండి. ఏడింటికల్లా ఆయన వెళ్ళిపోతారు. రాత్రి తిరిగొస్తారు. ఆయన తల్లి యింట్లో వొంటరిగా ఉంటుంది."

"అతడికి పెళ్ళి కాలేదా?"

"పెళ్ళిచేయడానికి ఆయన తల్లి ప్రయత్నిస్తున్నారు."

"అతడు పైకెళ్ళి శమంతతో మాట్లాడుతూ ఉంటాడా?"

"యెక్కువగా వెళ్ళరు సార్! వెళ్ళినా రెండు

మూడు నిమిషాల్లో తిరిగి వచ్చేసేవారు."

"కూనయ్య యెక్కడున్నాడు?"

వాడు పొద్దుటే సంచిపట్టుకుని బయటకు వెళ్ళాడండి. ఇంకా రాలేదు."

"అతదెక్కడ పడుకుంటాడు."

"షెడ్ పక్కన చిన్న గది వుంది. అందులోనే వుంటాడు."

"అతడికి భార్య లేదా?"

"భార్య చనిపోయింది సార్, కూతురుకి పెళ్ళయి సంవత్సరమైంది. అది మొగుడితో ఉంటుంది."

గిరి కిందకు పరుగెత్తు కొచ్చాడు. వాలి అతనివైపు తిరిగారు.

"వాలిగారూ, ఆమె ఒంటిమీద నగలు, కనీసం రెండు లక్షల రొక్కం పోయివుంటుందని సుబ్బలక్ష్మి, సుందరం అంటున్నారు" అన్నాడు గిరి.

"యెక్కవే" అన్నాడు వాలి.

"డాక్టర్ సుధాకర్ శవాన్ని పరీక్షించారు. ఆమె క్రితం రాత్రి పదకొండు తర్వాత, ఒంటిగంటముందు మరణించి ఉంటుందని అన్నారు! శవ పరీక్ష పూర్తిగా జరిగాక సరైన టైమ్ తెలుస్తుందన్నారు."

వాలి ఆలోచిస్తూ సమీపంలో ఉన్న చెట్టుకిందకు వెళ్ళాడు. గిరి యెదురుగా సమీపంలో నిలబడ్డాడు.

"గిరీ, పదకొండు తర్వాత యెవరైనా పైకి వెళ్ళుంటే తప్పక ఆమె తలుపు తెర్చివుండాలి! యెవరో ఫోన్ చేసి ఆమెతో మాట్లాడారు. యెప్పుడు వచ్చేది చెప్పారు. ఆమె తలుపు తెర్చింది!" అన్నాడు వాలి.

"యెవరై ఉంటారు?"

"అది మనం కనుక్కోవాలి. సుందరాన్ని గమనిస్తూ వుండు! శమంత పోతే వెంటనే లభించేది అతడికే! అన్న అమెరికాలో వున్నాడు. అతడు యిక్కడకు రాక పోవచ్చు!"

"సుందరంతో మాట్లాడాను, సార్. శమంత అమెరికా వెళ్ళి వచ్చిందట. తన తల్లి మనసు కొంతకాలం పోయాక మారుందనే నమ్మకంలో సుందరం వేరే కాపురం పెట్టాన్నాడు. అతడా హత్య చేసే వ్యక్తిలా కనబడ్డంలేదు!" అన్నాడు గిరి.

గేటు దాటి ఒకతను మెల్లిగా లోపలకు వచ్చాడు. వాలి అతడివైపు వెళ్ళాడు.

"ఎవరు నువ్వు?" అడిగాడు వాలి.

"నేను యిక్కడ పనిచేస్తున్నాను సార్. నా పేరు కూనయ్య."

"వెళ్ళు!" అన్నాడు వాలి.

కూనయ్య వెనక వైపుకు వెళ్ళాడు. వాలి పెద్ద అంగల్లో అటువైపు కదిలాడు. కూనయ్య తన గదికి వేసిన తాళాన్ని తెర్చి లోపలకు వెళ్ళాడు. గుమ్మంలో నిలబడి వాలి లోపలకు చూశాడు.

కూనయ్య గాభరాగా వెనక్కు వచ్చాడు.

"అయ్యా, మీరా?" అన్నాడతను.

అతడివైపు సూటిగా చూశాడు.

"నిన్నరాత్రి యీ గదిలోనే పడుకున్నావా?"

అతడు తలాడించాడు.

"పదకొండు తర్వాత యెవరేనా పైకి వెళ్ళడం చూశావా?"

"లేదు సార్. ఏమైంది?"

"కూనయ్యా, కాంపౌండులో పోలీసులు, ప్రజలు ఎందరో వున్నారు. ఏం జరిగిందో తెలియదా?"

"ఏదో హత్యని రోడ్డుమీద వాళ్ళు చెప్పుకుంటుంటే విన్నానండి. ఏదీ వివరంగా తెలీదు."

"పైనుండే శమంతను యెవరో చంపారు!" అన్నాడు వాలి.

కూనయ్య ఉలిక్కిపడ్డాడు.

"హత్యచేసిన వ్యక్తి వెనక మెట్లమ్మట పైకి వెళ్ళాడు. నువ్వీ గదిలోంచి అతడిని చూడొచ్చు!"

"నేను చూడలేదు సార్. నిన్న రామయ్యతో మాట్లాడి తర్వాత వచ్చి పడుకున్నాను."

"పొద్దుటే యెక్కడికెళ్ళావు?"

"నా కూతురింటికి వెళ్ళానండి. అల్లుడు తాగుబోతు. తాగి దాన్ని వాయిస్తున్నాడని విని పొద్దుటే వెళ్ళాను."

"నువ్వు పట్టుకెళ్ళిన సంచి ఏమైంది?"

"అది పిల్ల యింట్లో వదిలేశాను, సార్. కొంచెం బియ్యం అందులో పోసి పట్టుకెళ్ళి దానికిచ్చాను."

"నీ అల్లుడు ఏం చేస్తున్నాడు?"

"కూలిపని చేసుకుని బతుకుతున్నాడు. కూలిపని దొరక్కపోతే నా కూతుర్ని తంతాడు. తండ్రినడిగి ఏదైనా పట్రామంటాడు."

"నీ కూతురు ఎక్కడుంటోంది?"

"అదొక గుడిసె సార్. మారుమూలుంది."

క్షణకాలం వాలి కూనయ్యవైపు పరీక్షగా చూశాడు. కూనయ్య ఏదో దాస్తున్నాడు. అతడి ఒళ్ళు వణుకుతోంది. కళ్ళలో భయం స్పష్టంగా కనిపిస్తోంది.

వాలి వెనక్కు తిరిగి దూరంగా నడిచాడు. వెనక నే

వచ్చాడు గిరి.

"గిరీ, కూనయ్య కూతురు గుడిసె రామయ్యకు తెలిసి వుండొచ్చు. అతడితో నువ్వు అక్కడకు వెళ్ళు. కూనయ్య పొద్దుటే వెళ్ళి ఒక సంచిని తన కూతురు యింట్లో వదిలాడు. అందులో బియ్యం పోసి పట్టుకెళ్ళానని నాతో అనడం నువ్వు వినే వుంటావు!"

"అంతా విన్నాను, సార్."

"అక్కడికి వెళ్ళి ఆ సంచిలో ఏముందో కనుక్కో!"

"అలాగే సార్" అని వెళ్ళిపోయాడు.

వెనక మెట్లెక్కి వాలి పైకి వెళ్ళాడు. హాల్లో ఒక కానిస్టేబుల్ నిలబడి వున్నాడు. సోఫాల్లో సుందరం, మాధవి, సుబ్బలక్ష్మి కూర్చుని వున్నారు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ నవ్వుతూ వాలి దగ్గరకొచ్చాడు.

"వాలిగారూ, మీ కోసం చూస్తున్నాను" అన్నాడు యిన్‌స్పెక్టర్ నాయర్.

"నాయర్ భాయ్, ఏదేనా తెల్సిందా?"

"డాక్టర్ సుధాకర్ శవాన్ని పరీక్షించి వెళ్ళిపోయారు. ఫోటోలు తీయడం పూర్తయింది. పడగ్గదిలో, బాత్‌రూమ్‌లో మా ఫింగర్ ప్రింట్స్ వాళ్ళు పనిచేస్తున్నారు."

"నాయర్ భాయ్, పడగ్గదిలో టేబుల్ మీద స్కాచ్ విస్కీ బాటిల్, సోడా బుడ్లు వున్నాయి. వాటిమీద వేలిముద్రలు వున్నాయేమో చూడమను" అన్నాడు వాలి.

"వాటినిగురించి నేను మర్చిపోయాను, సార్. ఇప్పుడు వాళ్ళకు చెప్తాను" అని యిన్‌స్పెక్టర్ పడగ్గదిలోకి పరిగెత్తాడు.

ఆరిపోయిన చుట్టను వాలి లైటర్‌తో వెలిగించి పొగ

పీల్చి వదులుతూ సుందరం ముందు నిలబడ్డాడు.

"అబ్బాయి, నీ తల్లి అమెరికా వెళ్ళి వచ్చిందని విన్నాను. ఆమెకు తాగే అలవాటుందా?"

"అమ్మ తాగడం నేను చూడలేదు సార్."

"ఆమె గదిలో స్కాచ్ విస్కీ బాటిల్ యెందుకుందో!" అన్నాడు వాలి.

"నేను చెప్పలేను సార్."

"అబ్బాయి, నువ్వు తాగుతావా?"

"నాన్నగారు తాగేవారు. నేను డ్రింకర్ని కాను సార్, కాని అప్పుడప్పుడు కొద్దిగా తాగుతాను."

"మీ అమ్మ టేబుల్ మీదున్న విస్కీ బాటిల్ని నువ్వు చూశావా?"

"ఆమె టేబుల్ మీద విస్కీ బాటిల్ వుండడం నేను గమనించాను."

"ఆమె నీకు విస్కీ ఆఫర్ చేసిందా?"

"లేదు సార్. నేను యీ యింట్లో వున్నంతకాలం స్టూడెంట్ని. పెళ్ళిముందు నేను బయటకు వెళ్ళిపోయాను. తర్వాత నాకు ఉద్యోగం వచ్చింది. అమ్మ నాకెన్నడూ విస్కీ యివ్వలేదు."

వాలి అతడి వంక సూటిగా చూశాడు.

"నిన్న రాత్రి పదకొండు, ఒంటి గంట మధ్య నువ్వు యెక్కడున్నావు?"

"ఇంట్లోనే వున్నాను. పదింటికే నిద్రపోయాను."

వాలి విచిత్రంగా నవ్వాడు.

"కొత్తగా పెళ్ళయినవాడివి, పదింటికే పడుకున్నావా?"

సుందరం ఏం చెప్పాలో తోచక భార్యవైపు చూశాడు.

"ఆయన నిన్న ఐదింటికి ఆఫీసునుంచి వచ్చారు. ఎనిమిదింటికి భోజనం చేశాం, పదింటికి పడుకున్నాం" అంది మాధవి.

గబగబా గిరి హాల్లోకొచ్చాడు. వాలి అతడితో హాలు మూలకు వెళ్ళాడు. గిరి చేతిలో సంచి వుంది.

"వాలిగారూ, కూనయ్య కూతురు గుడిసెలో లేదు. లోపలకు నేనూ రామయ్యా వెళ్ళాం. నులక మంచం కింద ఒక ట్రంకుపెట్టె వుంది. పెట్టె తెరిచి చూస్తే యీ సంచి గుడ్డలకింద వుంది. సంచిలో వున్నవాటిని చూసి ఆశ్చర్యపోయాను!" అన్నాడు గిరి.

వాలి సంచిలో వున్న నగలను చూశాడు. చంద్రహారం! డైమండ్ కమ్మలు. బంగారం గాజులు! ఆటోమేటిక్ అమెరికన్ వాచ్!

"వాలిగారూ, కూనయ్యను మీరు ఎలా అనుమానించారో నాకు ఆశ్చర్యంగా వుంది. ఇదంతా చేసింది కూనయ్యే! ఈ నగలను పట్టుకుపోయి కూతురి పెట్లో పెట్టి తిరిగొచ్చాడు. అతడి గది సోదాచేస్తే పోలీసులకు ఏమీ దొరికేది కాదు!" అన్నాడు గిరి.

వాలి మౌనంగా వుండిపోయాడు. నగలమీద రక్తం మరకలు యెక్కడా లేవు. కూనయ్యకు ఆమెతో అక్రమ సంబంధం వుందా? తలుపులు తెర్చి కూనయ్యను ఆమె లోపలకు రానిచ్చిందా? కాని కూనయ్య ఆమె నెందుకు చంపాడు? సంచిలో నగలు మాత్రం యెందుకున్నాయి? రొఖ్ఖం యెందుకు లేదు? వాలి మెదడులో విశేషంగా ఆలోచనలు సాగుతున్నాయి.

"వాలిగారూ, మనం ఆలస్యం చేస్తే కూనయ్య పారిపోవచ్చు! వెళ్ళి అతడిని అరస్టుచెయ్యాలి" అన్నాడు గిరి.

"గిరీ, యీ సంచిని ఇన్‌స్పెక్టర్ నాయర్‌కి అందజేయి" అని వాలి వెనకవైపుకు వెళ్ళాడు.

వేగంగా మెట్లు దిగి కిందకు చేరుకున్నాడు. కూనయ్య తన గది ముందు నిలబడి వున్నాడు. వాలి అతడి కెదురుగా వెళ్ళి నిలబడ్డాడు.

"కూనయ్యా, నువ్వు నీ కూతురి గుడిసెలో పెట్లో పెట్టిన సంచిని రామయ్య సహాయంతో మేం వెళ్ళి పట్టుకొచ్చాం!" అన్నాడు వాలి.

అతడి మొహంలో నెత్తురు చుక్క లేదు. అతడు అమాంతంగా నేల కూలిపోయాడు. వణుకుతున్న అతడి చేతులు వాలి కాళ్ళను పట్టుకున్నాయి. అతడు ఏడుస్తున్నాడు.

"ఆమెను యెందుకు చంపావు?" బులెట్‌లా వెలువడింది వాలి ప్రశ్న.

"నేనామెను చంపలేదు సార్."

"ఆ నగలు నీకెలా వచ్చాయి?"

"నా గదిలో పడుకున్నాను, సార్. ఒంటికి పోదామని బయటకొచ్చి గోడవారగా వెళ్ళాను. బాగా చీకటిగా వుంది. ఎవరో మెట్లమ్మట కిందకు దిగి చీకట్లోకి పోవడం వెనక్కు తిరిగి చూశాను."

"ఎవరతను?"

"చీకట్లో అతడిని నేను పోల్చలేను."

"అతడు ఎటువైపు వెళ్ళాడు?"

"ఎడంవైపుకు తిరిగి వెళ్ళిపోయాడు."

"నువ్వు ఏం చేశావు?"

"అతడు పైకి యెందుకెళ్ళాడో తెల్సుకుందామని మెట్లెక్కాను. ఒక తలుపు తెరిచి వుంది. లోపలకెళ్ళాను.

బాత్ రూమ్‌లో రక్తమయంగా ఆమె పడుంది. ఒంటి మీదున్న నగలు లైటు కాంతిలో మెరుస్తున్నాయి. నగల్నీ, వాచ్‌నీ తీసేసి, వాటిని పట్టుకుని కిందకు పరుగెత్తాను. వాడు మళ్ళా వస్తాడేమో అని నా భయం! రాత్రి నాకు నిద్రపట్టలేదు. అవి నా గదిలో ఉంటే ప్రమాదం. ప్రతిరోజూ ఏడింటికి ఆఫీసుకుపోయే కామరాజుగారు యివాళ ఆరింటికే వెళ్ళిపోయారు. సంచిలో అవన్నీ పెట్టి నేను కూతురింటికి వెళ్ళాను. అది గుడిసెలో లేదు. పనిచేయడానికి పోయి ఉంటుంది. సంచిని అక్కడ పెట్టి తిరిగొచ్చాను" అన్నాడు కూనయ్య.

ఆలోచిస్తూ వాలి మెట్ల దగ్గరకు వెళ్ళాడు. ఎడం వైపుకు తిరిగి వేగంగా నడిచాడు. కొంచెం దూరం వెళ్ళాక కామరాజు ముందుగుమ్మం కనిపించింది. తలుపులు మూసి ఉన్నాయి.

వాలి తలుపును తట్టాడు. కాసేపయ్యాక ఒక స్త్రీ తలుపు తెరిచి వాలివైపు చూసింది. ఆమె వయస్సు అరవై పైన ఉంటుంది. తెల్లటి చీర, అదే రంగు రవిక. మెళ్ళో నగలులేవు. జుత్తు బాగా నెరిసింది.

"కామరాజు ఉన్నాడా?" అడిగాడు వాలి.

"లేడు. ఆఫీసుకెళ్ళాడు" అందామె.

"నిన్న రాత్రి పదకొండు తర్వాత అతడు మా యింటికొచ్చి నక్లెసు యివాళ పొద్దుటే వచ్చి డబ్బిస్తానన్నాను" అన్నాడు వాలి.

"నిన్న రాత్రి వాడు మీ యింటికా వెళ్ళ?" అడిగిందామె.

వాలి తలాడించాడు.

"రాత్రిళ్ళు నాకు నిద్రపట్టదు బాబూ. పన్నెండు

కొద్దూంటే వాడు వెళ్లాడు. నేను మెలుకువగా ఉండడం చూసి ఫ్రెండ్ యింటికెళ్ళి వస్తానని చెప్పాడు. తలుపు తాళంవేసుకు పోయాడు. ఇలా అర్ధరాత్రివేళ అబ్బాయి తిరగడం నాకు నచ్చదు. బాబూ మిమ్మల్ని వేడుకుంటున్నాను. మావాడికి యిటుపైన ఆ విస్కీ యివ్వకండి!" అందామె.

"విస్కీ నేను తాగను, యెవరికీ ఇవ్వను. అతడు మరెక్కడో తాగివచ్చి ఉంటాడు" అన్నాడు వాలి.

వాలి ఆమెవైపు మౌనంగా చూశాడు.

"మీ ఇంట్లో ఫోనుందా?"

"ఉంది బాబూ."

"ఒకసారి ఫోన్ చేసి మీవాడితో మాట్లాడాలి!"

"రండి, లోపలకు" అందామె.

ఆమె వెనక్కు కదిలింది. విశాలమైన హాల్లోకి వెళ్ళాడు వాలి.

"మీ అబ్బాయి నంబరు తెలుసా?"

ఆమె నంబరు చెప్పింది. వాలి టెలిఫోన్ దగ్గరకు నడిచాడు. వెనుతిరిగి ఆమెవైపు చూశాడు.

"ప్లీజ్, మంచినీళ్ళు ఇవ్వండి" అన్నాడు.

ఆమె లోపలకు వెళ్ళింది. అతడు నంబరు తిప్పాడు.

"హలో, రామ్ టింబర్ కంపెనీ!"

"కామరాజుగారున్నారా?" అడిగాడు వాలి కంఠం మార్చి.

"కామరాజు స్పీకింగ్!"

"నేను సుందరాన్ని సార్, గుర్తున్నానా? అమ్మను యెవరో చంపారు!"

"గుడ్ హెవెన్స్! షాకింగ్!"

"హంతకుడు దొరికాడులెండి. పోలీసులు మీ నౌఖరు కూనయ్యను అరెస్టు చేశారు. అతడి దగ్గర అమ్మ నగలన్నీ దొరికాయి. నాలుగు దెబ్బలు వేయగానే తనే ఆమెను చంపానని వాడు ఒప్పేసుకున్నాడు. ఇక్కడ మేమందరం విచారంతో ఏడుస్తున్నాం. మీరు వెంటనే వచ్చి మాకు ధైర్యాన్నివ్వాలి!"

"సుందరం, నేను వస్తున్నా. ఆమె చాలా మంచిది. యెందరికో సహాయం చేసింది. ఐ యామ్ కమింగ్!"

"ప్లీజ్" ఏడుపు కంఠంతో అంటూ వాలి రిసీవర్ని పెట్టేశాడు.

ఆమె తెచ్చిన గ్లాసును అందుకుని నీళ్ళను గడగడ తాగేశాడు. బయటకొచ్చి వాలి మెట్లమ్మట పైకి పరుగెత్తాడు. హాల్లో ఇన్స్పెక్టర్ నాయర్ అతడికెదురుగా వచ్చాడు.

"వాలిగారూ, స్కాచ్ విస్కీ బాటిల్ మీద ఇద్దరి వేలిముద్రలు ఉన్నాయి. శమంత వేలిముద్రలు ఉన్నాయని మా ఫింగర్ ప్రింట్స్ వాళ్ళు పోల్చారు. తతిమ్మా వేలిముద్రలు యెవ్వరివో తెలియడంలేదు," అన్నాడు ఇన్స్పెక్టర్ నాయర్.

"నాయర్ భాయ్, సుందరాన్ని ఓదార్చడానికి కింద నివశించే కామరాజు వస్తున్నాడు. ఆ వేలిముద్రలు అతడివేమో చూడమను!"

ఇన్స్పెక్టర్ నాయర్ ఆశ్చర్యంగా చూశాడు.

"వాలిగారూ, కూనయ్యని అరెస్టు చెయ్యనా?"

"అతడు పారిపోకుండా జాగ్రత్తపడు!" అన్నాడు వాలి.

"ఒక కానిస్టేబుల్ని అతడి గదిముందు కాపలా ఉంచాను. కామరాజు వేలిముద్రలు యెందుకు సార్?"

"చూశాక నీకే తెలుస్తుంది!" అన్నాడు వాలి.

గబగబా నడుస్తూ కామరాజు హాల్లోకొచ్చాడు. సోఫాలో కూర్చున్న సుందరం ముందుకు వెళ్ళాడు. సుందరం ఏడ్వసాగాడు. కామరాజు అతడిని ఓదార్చుతున్నాడు.

మెల్లిగా వాలి అతడి దగ్గరకు వెళ్ళాడు. ఇన్స్పెక్టర్ నాయర్ ఫింగర్ ప్రింట్స్ వాళ్ళతో అక్కడికొచ్చాడు. గిరి ఒక గ్లాసులో మంచినీళ్లు తెచ్చి కామరాజుకిచ్చాడు.

"కామరాజుగారూ, యీ నీళ్ళు యెలాగేనా అతడి చేత తాగించండి. పొద్దుటనుంచి ఏడుస్తున్నాడు" అన్నాడు గిరి.

కామరాజు గ్లాసును అందుకున్నాడు.

"సుందరం, ధైర్యం తెచ్చుకో! ఈ మంచినీళ్ళు తాగు!"

"ప్లీజ్ వద్దు!" అన్నాడు సుందరం.

"తాగేటట్లు లేడు" అని గిరి గ్లాసును తీసుకుని ఫింగర్ ప్రింట్స్ వాళ్ళకు అందించాడు.

వాళ్ళు పడగ్గదిలోకి వెళ్ళిపోయారు. ఇన్స్పెక్టర్ నాయర్ వాళ్ళ వెనకనే పరుగెత్తాడు.

  

"కామరాజూ, నిన్న రాత్రి నువ్వు పన్నెండు ప్రాంతంలో యెక్కడున్నావు?" అడిగాడు వాలి.

"నా గదిలో నిద్రపోతున్నాను."

"ఏ ఫ్రెండ్ ఇంటికో వెళ్ళావని నీ తల్లి చెప్పింది!"

కామరాజు తృళ్ళిపడ్డాడు.

"నువ్వు వెనక మెట్లు దిగిపోతుంటే చీకట్లో నిలబడిన కూనయ్య నిన్ను చూశాడు!" అన్నాడు వాలి.

కామరాజు గుండె దడదడ లాడ్తోంది.

"శమంత పడగ్గదిలోని విస్కీ బాటిల్ మీద, సోడా బుడ్లమీద నీ వేలిముద్రలు ఉన్నాయి" గర్జించాడు వాలి.

కామరాజు నోటమ్మట మాట పెగల్లేదు.

సోఫాలో కూర్చున్న కామరాజు నేలమీదకు కూలి పోయాడు.

"ఆమెను యెందుకు చంపావు?" అడిగాడు వాలి.

"ఆమె పదేళ్ళగా తన శరీరాన్ని నాకిచ్చేది. నేను డబ్బడిగితే తన దగ్గర లేదంది. నేను కష్టంలో వున్నాను. నా కంపెనీ డబ్బును అధికంగా నేను వాడుకున్నాను. ఆ డబ్బును నేను బాంకిలో వేయాలి. లేకపోతే నేను జైలు కెళ్ళవలసి వస్తుంది. ఆ పరిస్థితుల్లో ఆమెను చంపి, బీరువాలో వున్న నోట్లకట్లను పట్టుకు వెళ్ళిపోయాను."

"ఎంత పట్టుకుపోయావు?"

"నేనింకా లెఖ్ఖ పెట్టలేదు."

"నువ్వు పైకి ఎలా వచ్చావు?"

"కిందనుంచి ఫోన్ చేసి మాట్లాడాను. పన్నెండింటికి రమ్మంది. వెనుక తలుపులు ఆమే తెర్చింది. అలా రాత్రిళ్లు కలుసుకోడం మాకు అలవాటే!"

వాలి పక్కనున్న యిన్స్పెక్టర్ నాయర్ వంక చూశాడు.

"నాయర్ భాయ్, అడుగో శమంత హంతకుడు!" అన్నాడు వాలి.

ఇన్స్పెక్టర్ నాయర్ కామరాజు చేతులకు బేడీలు వేశాడు.

వాలి, గిరి ముందు మెట్లమ్మట కిందకు దిగారు. ఇన్‌స్పెక్టర్ నాయర్ వెనక నే వెళ్ళాడు.

ఆరిపోయిన చుట్టను దూరంగా విసిరి వాలి మరో చుట్టను లైటర్‌తో వెలిగించి కార్లో కూర్చున్నాడు. నాయర్ నవ్వుతూ వాలికి నమస్కరించాడు.

"మీరు రావడం వలన యీ హత్యకేసు కొన్ని గంటల్లో తేలిపోయింది. మీకు నా ధన్యవాదాలు" అన్నాడు యిన్‌స్పెక్టర్.

వాలి నవ్వుతూ యిన్‌స్పెక్టర్ వైపు చూశాడు. గిరి కారును వెనక్కు తిప్పి పోనిచ్చాడు.

—: ఐపోయింది :—

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చెరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 9/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ'

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 108/-లు ముందుగా పంపవచ్చును.

# (పదహేడవ భాగం)

సెకండ్ల ముల్లు 50 అంకె చేరుకుంది. యింకా పది సెకండ్లు.

తొమ్మిది....

రాణా గొంతు తడారిపోయింది.

ఏడు.... ఐదు.... రెండు....

ఒకటి....

రాణా వంగి, రెండు చేతుల మధ్యా తలదాచుకున్నాడు. సుబేదార్ మాట త్రిప్పటం చూడ్డం యిష్టం లేక.

అంతే!

బ్రహ్మాండమైన ప్రేలుడు!....

భూమి అదిరే విస్ఫోటం....

హోరున శబ్దం....

దొర్లుతున్న కొండరాళ్ళ చప్పుడు....

చెవులు పగలగొడుతూ పిడుగులు దొర్లే ధ్వని.

రాణా చేతుల్లో తలవంచుకుని కూర్చున్నాడు ఎగిరే కొండరాళ్ళు మీద పడ్తాయన్న భయంతో.

అలాంటిదేమీ జరగలేదు.

అలాగే ఉండిపోయాడు రాణా, తలపై చేతులు ఉంచుకుని సుబేదార్ చేతులు తన భుజాలమీద పడే దాకా.

"ఇట్సాల్ రైట్ సార్! పని చక్కగా పూర్తయింది" సుబేదార్ మోకాళ్ళమీద కూర్చుని టన్నెల్ ద్వారంవైపు చూస్తున్నాడు గర్వంగా తల ఊపుతూ.

దిమ్మ పట్టాయి రాణా చెవులు.

తల పైకెత్తి చూసాడు—ప్రేలుడు ఫలితం తెల్సు

కోవాలన్న ఆత్రుతతో. పొగమంచుతో కూడిన దుమ్ము, సొరంగ ముఖ ద్వారంవద్ద సింగుర్లు తిరుగుతోంది కాని కొద్ది క్షణాల తర్వాత దుమ్ముకొట్టుకుపోయింది.

రాణా, తాను చూసిన దృశ్యాన్ని చూసి నవ్వ గలిగాడు. కొండరాళ్ళు ముఖద్వారాన్ని పూర్తిగా కప్పే శాయ్ గోడ కట్టినట్లుగా.

యికముందు అక్కడ ముఖద్వారం ఉండేదని ఎవరూ గుర్తించలేరు....

నవ్వుతున్న సైలో చేతిమీది అభినందన పూర్వకంగా చేతో తడుతూ—రేడియో అందుకున్నాడు రాణా.
"హల్లో ప్రొఫెసర్ అశ్వత్థామా!"

సుబేదార్ పల్లంలోకి దిగి కప్పబడిన ముఖద్వారంకేసి నడుస్తున్నాడు.

టన్నెల్ కెదురుగా నిలబడి డామేజ్ని నిశితంగా పరీక్షించాడు.

తర్వాత సంతృప్తిగా వెనక్కు తిరిగి, రాణావైపు చూస్తూ బ్రొటనవేలు పైకెత్తాడు.

"హల్లో ప్రొఫెసర్! కెన్ యు హియర్ మీ?"

మరో రెండు క్షణాలు నిశ్శబ్దం....

అప్పుడు అశ్వత్థామ కంఠం "హల్లో....హల్లో.... రాణా!.... కెన్ యు హియర్ మీ?"

"యస్. ఐ కెన్ ప్రొఫెసర్."

"బ్రహ్మాండమైన ప్రేలుడు....అవునా?....యిటువైపు పనికూడా సంతృప్తిగా ముగిసింది. కాప్టెన్—దగ్గర్నుంచి పరీక్షించడం కోసం వెళ్ళాడు....బట్ ఫ్రం హియర్ ఇట్ లుక్స్ ఫైన్....నీవైపు ఎలా జరిగింది?"

"యిటువైపు ద్వారం అంగుళం కూడా ఖాళీలేకుండా

కంప్లీట్ గా సీలు చేయబడింది. సుబేదార్ సైలో దగ్గ ర్నుంచి ఎక్జామిన్ చేసి ఓ.కే. గుర్తు యిచ్చాడు."

"ఎక్సలెంట్ ....ఎక్సలెంట్ .... నేనుకూడా ఇప్పుడు టన్నెల్ వైపు వెళుతున్నాను దగ్గర్నుండి చూడ్డాన్కి. ప్రేలుడుద్వారా ఏర్పడిన గుమ్మ్మ ఇపుడే మాయమౌతోంది. ప్రేలుడు ఫలితాన్ని యిప్పుడు దగ్గరగా చూడ గలుగుతున్నాను. ఎస్ ....ఎస్ .... నేను దగ్గరకెళ్ళేకొద్దీ బాగా కనబడుతోంది....పల్లంలో నా క్రిందగా ఉన్న కెప్టెన్ నగర్వాలాను చూడగలుగుతున్నాను. అతను వెనక్కి తిరిగి నావేపు చూస్తున్నాడు.... చేతులూపుతున్నాడు....గుడ్ ....గుడ్ ... ఐ థింక్ హి ఈజ్ హాపీ! తన రెండు చేతులతో కరచాలనం చేసుకుంటున్నాడు.."

స్పీకర్ లోంచి గరగరశబ్దం వినబడసాగింది.

దాన్ని ప్రొఫెసర్ నవ్వుగా గుర్తించాడు రాణా. తిరిగి అశ్వద్ధామ కంఠం చెప్పసాగింది: "ప్రస్తుతం బ్లాకేజ్ ప్రక్కగా నడుస్తున్నాను. ముఖద్వారం బలంగా, దట్టంగా సీలు చేయబడింది. పదిహేను అడుగుల పైగా.... ఓ కాంక్రీట్ దిమ్మ వంకరగా తిరిగి ఉంది. అది....అది" టూవే రేడియో రెండుక్షణాలు మౌనం వహించింది.

మళ్ళీ పలికింది ప్రొఫెసర్ కంఠం. ఆ కంఠంలో కొత్తగా యేర్పడ్డ ఆరాటం, భయం గమనించకపోలేదు రాణా. "దేరీజ్ సమ్‌థింగ్!....అక్కడ....అక్కడ.... ముఖద్వారం పైకప్పులో ఉండే సిమ్మెంట్ దిమ్మపై నుంచి దుమ్ము పొగలు కక్కుతోంది.... లేదు.... దాని "వెనక" నుంచి....అది దుమ్మా?.... మేఘంతాలూకు పొగా?...."

ఒక్కక్షణం నిశ్శబ్దం....

"లేదు!.... పొగమంచు క్లియర్ అయిపోయిందే యిక్కడ?.... ఖాళీ అయి వుండాలి.... నేను దగ్గరగా వెళ్ళి చూస్తాను.... అది వేగంగా బయటికి వస్తున్నట్లు కనబడు తోంది. ఆవిరి కక్కుతున్నట్లు.... యిప్పుడు దానికి దగ్గరగా ఉన్నాను. స్పష్టంగా చూడగలుగుతున్నాను కాంక్రీట్ దిమ్మ వెనుకభాగం...."

మళ్ళీ మాటలు తెగిపోయాయి.

...."యిక్కడ కన్నం వుంది!!"

రాణా అదిరిపోయాడు.

...."మైగాడ్!! పైకప్పులో ఓ ఖాళీ యేర్పడింది.... దెరీజ్ ఎ గాప్!....విష మేఘం!!....అది బైటికి తప్పించు కొంటోంది.... ఇది ఎలా సాధ్యం.... బాంబు ప్రేలుడు ఒత్తిడికి యిలా జరిగివుండాలి. బహుశా టన్నెల్ లోపల ఉండిపోయిన గాలి పొగమంచును నెట్టివేస్తూ వుండాలి. అదే అయ్యుండాలి. లేకపోతే విష మేఘం తప్పించుకోడం అసంభవం. హోలీగాడ్! దెరీజ్ ఎ లైట్!! కన్నం ప్రకా శిస్తోంది, తీవ్రమైన వెలుగుతో. కాంతి బైటికి వస్తోంది. మనం టన్నెల్‌లో చూసిన కాంతే యిది! పసుపురంగు కాంతి!! నో....నో....నో!...మైకోప్లాస్మా తప్పించుకు పోతోంది!....అది మేఘంతో కల్సిపోయి ధారాళంగా బైటికి వస్తోంది!! ఐ మస్ట్ గెట్ అవే ఫ్రం హియర్! నేను దూరంగా పోవాలి ..."

జీవం కోల్పోతూ రేడియో అకస్మాత్తుగా మౌనం వహించింది.

రా....ణా....

....అనేక సంవత్సరాల తర్వాత....

మొట్టమొదటిసారిగా.... నేలమీద చతికిలబడి....

బిగ్గరగా....

ఏడ్వాసాగాడు....

* * *

"రాణా! ...సుబేదార్, సైలో!.... కెన్ యూ హియర్ మీ....?"

రాణా ఉలిక్కిపడి తలెత్తాడు.

ముందుకు వంగి రేడియో దగ్గరగా లాక్కున్నాడు. రిసీవర్ చలనం కోల్పోయిన తర్వాత—తను ఎంత టైం వృథా చేసింది తెలియలేదు రాణాకి.

కొద్ది క్షణాలే అయివుండొచ్చు ...కొద్ది నిముషాలు అయివుండొచ్చు....హతాశుడై కూలిపోయిన రాణా టైం గుర్తించలేదు.

విష మేఘం!....

ఆ పీడకలను వొదిలించుకునే మార్గంలేదా?

దాన్ని నాశనం చేయడంలో మనిషి ఎన్నటికీ సఫలం కాలేడా?

"హెలో! నేను, రాణాని మాట్లాడుతున్నాను" ఆతృతతో పలికాడు స్పీకర్‌లో, "అశ్వత్థామా?"

"కాదు. కాప్టెన్ నగర్వాలాని మాట్లాడుతున్నాను. స్పెషల్ వాన్‌లో ప్రొఫెసర్ అశ్వత్థామ నా పక్కనే ఉన్నాడు. ఆయన కండిషన్ బాలేదు."

"వాట్ హేపెండ్?"

"మైక్రోప్లాస్మా!...అది తప్పించుకు బైటపడింది.... ప్రొఫెసర్ వెహికిల్ దగ్గరగా పడుండడం గమనించాను. ఆయన ముందుగా తేలుకుంటూ వెళ్తున్న కాంతివంతంగా మెరిసే పదార్థాన్ని చూసాను. దూదిపింజాల్లాంటి మేఘంతో కల్సి అది కొట్టుకుంటూ వెళ్ళింది. బహుశా

ప్రొఫెసర్ మీదుగా అది ప్రయాణించి ఉండొచ్చు.

బరువుగా గాలి లోనికి పీల్చాడు రాణా. "ఈజ్ హి ఆల్ రైట్?"

"ఐ డోంట్ నో, .... మత్తుగా బెదిరిపోయినట్లు ఉన్నాడాయన....ఆయన్ని వాన్ లోకి లాగాను. కాని హెల్మెట్ తొలగించి పరీక్షించే రిస్కు తీసుకోలేదు. ఆయన పరిస్థితికి భయమే కారణమనుకుంటూ .... అది తప్పించుకుని పారిపోయి తనవైపు రావడం చూసి షాక్ అయివుంటాడు. ఎనీవే, ఒక నిముషం క్రితం కోలుకున్నట్లు కన్పించాడు. దాన్ని అనుసరించమని చెప్పాడు. ఎట్టి పరిస్థితుల్లోనూ, ఈసారి దాని ఉనికిని కోల్పోకూడదని చెప్పి హఠాత్తుగా వెనక్కి వాలిపోయాడు, స్పృహ కోల్పోయినట్లుగా. ప్రస్తుతం కొంచెం తేరుకుంటున్నట్లు అనిపిస్తోంది."

"నగర్వాలా! ప్లీజ్ బీ కేర్ ఫుల్" బ్రతిమాలాడు రాణా "ఆయన్కి ఆ వ్యాధి సోకి ఉండొచ్చు."

"నో__ఐ డోంట్ థింగ్ సో....ఈ దుస్తులు చాల దృఢమైనవి .... పైగా మాస్క్ ఎటాచ్ చేయబడ్డ హెల్మెట్ వుంది....ఆయన షాక్ తిని ఉంటాడంతే. ఏది ఏమైనా.... నేను ఆ మెరిసే పదార్థాన్ని....ఐ మీన్.... నూక్లియస్ని నీడలా వెంటాడుతున్నాను, నా దృష్టి పథంనుండి తప్పించుకోకుండా జాగ్రత్తపడుతూ. మేము ఎంతో దూరం పోలేదు. అర ఫర్లాంగ్....అంతే! అది ఎడంవైపు కె....రాణా!మాముందు పొగమంచులోంచి.... రెండు బిల్డింగ్స్లాంటి ఆకారాలు కనబడుతున్నాయి.... అవి.... అవి....యస్ రాణా....గాస్ హోల్డర్స్ అవి.... గుండ్రంగా, వెడల్పుగా .... తాటిచెట్టంత ఎత్తులో

ఉన్నాయి గాస్ సిలిండర్స్!...."

రాణాకి ఆ ప్రాంతం గూర్చి బాగా తెలుసు. నాలు గైదుసార్లు అటువైపు ప్రయాణించాడతను. అది ఓ ఫాక్టరీ....సముద్ర తీరంలోవున్న గాస్ రిఫైనరీ.... 'బాంబే హై' లోని పెట్రోల్ తీసే సాగర్ సామ్రాట్ నుంచి కొన్ని వాయువులు గొట్టాలగుండా ఒడ్డుకువస్తాయి. దాన్ని మార్పులుచేసి, వంటగాస్ గా పరిశుభ్రంచేసి, బొంబాయి నగరమంతా సప్లయిచేస్తుంది ఆ కర్మాగారం. ONGC (నూనె మరియూ సహజ వాయువుల కమిషన్) ఆధ్వర్యంలో నడుస్తోంది ఆ రిఫైనరీ. టాంకులు, టవర్లు వెండిరంగులో మెరుస్తుంటాయి, ఫాక్టరీ చుట్టూ. ప్రధానంగా రెండు బ్రహ్మాండమైన గాస్ టాంకులు ముందు భాగంలో ఉంటాయి సిలిండర్ ఆకారంలో పైకి.

నగర్వాలా చూసినవి అవే అయివుంటాయి. వాటి వెనుక చిన్న చిన్న టాంకులు ఉంటాయి. ఆ రిఫైనరీ సముద్రం వొడ్డున నిర్మించబడింది. దేశంలో వున్న గాస్ రిఫైనరీల్లో అది అన్నిటికంటే పెద్దది.

"రాణా! వాటీజ్ దిస్ ప్లేస్?"

ఆ కంఠం అశ్వత్థామదిలా తోచింది రాణాకి.

"ప్రొఫెసర్! మీరేనా మాట్లాడేది?" ఎంతో ఆతృతతో అడిగాడు రాణా "ఆర్ యూ ఓ.కే. సర్?"

"ఎస్....ఎస్....కొంచెం నీరసంగా ఉంది—అంతే. యిప్పుడు చెప్పు! వేగంగా....ముందు ఉన్న స్థలం గురించి నీకేం తెల్సు?"

రాణా తనకు తెల్సున్నదంతా పూసగుచ్చినట్టు చెప్పాడు....ఆ ఫాక్టరీ ఏమిటో....అవసరమైతే లోనికి యెలా వెళ్ళాలో....

"లోపలికి వెళ్ళక—తప్పదని అనుకుంటున్నాను" గంభీరంగా వినబడింది అశ్వత్థామ కంఠం "విష మేఘం, గుండెకాయ....ఆ న్యూక్లియస్ అటువైపే ప్రయాణి స్తోంది... యెంత విచిత్రంగా ఉంది?? సాధారణంగా గాస్ మండే ప్రక్రియలో పెద్ద పెద్ద పరిమాణాల్లో కార్బన్ డై ఆక్సైడ్, సల్ఫర్ డై ఆక్సైడ్ ఉత్పత్తి అవుతాయ్. ఈ వాయువులే మనచుట్టూ ఉన్న వాతా వరణాన్ని కాలుష్యం చేస్తాయి. యిప్పుడు విషతుల్యమైన ఈ మైక్రోప్లాస్మా తను ప్రమాదంలో ఉన్నట్టు గ్రహించినట్లు ఆ వాయువుల పంచన చేయతోంది.... శక్తిని సరిచేసుకుని వాటి ద్వారా తిరిగి బలం పుంజు కోవడాన్కి....”

"....అహా! కాప్టెన్ నగర్వాలా నువ్ చెప్పిన సైడ్ రోడ్ గమనించాడు.... మేం ఇప్పుడు అందులోకి మలుపు తిరుగుతున్నాం....యిప్పుడు మేం ఆ గాస్ సిలిండర్స్‌కి దగ్గరయ్యాం. మా తలలమీద అవి బ్రహ్మాండమైన ఆకా రాలతో కనబడుతున్నాయి. ముందు ఓ గేటుఉంది. మేం అందులోంచి వెళ్ళబోతున్నాం.... ఆఁ! ఇప్పుడు న్యూక్లియస్ కనబడుతోంది.”

"వెరీజిట్ నా? ఎక్కడుందది?" అరిచాడు రాణా రిసీవర్లో.

జవాబుగా....పొడిపొడిగా నవ్వు వినబడ్డటనిపించింది రాణాకి. "ఎందుకు? ఎక్కడ ఉంటుందనుకున్నావ్ మిస్టర్ రాణా....గాస్ టాంకర్ల మధ్యగా వాతుకుని వుందది—యిద్దరు రాక్షస తల్లితండ్రుల మధ్య బుల్లి రాక్షసుడిలా."

రెప్పవేయకుండా రిసీవరు వైపు చూసాడు రాణా.

అశ్వత్థామ కంఠంలో చపలచిత్తత, మార్పు... ధ్వనించాయి.

తిరిగి, వెనుదిరిగి వచ్చిందా కంఠం—చురుగ్గా, పదునుగా పలుకుతూ—

"....నగరమంతా సప్లయి చేయబడే ఈ గాస్‌లో ఏమేమి చేరి ఉన్నాయో నీకు తెల్సా రాణా?? నన్ను చెప్పనీ!....యాభై శాతం హైడ్రోజన్, యిరవై నుంచి ముప్పై శాతం—మిథేన్, ఏడునుంచి 17 శాతం కార్బన్ మోనాక్సైడ్....మూడు శాతం కార్బన్-డై-ఆక్సైడ్.. 8 శాతం నైట్రోజన్, రెండు శాతం హైడ్రోకార్బన్స్.. యివన్నీ కలగలిపిన విషపూరిత వాయువే ఆ గాస్. దాంట్లో యింకా ...." చెప్పుకుంటూ పోయాడు అశ్వత్థామ శ్రద్ధగా వింటున్న విద్యార్థికి—కెమిస్ట్రీ బోధిస్తున్నట్టుగా.

"అమోనియా, గంధకం, హైడ్రో సయానిక్ యాసిడ్, బెంజీన్....యింకా అనేక పదార్థాలు ఈ గాస్‌లో మిళితమై ఉన్నాయ్. యింకో మాటలో చెప్పాలంటే అతి సున్నితమైన, అతి తీవ్రమైన 'మందే' మిశ్రమం! ఒక విధంగా....పొరపాటుగా....ఈ మైక్రో ప్లాస్మా మనకు సమస్యా పరిష్కారాన్ని సూచిస్తోంది.... ఏమంటావ్ రాణా?...."

రాణాని తీవ్రంగా కలవరపరుస్తూ తిరిగి రేడియో మౌనం వహించింది, జవాబు యిచ్చే అవకాశం లేకుండా.

"హే భగవాన్...." గాభరాగా గొణుక్కున్నాడు రాణా. ప్రొఫెసర్ ఆ గాస్ టాంకుల్ని నిలువుగా పేల్చబోతున్నాడు—మైక్రోప్లాస్మా పదార్థంతో సహా!!

(ఇంకా వుంది)

